

నిర్మాణంలోవున్న నాగార్జునసాగరం ఆనకట్ట.



ఏప్రిల్ 9 న ఆనకట్ట దగ్గర జరిగిన నాగార్జునసాగరం
కంట్రోలు బోర్డు 30 వ సమావేశం.

# ఆంధ్రప్రదేశ్

సంపుటి 5 | మే 1961 | సంచిక 7
వైశాఖ-జ్యేష్ఠ-1883 శకము

## విషయసూచిక

*ముఖచిత్రం* : గురుదేవుడు రవీంద్రనాథ టాగూరు శతజయంత్యుత్సవాలు దేశవ్యాప్తంగా జరుగుతున్నవి.

*వెనుకఅట్ట* : మోతీలాల్ నెహ్రూ-వీరి శతజయంత్యుత్సవాలు ఈ నెల దేశమంతా జరుపబడుతున్నవి.

## వచ్చే సంచికలో—

| | |
|---|---|
| ప్రవరుని అకామత | ... శ్రీ బెల్లంకొండ రాఘవరావు |
| శౌర్యజ్యోతి | ... శ్రీ ఉప్పాడ రాజారావు |
| పాడిగిత్త (కథానిక) | ... శ్రీ తాళ్లూరు నాగేశ్వర రావు |
| శ్రీ సింహాచలక్షేత్రము | ... శ్రీ మండ సూర్యనారాయణ |
| గొలుసు (నాటకం — రెండో అంకం) | ... బుచ్చిబాబు |

ఇంకా యితర వ్యాసాలు, పద్యాలు, విశేషాలు......

## చందా వివరాలు (1961 జూన్ నెలనుండి)

| | | |
|---|---|---|
| సంవత్సరానికి | — | 3 రూపాయలు |
| విడి ప్రతి వెల | — | 25 నయాపైసలు |

**Edited & Published by the Director of Information & Public Relations, Andhra Pradesh, Hyderabad-1**
**Printed at Yuva Press, Public Garden Road, Hyderabad-1**

# భీష్మ గ్రీష్మము

పైడిపాటి సుబ్బరామశాస్త్రి

తనకుఁ బెద్దఱికమ్ము తప్పదంచును తెల్పు
    జ్యేష్ఠమ్ము తనలో వసించు ఋతువు
ఏఱులం బూజించి యేఱువాకలు సాగ
    జీవనాధారమై చెలగు ఋతువు
కర్కాటకమ్ము సంక్రమణమందున రవి
    కయన సంధిగ నిల్చినట్టి ఋతువు
కనులు వృత్తులు చేయు కాపు చూపులలోన
    తొలకరి చినుకులఁ దొలకు ఋతువు

వేసఁగిని భూమి యెంతగా వేగివేగి
నెఱులుగా విచ్చునో పంట సిరుల నంత
తెచ్చునను సూక్తి కీర్తిమందిరముఁ గట్టు
శక్తిమంతమ్ము ఋతువు గ్రీష్మమ్ము వచ్చె.

పలనాటి ఖద్దరుబట్ట చిటచిటలాడి
    నారి మేన్మెఱసె పొందూరు చీఱ
మంచిగంధము పూసి మల్లెమాలలఁ దాల్చి
    విసరిరి వట్టి వేర్వీవనలను
పవటి చివళులుచూడ పరమరమ్యమ్ములై
    కుతకుతల్ తగ్గి యోగ్యత గడించె
హార్మ్యోపరిస్థ చంద్రాతపమ్మున రేల
    గడుపగా గాటంపు కాంక్ష కలిగె

తాటిముంజలు ఖర్జూర ద్రాక్ష నీర
మరటి ఫలములు పనసయు నధికముప్పు
కలియు మజ్జిగ టెంకాయ జలములెసగె
రసనలందున గ్రీష్మకాలమ్ము నందు.

కొఱవితో నొకప్రక్క కొరకంచు నొకప్రక్క
వింజామరమ్ములు వీచుచుండ
భుగభుగల్ వెలుగు నిప్పులు తీర్చి దిద్దిన
యరుణాత పత్రంబు మెఱయుచుండ
కుడిప్రక్క మంతిరి నడిమింటి తపనుండు
నగ్ని పత్రంబుల నంది యీయ
పరశురామ ప్రీతికరముగా నాజ్ఞల
కాలకూటమ్ముచే వ్రాలుఁ జేసి
పూని ముక్కంటి సెగమంట మొహరువేసి
పవనునింబంపు నిత్యమ్ము భత్యమిచ్చి
అగ్గి గుఱ్ఱమ్ముఁ దోడిచ్చి యములు జఱుప
ఊష్మ సింహాసనమునుండి గ్రీష్మరాజు.

గిరి సమీపములు నగ్గినిదూసి పోసెను
నదులెండె తృణలతల్ పొదలునెండె
ఆకసమ్మొక సల్లయగిసి పూవాయెను
ఇలనుండి మఱియు దిక్కులును మండె
జంతుజాలము పిపాసాకృష్టమై యెండ
మావులే జలమన్న మాయబడెను
నిఋతి దిగ్వాయువుల్ నెఱపె పడమరలున్
అఖిలజీవుల బల మాహరించె

ఇంచు విలుతుడు శోషించె నింతలైన
పడుచు పిల్లయురమ్ము, కూపస్థ జలము,
మఱ్ఱినీడయు, తాంబూలమహిమ, కతన
చల్లదనమునుఁ బొందిరి జనులు కొంత.

గడ్డకు పుట్టెడుగా నీళ్లు త్రాగియు
పొలములో క్రొత్తగడ్డలనుఁ దోలి
పల్లముల్ పూడిచి, పాటిమట్టినిఁ జిమ్మి
పై నొక్కవరుసగా పఱచి గడ్డి
పశువుల నెరువుకై పండబెట్టియు రేల
పగలది చేనిపై పఱవఁజిమ్మి

ఏతమ్ముతో నీరమెత్తి నార్మడి తన
ప్రాణపదమ్ముఁ గాపాడుకొనుచు
పాటునుంబడ్డ యట్టి దబాటుహాన
దుక్కి సాగించి యనువున మొక్కవేయు
రైతుబిడ్డను గ్రీష్మమ్ము రాయిడింప
లక్ష్యపెట్టడు కృషియందె లక్ష్యముంట.

ఎంత నెండరగుల్కు నంతతీపి తగుల్కు
చూడ ముచ్చటయైన చూతమందు
ఎంతగా నెండలు హెచ్చునంతగ హెచ్చు
పరిమళమ్ముాదు సంపంగియందు
ఎంత లెండలు పేర్చు నంత తావినిఁ గూర్చు
పాటల మల్లికా పద్మములను
ఎంత వెండలు మించు నంతగా మాధురి
నించును పనసల నించులందు

ఆగ్రహమ్మెంతొ యంతటి యార్ద్రబుద్ధి
తరణి సమయమ్ము, చెంచు నుదారబుద్ధి
దిరిసెనపు సౌకుమార్యంపు తేజు నెఱుగు
గ్రీష్మఋతు వల్లభుండన్న కేవలుండె.



బోధమల్పంబు గర్వమభ్యున్నతంబు, శాంతి నిష్పచ్చరంబు మచ్చరము ఘనము
కూపమండూకములఁబోలెగొంచె మెఱిఁగి, పండితమ్మన్యులైన వైతండికులకు.

—శ్రీనాథుడు.

# రవీంద్రుడు - జాతీయత

పి. సి. జైన్

*(దేశమంతటా మే 8వ తేదీ నుంచి విశ్వకవి రవీంద్రనాథ్ టాగూరు శతవార్షిక జయంత్యుత్సవాలు జరుపుకుంటారు. నెహ్రూ పండితుడు నుడివినట్లు మనందరికీ తేజోమార్గము చూపిన రవీంద్ర కవీంద్రుని జన్మదినం ఆనాడు.)*

టాగూరు జన్మించిన నాటికి ఆయన స్వరాష్ట్రమైన బెంగాలులో మూడు గొప్ప ఉద్యమాలు మహోధృతంగా సాగుతున్నాయి. వీటిలో రాజారామమోహనరాయ్ ప్రారంభించిన మతోద్యమము ఒకటి. జాతి కోల్పోయిన ఆత్మశక్తిని పునరుజ్జీవింప చేయడానికై ఆధ్యాత్మిక జీవితాన్ని ఉద్ధరింపజేయడమే ఈ ఉద్యమం లక్ష్యం. ఈ ఉద్యమ ప్రముఖులలో రవీంద్రుని జనకుడు ఒకరు. రెండవది సాహిత్య పునరుద్ధరణోద్యమము. బంకిమ్‌చంద్ర చటర్జీ సాగించిన ఈ ఉద్యమము అప్పటికే ఒక కొత్తదశ నందుకున్నది.

18 వ శతాబ్ది ఉత్తరార్ధంలోనూ, 19 వ శతాబ్ది ఆరంభంలోను బెంగాలు సాహిత్యంలో, సాహితీవికాసానికి ప్రాణప్రదమైనట్టి పటిష్టత, పరిపూర్ణత లోపించినవి. ఈ దుస్థితినుంచి బెంగాలు సాహితీక్షేత్రాన్ని కాపాడిన సుప్రసిద్ధ వంగ సాహిత్యకారుడు శ్రీ బంకించంద్ర ఛటర్జీని గురించి కవీంద్రుడు ఇలా అన్నారు. "బంకించంద్రుడు మా భాషకు నవ్యత్వాన్ని ప్రసాదించాడు. తన మంత్ర దండం ప్రభావంతో ఆయన మా సాహితీ క్షేత్రాన్ని ఆవరించిన తరాలనాటి కారుమబ్బులను మటుమాయం చేశాడు."

దేశవ్యాప్తంగా రాజకీయ చైతన్యం ప్రజ్వరిల్లింది. సామ్రాజ్య వాదుల పట్ల, వారి దమన నీతిపట్ల అంతటా ద్వేషం ప్రబల నారంభించింది. భారత జాతీయ కాంగ్రెసు ఆవిర్భవించని పూర్వం 1875 వ సంవత్సరంలో సుప్రసిద్ధ వక్త, దేశభక్తుడు అయిన బాబుసురేంద్రనాథ్ బెనర్జీ భారతీయ సంఘం అనే సంస్థ నొక దానిని స్థాపించాడు. దేశంలోని వివిధ రాజకీయ శక్తులన్నీ తమ లక్ష్యాల వైపుగా సాహసోపేతంగా పురోగమించగల ఒక శక్తి సంపన్నమైన సంస్థ దరికి క్రమంగా చేరసాగాయి.

*ఉద్యమాల ప్రభావం :*

వంగ దేశంలో రాజకీయ, సాహిత్య, మతోద్యమాలవల్ల ఏర్పడిన పరిస్థితుల ప్రభావం టాగూరుపై హెచ్చుగా పడింది. ఈ ఉద్యమాలలో ప్రముఖపాత్ర వహించిన టాగూరు కుటుంబీకులు భారతీయ సంస్కృతి మూలసిద్ధాంతాలను సంపూర్ణంగా అంగీకరించారు. దీనికి పైన ఒక సౌధాన్ని నిర్మించడానికి వారు ప్రయత్నించారు.

టాగూరు మహాశయుడు తన దివ్యదృష్టితో భవిష్యత్తును సందర్శించాడు. ఆయన ఒక సందర్భంలో, విప్లవం అనివార్యం. కనుక ప్రజలు ముఖ్యంగా భౌతికవాదులు, సుఖజీవనం సంప్రదాయకమైన ఆచార వ్యవహారాలకు అలవడినవారు మిక్కిలి అప్రమత్తతతో సంచరించాలని వ్రాశారు. నవసమాజ నిర్మాణానికై సాధనంగా గురుదేవుడు కవితనూ, విద్యా ప్రచారాన్ని చేపట్టారు. ఆయన తన జీవిత సర్వస్వం అందుకు ధారపోశారు.

*టాగూరు - గాంధీ :*

చాలకాలం వరకు రాజకీయ శాస్త్ర పరిజ్ఞానం సమాజంలోని పై అంతస్తుకు చెందిన వారికి ముఖ్యంగా పాశ్చాత్య విద్య, నాగరికత ఒంటబట్టిన వారివరకు మాత్రమే పరిమితమై వుండింది. కాబట్టి అటువంటివారు సాధారణంగా బర్క్, గాడ్‌స్టోన్, గరిబల్డీ మొదలైనవారి సిద్ధాంతాలవల్ల ప్రేరేపితులు కావడం కద్దు. స్వదేశీయులపట్ల వారికి సహజసిద్ధమైన వాత్సల్యం జనించేదికాదు. రాజకీయ రంగంలో తిలక్, గోఖలే మహాశయులు ప్రజాదృష్టిని ఆకర్షించారనడంలో సందేహమేమీ లేదు. అయితే హిమాలయా పర్వతాల మాదిరిగా వారు జనసామాన్యానికి దూరంగా వుండిపోయారు. గాంధీజీ రంగంలోనికి ప్రవేశించడంతో పరిస్థితిలో పూర్తిగా మార్పు వచ్చింది ఆయన ఎట్టి తారతమ్యం, విచక్షణ లేకుండా దేశవాసు లందరితోనూ కలిసిమెలిసి తిరిగాడు.

గాంధీజీని టాగూరు ఎంతగా ప్రేమించినారో గాంధీజీకూడా

టాగూరుని అంతగానే ప్రేమించేవారు. సత్యాహింసలు ప్రాతిపదికగా గాంధీమహాత్ముడు ఇచ్చిన దివ్య సందేశాన్ని గురుదేవులు కూడా ప్రచారం చేశారు. 1940 వ సంవత్సరంలో "గాంధీ మహరాజ్" అనే శీర్షికతో వ్రాసిన ఒక గేయంలో "గాంధీజీని అనుసరించే మనలో ఒక విషయం మాత్రం అందరిలోనూ కానవస్తుంది. అదేమంటే మనం బీదవారి పొట్టలుకొట్టి జేబులు నింపుకోము. భాగ్యవంతుల ముందు మోకరిల్లం."

ఆత్మశక్తిదే అంతిమ విజయమని టాగూరు ప్రగాఢ విశ్వాసం. 1932 వ సంవత్సరములో మత వ్యవహారాలకు సంబంధించిన అవార్డుపట్ల అసమ్మతి సూచకంగా గాంధీజీ ఎరవాడలో ఆమరణ నిరాహారదీక్షకు పూనుకున్నప్పుడు, దేశ శ్రేయస్సుకై ఆత్మత్యాగానికి సైతం వెనుదీయక సాహసించడం నిజంగా ఎంతటి మహత్కార్యమో టాగూరు గ్రహించారు. అప్పుడు ఆయన బాపూజీని దీక్ష విరమణ చేయవలసిందిగా అర్థిస్తూ తంతి ఇచ్చారు. "....మీ నిరాహారదీక్ష ప్రభావం, మన ప్రజానీకంలో దీనికి వున్న ప్రాముఖ్యతను గుర్తెరుగని మన పాలకులపై ఎంతవరకు వుంటుందో చెప్పలేముకాని మన దేశస్థులు మనస్సాక్షిగా మీరు చేస్తున్న ఆత్మత్యాగం మాత్రం ఎప్పటికీ వృధాకాబోదు" అని ఆయన తన తంతి సందేశంలో పేర్కొన్నారు.

*గాంధీజీతో భేదాభిప్రాయాలు :*

గాంధీజీ చర్యలన్నింటినీ గురుదేవుడు సమర్థించలేదు. 1921వ సంవత్సరంలో ఒక ప్రత్యేక రాజకీయ కార్యక్రమంపట్ల అర్థరహితంగా గౌరవ ప్రపత్తులు చూపడాన్ని టాగూరు నిరసించారు. గాంధీజీ సహాయ నిరాకరణోద్యమాన్ని ప్రారంభించి నప్పుడు, ఇది ఒకవిధంగా ప్రజలపై నైతికంగా వత్తిడి తేవటంవంటిదనీ, కాంగ్రెసు ఆదేశంపై ప్రజలు తమ విచక్షణాజ్ఞానాన్ని కోల్పోయి ప్రవర్తిస్తున్నారని ఆయన అభిప్రాయపడ్డారు.

దేశ స్వాతంత్ర్య ఉద్యమం ప్రారంభమైన తొలిరోజులలో ఒక సంవత్సరంలోపుగా స్వరాజ్యం సాధిస్తానని గాంధీజీ ప్రకటించి నప్పుడు అది టాగూరుకు విడ్డూరంగా కన్పించింది. గాంధీజీ చేసిన వాగ్దానాన్ని ప్రజలు నమ్మివేయడంకూడా జరిగినప్పుడు ఆయనకు మరీ చోద్యం అనిపించింది.

*కర్కశ సామ్రాజ్యవాదం :*

టాగూరుకు 19 వ శతాబ్దపు ఇంగ్లీషు రాజకీయాల సరళి. స్వభావాలు నచ్చినవి. వీటికి హృదయ వైశాల్యమైన స్వేచ్ఛావాదం మూలం. అయితే ఆయన భారత దేశంలో బ్రిటిషువారి పరిపాలన కొనసాగింపును నిరసించారు. ఆంగ్లేయుల సహృదయత, స్వేచ్ఛాప్రియత్వం 19వ శతాబ్దపు రాజకీయ వాదులను చాలామందిని ఆకర్షించినవి. గురుదేవులుకూడా ఆకర్షితులైనారు. కాని తరువాత తరువాత ఆంగ్లేయుల పరిపాలనలో కొనసాగుతున్న దుష్కృత్యాలను చూచిన ఆయనకు కనువిప్పు కలిగి అవకాశం లభించి నప్పుడల్లా నిర్దాక్షిణ్యంగా వారిని విమర్శించసాగారు.

1919 వ సంవత్సరంలో అమృత్ సర్ లో జరిగిన రక్తపాతానికి తోడినాగరిక సమాజం వాపోయింది. ఇదిచూచి ఖేదిల్లిన గురుదేవులు లార్డ్ చల్మ్స్ ఫర్డ్ కు ఒక బహిరంగలేఖ వ్రాస్తూ సామ్రాజ్యవాదముపైన, బ్రిటిష్ పాలకుల దమన నీతిపైన తీవ్రంగా దాడి చేశారు. బ్రిటిష్ ప్రభుత్వం తనకు ప్రసాదించిన బిరుదాన్ని ఆయన త్యజించారు.

*జీవితాదర్శం :*

తరతరాలుగా నిర్బంధావస్థలోనున్న ప్రజల హృదయాలకు, మనస్సుకు స్వేచ్ఛను ప్రసాదించడానికి టాగూరు పూనుకున్నారు. సమస్త మానవ సమస్యల మౌలిక పరిష్కార మార్గం విద్యా సముపార్జనలో వుందని ఆయన వాదము. దేశాభివృద్ధికి విఘాతం కల్పించే అనేక చెడులు కేవలం విద్యా విహీనతవల్లనే కలుగుతాయని గ్రహించారు. కనుకనే కవితారాధననే కాకుండా విద్యా ప్రచారాన్నికూడా గురుదేవులు తమ జీవితాదర్శంగా పెట్టుకున్నారు.

రవీంద్రుడు 1931 వ సంవత్సరంలో విశ్వభారతిని ప్రారంభించారు. ఇదొక అనుపమానమైన విద్యాపీఠం. బాహ్య ప్రపంచానికి మన ప్రాచీన ఆధ్యాత్మిక ప్రాశస్త్యాన్నిచాటి తద్వారా అన్య నాగరిక దేశాలతో భారతదేశానికి మిత్రత్వాన్ని నెలకొల్పడమే ఈ విద్యాపీఠం ధ్యేయం. ప్రసిద్ధ ప్రాచీన విద్యా పీఠాలైన నలంద, తక్షశిల విశ్వవిద్యాలయాల పద్ధతిలో గురుదేవుడు విశ్వభారతిని తీర్చి దిద్దదలిచారు.

విశ్వభారతి స్థాపనోద్దేశాన్నిగూర్చి చెబుతూ గురుదేవులు ఇలా అన్నారు. "ప్రాచీనకాలంలో భారతదేశానికి విదేశ యాత్రికులు వచ్చినప్పుడు భారతీయులు వారి ద్వారా ప్రపంచమంతటికీ ఆహ్వానాలు పంపించారు. వారి వారసులైన మనంకూడా ఆ ఆహ్వానాలను ప్రపంచ వాసులకు అందజేయాల్సిన బాధ్యత వుంది. "ప్రపంచ

పౌరులారా మా దేశానికి వచ్చి మా వద్ద నున్న ఆధ్యాత్మిక విజ్ఞానాన్ని పంచుకోండి అన్నదే మన పూర్వీకులు పంపిన, ఇప్పుడు మనం పంపవలసిన సందేశం. ఇందుకొరకే నేను విశ్వభారతిని స్థాపించాను."

గురుదేవుని ఆదర్శాలకు అనుగుణ్యంగా ఈ మహాసంస్థ నెలకొల్పబడింది. విశ్వభారతి స్థాపనోద్దేశాలలో ప్రధానమైనవి ఆధ్యాత్మిక శక్తులను పటిష్టం చేయడం, భారతీయ సంస్కృతీ సంప్రదాయాలను పునరుజ్జీవింపజేయడం. వివిధ జాతులమధ్య స్వేచ్ఛా సహకారం వుండడానికి వీలుగా ప్రతి వ్యక్తీ తన నిర్మాణాత్మక ఆదర్శాలను శోధనం చేసుకోవాలి, పునరుద్దీపింప జేసుకోవాలని ఆయన ప్రవచించారు.

*సంఘ సంస్కర్త :*

షా మాదిరిగా టాగూరుకూడా సంఘంలోని దురాచారాలు, దోషాలను ఎలుగెత్తి చాటడానికి ఎంతమాత్రం సంకోచించలేదు. వాటిని సంస్కరించడమే ఆయన ధ్యేయం "అచలాయతన్" అనే వచన నాటకలలో ఆయన మూఢ విశ్వాసాలను ఖండించారు. బాహ్య ప్రపంచంతో సంబంధ బాంధవ్యాలు లేకుండా ఉన్నత ప్రాకారాలతో చుట్టువేసుకొనివున్న సదాచార హైందవ కుటుంబ వ్యవస్థను ఆయన ఈ నాటకంలా వర్ణించారు, దాస్టీకాల విమోచినానికై విప్లవం ప్రజ్వరిల్లి అంతిమంగా విజయం పొందుతుందని టాగూరు విశ్వాసం. బాహ్య ప్రపంచంతో యధేచ్ఛగా సంబంధం పెట్టుకోవడాన్ని గురుదేవులు సమర్థించారు. దురాచారాలనుంచి సమాజానికి విమోచనం కోరారు.

యధేచ్ఛమైన, ప్రకృతి సిద్ధమైన అభివృద్ధిపై మానవునకుగల మక్కువను రవీంద్రుడు "డాక్ ఘానా" అనే కావ్యంలో అభివర్ణించారు. "ముక్తధార" అనే నాటికలో తనచుట్టూ అలుముకున్న బంధాలనుంచి విముక్తి పొందడానికై మనుష్యుడు చూపే తాపత్రయాన్ని వివరించారు. "రక్తకరబి"లో "అచలమాత్య" సమస్యను చక్కగా వివరించారు. అస్పృశ్యతా సమస్యను "కలేర్ జాత్రిల"లో ఉల్లేఖించారు.

—(ఆంగ్ల వ్యాసానికి అనువాదం)



నికటమునసుండి శ్రుతిపుట నిష్ఠురముగ, నడరికాకులు బిట్టు పెద్దఱచినప్పు
డుడిగి రాయంచయూరక యుంటలెస్స, సైపరాకున్న నెందేని జనుటయొప్పు

—శ్రీ నా థు డు.

# స్వభావకవి శ్రీనాథుడు

కల్లూరి వెంకటసుబ్రహ్మణ్య దీక్షితులు

సతత వ్యాసపురాణగుంఫిత వచస్సామ్రాజ్య సర్వస్వ సు
వ్రతియై పన్నగరాజభాషితమహాభాష్యార్థసిద్ధాంతియై
స్మృతి ముఖ్యాగమయోగసాంఖ్యనిధియై సేవించెఁ బ్రాచీన స
త్కృతి సౌందర్య సుధాతి చర్వణ చణక్రీడారస ప్రౌఢతన్.

దినదిన వర్థమాన మమృతీకృతమైన తదాస్య బింబ మిం
పెనసి కళల్ పదారిట రహించెను బున్నమ చందమామ నా
ననువయి, భావసృష్టిఁ జతురాస్యుఁడునై కవియైన వానిలోఁ
గనఁబడె నంత నర్వదియునాల్గు కళల్ కవితాచమత్కృతిన్.

ఆమ్నాయసమధిగతార్థపయఃపాక
తతిఁదోఁచు మీఁగడ తఱక యనఁగ
శాస్త్రచర్చావినిశ్చయశర్కరాసార
సర్వస్వమైన కజ్జాయ మనఁగ
వ్యాసపురాణదివ్యాన్నవ్యమధుకోశ
వసతిఁ దేరెడి తేనెవాక యనఁగ
సకలభాషోదాత్త సాహితీమధురామ్ర
ముజ్జగించిన పండు గుజ్జనంగ

అచ్చమై పాకమై రుజ లణఁచి రుచు, లు
దాత్త మొనరించి తత్కవితా విపాక
రేఖ మధురాతి మధురమై తృప్తినించె
నాంధ్ర సంస్కృత వాఙ్మయోద్యానమందు.

కవితా వీథులఁ జంపకోత్పలములన్ గై సేసి, వాగ్రూప శాం
భవి శార్దూలముమీఁద నిల్పి, యొకచో మత్తేభ మెక్కించి యా
టవెలందు ల్నటియింపఁ బాడె నొక వెంటన్ దేటగీతమ్ము, ల
వ్యవధాన స్ఫురితేందు చూడ నటనన్ బ్రారంభ సంరంభియై.

ఎత్తుగడలందు నవల ముగింపులందు
నొక్క తూకున నుయ్యాల లూచి తలఁపు
సంస్కృతము జాను తెన్గు ముచ్చటలు ముద్దు
లాడ నతఁడాడు సీసమందాడె నాంధ్రి.

ఆడినదాశైె యాతఁడు
పాడినదే పాటయై, స్వభావకవి శ్రీ
గూడిన కూటువయై రస
మోడిగిలెన్ బలుకు పలుకు నొకకళ కులుకన్.

భావము లభావమగుటన భావకవుల
మనుచుఁ జాటించుకొంద్రు గా, కతని కవిత
భావము స్వభావమగుట స్వభావకవి య
నంగ నతఁడొప్పె పూర్వ పుణ్యాంపుశక్తి.

మూలాధారమునం దనాహతవిధిన్ మూర్తీ భవన్నాద వి
ద్యాలావణ్యము నన్న సన్నవిడి యుద్గాతృస్వరా వ్యక్త లీ
లా లాలిత్యమునొంది ఛందముల నాప్లావించి సామోపమ
శ్రీ లత్యమ్మగుచున్ సుపర్వ తతికిన్ జీవాతువై రంజిలెన్.

అనశన ఖేదమింతెఱుఁగ డతులుమూసిన జాడలేదు, దా
రణమునఁ బట్టు లేదొక తిరంబగు కట్టునులేద, డెందమూఁ
గిన యదిలేదు, బ్రహ్మమునఁ గేవలుఁడై యతఁ డద్వితీయ మో
హన కవితా నియోగమున నందెను యోగసమాధి పారమున్.

అర్ధనారీశ్వరమ్ము వాగర్థరూప
మైన శివతత్త్వ మర్ధమాత్రాంచిత, మ్మ
కారము నుకార మొండొంట కలసిమెలసి
వెలుఁగు నోంకార మెఱుఁగని వెలుఁగు వెలుఁగె.

శివకృపంగాక సద్బుద్ధి సిద్ధియగునె
శివ కృపం గాక యోగ సం సిద్ధి యగునె
శివ కృపంగాక కవితా ప్రసిద్ధి యగునె
శివుఁడు గురుమూర్తిగా కిట్లు చెప్పనగునె.

పద మర్థంబను ద్వైతభావమునఁ దాద్వైతాత్ముఁడై, శబ్దమం
దదె యర్థంబు విశిష్టతం గని విశిష్టాద్వైతియై, యవ్విలన్
పద మర్థంబను ద్వైతమీగుట స్వతోభావమ్ము నద్వైత సం
పద నానంద ఘనమ్ము తత్త్వము కవిత్వమ్మందుఁ దానై కనెన్.

తనుదానై కని విశ్వమున్ మఱచు నాతండా కవిబ్రహ్మ, తాఁ
దనుదానై కని విశ్వమున్ మఱపుచెందన్ సంతతానంద చి
ద్ఘనమౌ బ్రహ్మము నేర్పరింపఁ గలుగున్ గా కెంతలో నెంత గ
న్నను గన్నంతయు నేర్చినన్ బ్రకృతికంతా దానుతే యెందునున్
సింగారించుట కంకురార్పణము సేసెన్ గావ్య సీమంతి నీ
శృంగారమ్మున నారితేరి కవితా శ్రీనాథుఁ డవ్వాణి స్వీ
యాంగ శ్రీ రుచిరాంగ రాగములతో నంగాంగి భావమ్ము నొం
దం గేలూని విపంచిమీట దొడఁగెన్ గల్యాణి రాగమ్మునన్
పదము క్రమమ్ము దోప, జట పైకొనఁగన్ ఘనలీల మోము సం
పద కళలీన సుస్వర సమగ్రతఁ దత్కృతి యజ్ఞరంగమం
దదిర నటింపఁ బూనెఁ గమలాసనురాణి శ్రుతి స్వరూపయై
పదముపదమ్మునం దమర పజ్జ్కల విందులు సందడింపగన్.

ఎడమింత సైపక తొడిమివాపిన పువ్వు
పువ్వు నొండొంటితో ముడిచినట్లు
మెత్తన విడక తుమ్మెదఱెక్క నొక్కుడు
లొత్తని పువులేర్చి యత్తినట్లు
రుచి భంగమెనయని రూపునన్ నునుపచ్చి
తేనెసోనల ననల్ తీర్చినట్లు
వాసనల్ నలియని వాసి విచ్చియు విచ్చు
కున్న రేకుల విరు లొదిగినట్లు
పదము పదమున బిగిజిగి పొదువ వ్యంగ్య
జీవనమ్ముగఁ బఱువమ్ము చిందఁ గవిత
లీల వాడని పూలతో మాలె గ్రుచ్చి
యాంధ్ర శారద కతఁ డుపహారమిచ్చె



# అల్లూరి సీతారామరాజు చరిత్ర

ఆంధ్రవీరుని అద్భుత జీవితము

అన్ని వివరాలతో

సచిత్రంగా వర్ణింపబడినది

(రచయిత: యర్రమిల్లి నరసింహారావు)

★

ఆర్టుపేపరుమీద మనోజ్ఞంగా ముద్రింపబడిన

**ప్రభుత్వ ప్రచురణము**

వెల: రూ. 2-75 న. పై.,

పోస్టేజి అదనం

ప్రతులకు: సమాచార పౌరసంబంధముల శాఖ

ఆంధ్రప్రదేశ ప్రభుత్వం,

హైదరాబాదు - 1

అజ్ఞాత జీవత్కవి :

# శ్రీ రూపనగుడి నారాయణార్యుఁడు*

సీరిపి ఆంజనేయులు

శ్రీరూపనగుడి నారాయణరావుగారి గుణశీలములను కష్టసుఖములను వారి కావ్యములందలి మధురిమను గొంతకుఁ గొంతయేని యాంధ్రావనియెదుట నుంచిన వాఁడ నగుచోఁ గృతకృత్యుఁడ నైతినని హర్షించువాఁడను. ఏలన-అవిజ్ఞాత జీవత్కవులయం దెల్లతెలుఁగుల శిఖరప్రాయు లీ విద్వత్కవి తల్లజాలు.

కవి తనకొఱకై, తన యావిష్కరణము కొఱకై, తన యాత్మానందము కొఱకై గ్రంథములు రచింపఁ దివిరినను. ఆతని రచనలు లోకము వారివియు నగుటచే వాని యందలి మేల్మి నెఱుంగు నదవకాశ మలవడిన సన్నిహితు లట్టి కావ్యములందలి కవితావిశేషమును బ్రజాసంతతికిఁ గనంబఱచుట తప్పనిసరి యని నాభావన. అలాగు చేయకుండుట సంఘ దోష మగును గూడ. సంఘమునఁ బుట్టిన యుత్తమ కృతులను బ్రాచుర్యమునకుఁ దేక విస్మృతికూపమున నశించి పోవిడుచునెడ నట్టి సంఘము మహాప్రమాదమును గావించినదగునని ప్రాజ్ఞులు వచింతురు.

శ్రీ నారాయణరావుగారి తోడి ప్రథమ పరిచయము నా కొనగూడుట- 1910లో అనంతపురమున నేనుండినపుడు. తరువాత వారు శ్రీ కూరత్తాళ్వారు పండితుల నిమిత్తము నా జన్మస్థలమగు ధర్మవరమునకు వచ్చి కొంతకాల మందు వసించుటచే వెనుకటి పరిచయమే మైత్రిగా మాఱినది. తదుపరి చాలాకాల మొండొరుల మెడఁ గల్గియుండుట సంభవమైనను లేఖా ప్రతిలేఖల మూలమున మా మైత్రి గాఢమై తనరె ననందగు.

నేను 1937-40లో బళ్ళారియందలి దొరతనపు బాలికల యున్నత పాఠశాలలో ఆంధ్రపండితుఁడనుగాఁ బనిచేయుచుండ, శ్రీ నారాయణరావుగారును దత్పురమునఁ బ్రభుత్వమువారి బోధనాభ్యసన పాఠశాల (Government Secondary Training School) లో నుపాధ్యాయులుగ నుండిరి. అప్పుడు మాగోష్ఠి కెక్కువ యవకాశ మేర్పడెను. అంత మా యారోగ్యము నిమిత్తము మా యిరువుర కుటుంబములును బళ్ళారి పట్టణమునకు బయట విశాల సమున్నతమగు నొకే మందిరమున సన్నిహితముగా వసించుట తటస్థించినందున మా మిత్రభావము భ్రాతృభావముగాఁ బరిణమించెను. ఒండొరుల మనోభావములను మేము లెస్సగ గ్రహించి యవగాహన మొనర్చుకొనఁ జాలితిమి.

మనసులో మనసు గలయునదై, రుచిరమై, భవ్యమై, బాహ్యశుష్కలాంఛనముల నపేక్షింపనిదై తనరారు శ్రీ నారాయణరావుగారి యీ మైత్రియు, స్వచ్ఛందమైన వారి సాహచర్యమును చిరకాలము (ఏఁబదేండ్లుగ) నా కొనగూడుటచేత నే-యీ కవి గ్రామణి కావ్యపరంపరలోని సారస్య మెఱుంగుటకును, శుచిర్భూతము లైన వారి జీవితవిశేషములఁ జెల్మిమై నాకళించుకొనుటకును గారణమాయెను. ఆంధ్రులగు శ్రీ నారాయణరావుగారు ఆంధ్రేతర నగరమైన బొంబాయిని జేరి, యందలి తెలుఁగుల నడుమ నీవల (శార్వరినామ సంవత్సర ఆశ్వయుజ కృష్ణ త్రయోదశిని) జరుపుకొనిన యెనుఁబదియేండ్ల పుట్టినపండుగ స్మరణార్థ మిపు డాంధ్రావనికీ పండిత కవివరేణ్యుని పరిచితి గావించు వ్యాసరచనను జొరకొంటిని.

* శ్రీ నారాయణరావుగారి 'పరిణయకథామంజరి'వంటి చిన్న వచనకృతుల కొకప్పుడు చక్కని ప్రచారముండెను. 'కాళిదాసు' మొదలగు నను వాదరచనలు కొన్ని ఆయా ప్రచురణ కర్తలచేఁ బ్రకాశపఱుపఁబడినవి. దృశ్యకావ్యములలో 'విప్రనారాయణ', 'గౌతమ బుద్ధ' నాటకములు రెండుమాత్రమే ముద్రితములు. ఇందు మొదటిది పశ్చిమాంధ్రమండలములందు మంచి వ్యాపకము గన్నదనవచ్చును. బుద్ధనాటకము నొకపర్యాయము మైసూరు విశ్వవిద్యాలయమువారు అచటి కళాశాలలందు 'Intermediate' పరీక్షకుఁ బాఠ్యముగ నుంచియుండిరి. తక్కినవి తొమ్మిదియు అచ్చుపడలేదు. ఈ విద్వత్కవివరేణ్యుని శ్రవ్యకావ్యముల మూఁడింటిలో నొక్కటిగూడ నింతదనుక వెలుఁగుఁ జూడదాయె.

సీ. తనదు జీవనయాత్ర ధర్మాస్థనడపిన
నరసింగరాయఁ డే నరసు తండ్రి
హోసూరు సుబ్రాయ సోదరి పరమార్ద్రి
హృదయయౌ సీతమ్మ యెవనితల్లి
అనుకూలవతి లక్షణాన్విత గౌరాంబ
పరభక్తిశీల యెవ్వాని జాయ
ద్రవ్యార్జనంబునఁ దనియయ్యుఁ బుణ్యార్జ .
నమునందు మిన్నయై యమరువృత్తి

గీ. యెద్ది, యట్టి యుపాధ్యాయ వృత్తిఁ బూని
విమలగతి లోకయాత్ర గావించు నెవఁడు
హరిత గోత్రుండు నారాయణాహ్వయుండు
కర్తయై యొప్పు నిన్నాటకమున కబల !"

అని తమ విప్రనారాయణ నాటకమున సూత్రధారునిచేఁ బలికించినందునఁ దండ్రి నరసింగరాయఁ డనియు, సీతమ్మ (హోసూరు సుబ్బరాయని సోదరి) తల్లియనియు, గౌరాంబ భార్యయనియు కవిగారే విశదము చేసికొన్నారు. నారాయణరావు గారి మేనమామ (తల్లిగారి అన్నగారు) శ్రీహోసూరు సుబ్బరావు గీర్వాణాంధ్ర భాషలయందుఁ జక్కని చొఱవఁగన్న మనీషి; అమరభాషలోనికి వీరనువదించిన, 'Herbert Spencer on Education' అను గ్రంథము 'విద్యాభ్యాస పద్ధతి' యనుపేరున దేశమునందు విరళవిరళముగ వ్యాప్తిని గన్నది. J. S. Mill గారి యర్థశాస్త్రము (Political Economy) సైతము సుబ్బరావుగారు సంస్కృత భాష ననువదించియుండుట గలదు. వీరు కడపలో డిప్యూటీకలెక్టరుగా నుద్యోగము చేయుచు గీర్వాణాంధ్ర పండితుల నాహ్వానించి, పరిషత్తులు జరిపి, మిక్కిలి గౌరవించి విద్వాంసుల నాదరించుచుండిరి.

శ్రీ నారాయణరావు తండ్రివంశము పేదది. అంతగాఁ బాండిత్యమును గడింపనిదికూడ. తండ్రి నరసింగరావుగారు ప్రొద్దుటూరులో 'సిరస్తదారు - మేజస్ట్రీటు'గా నుద్యోగము చేయుచుండు కాలము (విషునామ సంవత్స రాశ్వయుజ కృష్ణ త్రయోదశి భానువారము)న నారాయణరావుగారు సీతమ్మగారి గర్భమున జననమందిరి. వీరిది ములికినాఁటి తెగ. హరితస గోత్రము.

తండ్రిగా రుద్యోగమునుండి విరామము బొంది బళ్ళారిలో నివాస మేర్పఱచుకొని కాఁపురమున్నందున నారాయణరావుగారి విద్యార్థి దశయంతయు బళ్ళారియందలి వార్డ్లా కళాశాల (Wardla College) లోనే జరిగినది. ఆ కళాశాల మహోపాధ్యాయుఁడుగా నుండిన శ్రీ జె. పి. కోటిలింగముగారు క్రమశిక్ష దక్షులగుటచే. వీరి యంకెలోఁ బెరిగిన నారాయణరావుగారును ఉత్తమ శిక్ష క్రమమును బడయఁజాలిరి. కళాశాలా విద్య నభ్యసించుచుండఁ గనే తండ్రిగారు మరణించుటవలన నారాయణరావుగారు హఠాత్తుగా కళాశాలను వదలి యింటిలోనే చదివి దీర్ఘకాలమునకు Intermediate పరీక్షయం దుత్తీర్ణులైరి.

నారాయణరావుగారి కళాశాలాధ్యయనము 1906 వ యేటముగిసి ననూ వారి విద్యాసక్తి యంతతోఁ గడచనలేదు. ఆంధ్రాంగ్లే యాది గ్రంథముల నత్యధిక శ్రద్ధతోఁ జదువుచు ఆ వాఙ్మయము లందలి విషయ విశేషముల సముపార్జించుకొను పూనికనుండి వారు తలఁగరైరి. ఇందును గూర్చి వీరు తమ 'కావ్యనిదాన' మను గ్రంథపు మున్నుడి నిట్లు వ్రాసికొన్నారు. "విద్యార్థిదశ నుండియు నాకుఁ గావ్యమన్నను కావ్య విమర్శన మన్నను నాదృతి యెక్కువ. అట్లగుట నే ననేకాంధ్ర గ్రంథములనే కాక, కళాశాలయందు పాఠ్యములుగా నుంచఁబడు నాంగ్ల కావ్యభాగము లను, దృశ్య శ్రవ్యకావ్యములను బహుశ్రద్ధతోఁ జదువుచుంటిని. ఉపాధ్యాయ వృత్తియందు నేఁ జేరిన తరువాత నాకుఁ గావ్య పఠనోత్సాహ మతిశయింపఁగా ఆంగ్లమునందలి ప్రసిద్ధ కావ్యము లను సవ్యాఖ్యానములుగాఁ బఠించితిని. చదివిన విషయ వస్తువులలో నా కభిరుచిజనకము లైన వానిని మననముచేసి లక్ష్యములుగా నెత్తి వ్రాసికొంటిని. ఈ యాసక్తి నాకిప్పుడును మిగిలియున్నది....."

శ్రీ నారాయణరావు గారు రాజమహేంద్ర వరమునందలి ట్రెయినింగు కళాశాలలో సుశిక్షితులైన మరునటియేఁడె యుపాధ్యాయ వృత్తియందు అనంతపురమందలి దొరతనపువారి బోధనాభ్యసన పాఠశాలలోఁ జేరిరి. అనంతపురము, బళ్లారి, కర్నూలు, రాయచోటి (కడప), చిత్తూరు మున్నగు పట్టణములం గల ట్రెయినింగు పాఠశాలలలోను, సైదాపేటయందలి యుపాధ్యాయ కళాశాల (Teachers College) లోను ముప్పదియేండ్లు పనిచేసి, 1940 వ సంవత్సరమున బళ్ళారిలో నుద్యోగ విరామము బొందిన యొజ్జలు వీరు. పవిత్రవంతమగు ధర్మము మీఁదనే వీరికి లక్ష్యము. ఒడలువంచి పాటుపడు స్వభావము వీరిది. తమ పాల్పడిన విద్యార్థులకు విద్యాబోధ యొసంగక కాలము పుచ్చుట దేశమునకును దైవమునకును మహాపచారము చేసినట్లు తలఁచుచుఁ దమ

కీశ్వరుఁడు ప్రసాదించిన పదవిని దీక్షతో నిర్వహించిన వారువీరు.

నారాయణరావు గారు పాఠశాల లందలి బాలపుల కుపయోగ పడు వాచకములు, కథాపుస్తకములు, శాస్త్ర గ్రంథములు కొన్ని వ్రాసియున్నను, సాహిత్య విషయమై వీరు చేసినకృషి యధికము. విద్యార్థిదశనుండియు వీరు కావ్యకళోపాసకులే, కళకును జీవితమునకును గల సన్నిహిత సంబంధము చక్కఁగా గుర్తించిన పండిత వర్గమున నారాయణరావుగా రొక్కరను సత్యము వీరి 'కావ్య నిదానము' ఆసాంతము పరికించిన యెవ్వరైనను గ్రహింపఁ జాలుదురు. "కళాస్వాదనమున మనుజుఁడు సౌందర్య రసజ్ఞతను, సుష్ఠుతను, సహృదయతను బడసియుండు" ననియు, ఈ గుణముల కలిమివలనఁ దనకుఁ దెలియకయే హృదయ సామరస్యముఁ బొంది, సౌశీల్యముఁ బడసి, జీవితాసక్తిని దనరి, సకలవ్యాపారములయందు సదభికాంక్షను బ్రదర్శించువాఁడై యుండు" ననియు కావ్య నిదానమున వీరు వాకొనియున్నారు. "ఉత్తమ కళానుభూతి-ఐహికసుఖమునే కాక, దివ్య జ్ఞానమును, అఖండప్రేమను, అఖండానందమును ఒడఁగూర్పఁ జాలియుండు" నను నంశమునుగూడ వీరుతమ కావ్య నిదానమున వ్యక్తపఱచిరి. ఈ కవివర్యుని భావ జగత్తున కావ్యఘనతకు నిర్వచన మిటులున్నది.—

తే॥ ఓయి పరమాత్మ! నీకు నా కొదవునట్టి
విపుల విరహవేదనయె కవి హృదయముల
బెరసి, గేయరూపములుగాఁ గరఁగి క్రాలి
కావ్యఘన రూపమును దాల్చి ఘనతకెక్కు.

ఇఁక నీ కవిగారి రచనలఁ గైకొని వానియందే గుణలక్షణములు నే మెఱుఁగులు నున్నవో విమర్శించి చూతము శ్రీ నారాయణరావుగారి కబ్బములు దృశ్య శ్రవ్య వచనకృతు లని ముత్తెఱఁగులు. అందు వీరు రచించిన శ్రవ్యకావ్యములు పదునొకండు. వీనిలో స్వకల్పితము లాఱు. ఆంగ్ల గీర్వాణ భాషలనుండి యాంధ్రీకరింపఁ బడినవి తక్కినవి. ఇందు మొదటి యాఱింటిలో 'విప్రనారాయణనాటకము' 1919-20లో రచింపఁబడి శృంగార శాంత కరుణ హాస్యాది రసముల వెల్లి విరియించుచున్నది. అందలి ప్రకృతి వర్ణనలు మనోహరములును, గభీరములును సందర్భోచితములును,

గీ॥ "అభ్రమండలోన్నతుఁడయి యమల గతిని
దనరి దుర్నిరీక్ష్యుండగు తపనుఁ, డైహి
క ప్రవర్తనమే మంచి కర్జమనుచుఁ
తెలియఁ జేసెడిరీతిఁ బృథ్వీనికట వి
భాసియయి చిత్రరాగంబుఁ బర్వఁజేసి
లోచనానందుఁ డయి యదే గోచరించు."

మనకవిగా రీ సాయంకాల వర్ణనమును దేవదేవి ముఖమునఁ జేయించుటలో భాగవతోత్తముఁ డగు విప్రనారాయణుని చిత్తము- దుర్నిరీక్ష్యంబగు మధ్యందినచండభానుని వలె నుండునది, సాయం సమయమున నిట్లు మాఱి, చిత్రరాగంబుఁ బర్వఁజేయునని చెప్పుటయందెంత రమణీయత భావలాలిత్యముఁ బొడఁగట్టునో తిలకింపుఁడు. మఱి-స్వభావ సుకుమారములైన మనోజ్ఞకల్పనల కొకటి రెండుదాహరణము లివె.—

గీ॥ "దైవ మనుకూల మగుచుఁ దాఁ దనరె నేని
యాప్సితార్థంబు సమకూరు టెంత తడవు?
చదలు నిర్మలం బయ్యును జలద తతులు
క్షిప్రగతిఁ గారు క్రమ్మి వర్షించుఁగాదె?"

తే॥ గీ॥ "ఆకసముఁ గ్రమ్మికొనియున్న యల సితాభ్ర
శకలచయముల వింతరచనలఁ గనుము
విష్ణుపదమును జేరంగ వేయఁ బడిన
యమృత శిలల సోపానమో యనఁగ వెలయు."

తే॥ గీ॥ "సుఖము దుఃఖమన్ రెండు వస్తువులలోన
నెద్దియును గాని యొకచోటఁ బెద్దకాల
ముండ దనురీతి నియ్యెడ మెందుకొనిన
యాతప చ్ఛాయలు చలనమందుఁ జూవ్వె."

నారాయణరావుగారు రచించిన శ్రవ్యకావ్యములలో మొదటిది 'కవితా నీరాజన' మను ఖండకావ్య సంపుటి. దాదాపు పదునాఱు వందల పద్యములఁ దనరి 'అశ్రుతర్పణము' (క్వెట్టా) 'షాజహాన్' 'తాజ్మహల్' 'శిథిల విజయనగర పర్యటనము' 'చైత కాశ్వము' 'శ్రీ కృష్ణరాయసాగర కావేరి' మున్నగు ననేక శీర్షికల క్రింద వివిధాంశములను వర్ణించు గ్రంథరాజము. 'ఆర్యసుభాషితము' అన్నది రెండవది. ఇది భర్తృహరి సుభాషిత రత్నావళిని బోలి నీతిధర్మబోధకములగు 420 పద్యముల నలరారెడి (కృతి) పద్యములెల్ల కందపద్యములుగనో, గీతపద్యములుగనో యుండి ఒక్కొకపద్య మొక్కొక శీర్షికఁ జెందియున్నది. ఈ కావ్యము శ్రీ అరవిందుల కంకితమొసంగి నారాయణరావుగారు శ్రీ అరవిందుల పట్లఁగల తమ గురుభావమును దెల్పుకొని

యున్నారు. వీరి కృతులలో వేలకొలఁది చరణముల నొప్పిన యనువాద గ్రంథము 'కుమారభారతము'. కవిగారు దీనిని వార్ధక్యమున వ్రాసిరి. కేవలము సులభచ్ఛంధముగల సీసము, కందము, తేటగీతి, ఆటవెలఁది, ద్విపద, రగడ— ఈ జాతీయ పద్యములతోడనే యిది రచింపఁబడినది. సుప్రసిద్ధులగు శ్రీచక్రవర్తుల రాజగోపాలాచార్యులవా రాంగ్లమున రచించిన వచన భారతము దీనికి మూలమనవచ్చును. ఇయ్యది యనువాదమైనను స్వకల్పిత విషయ విశేషములు పెక్కులుంకి రసభావ భూయిష్ఠముగ విరాజిల్లుచున్నది.

నారాయణరావుగారి వచనకృతులలోఁ బెక్కు లనువాదములు. శ్రీవారాంగ్లభాషనుండి యథామాతృకగ విషయము నాంధ్రీకరించుటయందు సిద్ధహస్తులు. వీరు పాండుచ్చేరి అరవిందాశ్రమమునఁ బ్రచురింపఁబడిన 'కాళిదాసు' 'భారతీయమేధ' 'యోగభూమికలు' 'జాతీయవిద్యావిధానము' 'జీవితసమస్యలు' మొదలగు చిన్న యాంగ్ల గ్రంథములను పంద్రెండింటిని దెనిగించినారు. ఈ భాషాంతర రచనలవలన నారాయణరావుగారియం దంతర్నిహితమైయున్న కళోపాసనాశీలము, కావ్యపఠనాసక్తి, పారమార్థిక బుద్ధి, లోకసేవాపరత యతిశయించినవి. తత్ఫలముగాఁ దదుపరి భగవద్గీత, 'Life 'Divine' మున్నగువాని నధ్యయనముచేసి 'ఆధ్యాత్మికోపాసన'లను గ్రంథమును వచనరూపమున రచింపఁగల్గిరి. అందలి వ్యాసములనే నేను 'ధ్యానచికిత్స' అనుపేరున నా సంపాదకత్వమున వెలువడు 'ప్రకృతిమాత'లో వరుసగాఁ బెక్కేండ్లు ప్రచురణ గావించితిని.

ఇంక శ్రీ నారాయణరావుగారి గ్రంథారామముచొచ్చి, యందలి కొన్నితావులను గాంచి యందు గుబాళించు పరిమళముల నాఘ్రాణింతము.

రాజకవియగు శ్రీ కృష్ణదేవరాయలు కవిపుంగవులను సన్మానించుటను వర్ణించి రాయలపట్లఁ గల తమ గౌరవమును కృష్ణదేవరాయల కవిసన్మానమను కావ్యమున నారాయణరావుగా రిట్లు ప్రకటించుకొనుచున్నారు—

* * *

తే. నృపతి సత్కవియను పేర లిర్వురందు
సత్కవియె ప్రజాహృదయంబు సంతరించి
శిక్షయును రక్షయుం ధృతిఁ జేయుపలఁతి

యనుటఁ గృష్ణరాయాధిపుఁ డాకళించి,

చ. కవులను గౌరవించు తమకం బెసలారఁగ నూత్నరీతి న
త్సవమును దీర్పఁగాఁ దలఁచి, స్వర్ణపుఁ బల్లకియందు వారలన్
దివిరిన భక్తితో నునిచి, నిండినహర్షము కన్నుఁగొన లం
దు వెలయ దానిమోసెను హితుల్ దమ బాహువులొద్దన త్తఱిన్.

'కాకతి రుద్రాంబ' యను నాటకములో వీరభద్రేశ్వరుఁడు యోధవీరులకుఁ గావించు ప్రబోధము.

*(ఉత్సాహము)*

సీ. నిఖిలకార్యంబుల నిష్పత్తిగతికిఁ దేఁ
జాలు సర్వోత్కృష్ట సాధనంబు,
బలవద్విరోధుల పైఁబడి పోరదై
ర్యంబుఁ జేకూరు దివ్యాయుధంబు,
చింతాతమశ్శ్రేణిఁ జెంతకు రానీక
యావలఁ జోపు సూర్యాతపంబు,
గళిత వైభవ రాగగతి పురాయింపనై
సొంపుగఁ బల్కు క్రమంపు వీణె.

తే. బహువిధ సుఖసంప్రాప్తికిఁ బట్టుఁగొమ్మ,
జీర్ణ వీరరసాప్తికి జీవకఱ్ఱ
యైన యుత్సాహమును నూఁది యరుల నోర్చి
విజయలక్ష్మిని జేపట్టి వెలయవలయు."

*లోకరసాత్మక భాగములు :*

రాణి క్షమావతి, రెండేండ్ల వయస్సుగల తన చిన్నారి శిశువు, సుగ్రవర్మ యాజ్ఞఁగొనివచ్చు వాగ్ఫుటుని కఱకుఁ గరముల వసమొనర్చునెడ *(క్షమావతీ విజయనాటకమునుండి)*

తే. "కన్నులారంగ నేనిప్డు గాంచుటిదియె
కట్ట కడసారియగునొ ! సంగమము మరలఁ
బడయఁగల్గెడి విపుల సౌభాగ్యమునకు
నేను నోచినదాననో యెఱుఁగ నకట !"

"హా ! ముద్దులబిడ్డా ! తనివిదీఱ నీ కడసారి ముద్దుగొనియెద" (ముద్దిడుచు)

సీ. గోరువెచ్చని నీట బోరుకాడఁగఁ జేసి
యుయ్యాలఁబెట్టి నే నొసఁగు ముద్దు
నును సెజ్జఁ బవళింప నునిచిన మినుదన్ను
చీవు కేలార్చ నే నిడినముద్దు

పలుసొమ్ములుంచి కన్నులకుఁ గాటుకపెట్టి
యెడఁద యుప్పొంగ నే నిడిన ముద్దు,
కిలకిల నవ్వి కేకలువైచి పర్విడ
గొనబున నెత్తి నేఁగొనిన ముద్దు,

గీ. అన్ని ముద్దులరుచుల నే ననుభవించి
తనరుదును గాని యీ చిన్నితనయ నిపుడు
పాయు సమయాన నే నిడ్డ పగపుముద్దుఁ
జవికిఁ బెఱముద్దుఁ జవులవ్వి సాటియగునె?"

అని వాపోవుచున్నడి. ఈ పద్యము శ్రీ ధర్మవరము కృష్ణమాచార్యుల 'చిత్రనళీయము' నందలి 'ముద్దుపద్దెము' దలఁపునకుఁ దెచ్చెడిని;

'రాణాప్రతాపసింహుఁడు - చైతకాశ్వము' 'అశ్రుతర్పణము' (క్వెట్టా) అను శీర్షికలుగల కృతులు శోకరసాత్మకములే. అక్బరు చక్రవర్తితోడి యుద్ధసందర్భమున నసువులఁ గోల్పడిన తన చైతకాశ్వము జూచినప్పుడు దాని నొక మిత్రునివలెఁ దలంచి రాణాప్రతాపసింహుఁడు పలవించుట —

క. "చైతకమా! పోయితె యీ
భూతలము న్విడిచి నాకభువనంబునకున్
స్వాతంత్ర్య లక్ష్మి నయ్యెడఁ
జేతః ప్రీతిగను సేవసేయుటకొఱకున్."

చ. "పదియును రెండువర్షములు
ప్రాయమునంతయు ధారపోసి బె
ట్టిదమగు వేళలం జలము
డింపక తాఁకి యరాతి వర్గమున్
బ్రిదులఁగఁ జేసి నన్నుఁ గడుఁ
బ్రీతిభరించితి, శౌర్యసంపదన్
గదనమునన్ మహాద్భుతము
గాఁ బ్రకటించితి పశ్వరాజమా!"

'తాజ్మహల్':

'షాజహాన్ యొక్క ప్రణయశోకము లీ రమ్యహర్మ్య రాజము నందు రూపముఁదాల్చి ప్రణయమే మృత్యువును దాఁటి నిత్యతా ప్రశస్తి వహించినది. 'షాజహాన్' సుధను - అమృతమును నూరించి, ఆ రమణీయ సౌధమును నిర్మించి లోకమనుభవింపఁ బ్రసాదించినాఁడు.

సీ. స్వాంగనా శృంగార సాంగత్య చిహ్నమై
గొమరారు వెన్నెలకుప్ప యనఁగ,
ప్రణయంబు తన దేహమనముల నెడగల్గి
యమృత శిలోచ్చయం బందెననఁగ,
చెలి మరణింప లోపలియగ్ని కుములఁగా
వచ్చిన వెల్లని చిచ్చనంగ,
నిట్టూర్పు వెలిమొయిల్ నిట్టలంబయి పర్వి
వెలిదుమికి ఘనీభవించె ననఁగ,

తే. విరియు శోకంబుపై నెమ్మి మెఱసెననఁగ,
మృత్యుశిరమున నమృతత్వ మెసఁగె ననఁగ,
శివము సుందరంబయి యొప్పు శిల్పసదన
మిద్ది కంటికందని భూతి నేదొ యొసఁగు.

శృంగారము:

కవులలోఁ బలువురు అసభ్యవర్ణనకుఁ జొచ్చి శృంగారరసము పలిన మొనర్చుచుండుట గలదు; కాని శృంగారము ప్రతిపాదించుటలో మన యీ కవి నిగ్రహమునంది, సభ్యతను వీడక మెలఁకువ వహించువారు. 'తీవచాన' యను వర్ణనాత్మక ఖండ కావ్యమున సామాన్యమైనతీవ నొకచానకుఁ బోల్చి దివ్యసందేశ మును బ్రసరింపఁజేయుట గనులకు—

భానుఁడు మొలక తీవను దన కరములఁ బట్టి యెత్తి,

క. తన యొడిని బేర్మినిడికొని
నెనరున ముద్దిడుచుఁ దలను నిమురంగ లతయున్
దనువును విచ్చి రహించె ధ
వునిఁ గైకొను యౌవనంబు పొంపిరి వోయెన్.

అంత వసంతుని యాగమము —

ఉ. ఆ మనిరాజు రాక మలయానిలముల్ దెలుపంగ, వల్లికా
కోమలికిన్ శరీరము గగుర్పును గాంచెననంగ జాలక
స్తోమము లంతటన్ బొడవుసూపె వినూత్న విజృంభణంబునన్
గామవికార మగ్గలముగాఁ దనమే న్వికసించె నత్తఱిన్.

ఈ పద్యమాలయందు కవి వాడిన కరములు, పుష్పవతి, పుష్పపాత్ర, రజము, ఆమోదము — ఇవి విశేషార్థ ద్యోతకములై సారస్యమెంతేని వహించియున్నవి.

'శిథిల విజయనగర పర్యటన' సందర్భమున శిల ప్రాంత మందలి మతంగపర్వతము నారోహించి కాంచునెడ గోచరమగు పంపాలయ తుంగభద్రాదుల దృశ్యము నీ కవి తమ భావవిలాస ముట్టిపడ నిట్లు వర్ణించినారు.

శా. సోపానంబుల నద్రినెక్కి కన,
నా చోద్యంపు దృశ్యంబు లెం

తే పొంకంబుగ గోచరించి
హృదయోత్సేకంబు గావించు; పం
పాపత్యాలయ రమ్యగోపురము,
తత్ప్రాంతంబునం బాఱు వీ
చీ పారిప్లవ తుంగభద్ర నగర
శ్రీకిన్ దళద్ధార్యమై.

హంపిలోని శిథిల విఠ్ఠలాలయమందలి శిల్పము. మృదుల కరాంగుళములఁ దడవిచూచి, దాని సుస్నిగ్ధతను మనోహరతను మెచ్చుకొని, కవి తచ్ఛిల్పిని స్మరణకుఁ దెచ్చికొని యాతనితో నైక్యమును బొందెనో యది క్రింది పద్యభావము తెల్పెడిని.

చ. శిలలను దిద్ది తీర్చిన విచిత్రపు శిల్పము, నే స్పృశింప, నీ
యులిని బ్రశస్తహస్తమును నో ఘనశిల్పి స్పృశించినట్లయై
యెలమి ఘటిల్లునాకుఁ గరమీడితమౌ గతవైభవోన్నతుల్
పొడ గనిపించెడున్ సమయపుం దెఱపీలి చినింగి పోవుటన్.

'ఎవఁడు భాగ్యశాలి' యను ఖండకృతియందు రమణీయములైన ప్రకృతివర్ణనలు పెక్కులు గోచరించుచున్నవి. ఈ కావ్యమునకు నాయకుఁడైన యుష్ట్రచోదకుఁడగు నొక బాటసారి మండు టెండల వలలోఁ దవిలి యిట్లు తలపోయుచున్నాఁడు.

తే. "తపనుఁ డనియెడు సాలీఁడు తనదు కర క
దంబములను విచిత్రోర్ణ తంతుచయము
వడికి పాంథ కీటకములఁ బట్టిచంప
నెండవాగురఁ బన్నుచు గండుమీఱె."

అంత నయ్యాత్రికుఁడు సొమ్మసిలి పుడమిఁబడి, కొంతొక తడవునకుఁ దెప్పిఱి —

తే. "ఔర! శర్వరీపతి తిమిరాంబరమును
దొడిగి, తన తళుకుఁబయ్యెద గొడుగుపట్టి,
చిఱుత పడగాడ్పులను వీచి శీతలోప
చారములు సేయఁబోలు నేఁ దేఱికొంటి."

ఒంటెల కాపరిని గుఱించిన యిక్కథకు మనకవి 'ఎవ్వఁడు భాగ్యశాలి?' అను శీర్షికనిడి, దానికి సమాధాన మయ్యాత్రికుని నోటనే యిట్లు పలికించినారు.

తే. "కడఁక నెవఁడు కష్టించి, యాఁకలి శమింప,
వపువు గప్పంగ నశనంబు వసనమంది,
తృష్ణ విడనాడి, పుణ్యంపుఁ దెరువుపట్టి
భవముఁ గడచునొ వాఁడెకా భాగ్యశాలి."

ఈ కథనాత్మక కావ్యమునందు కవియొక్క సుహృదయత. కథనాకౌశల్యము, జీవితార్థ ప్రదర్శనము, ఔచిత్యపోషణము, గభీరోదారభావము వ్యక్తమగును. కథాకథన మెందును గుంటుపడలేదు.

మన కవిగారి మృదుమధుర శైలికి వీరి 'ఆర్యసుభాషితము' లను నీతి నిధినుండి అమూల్యములగు రత్నములవంటి మూఁడు పద్యము లుదాహరించి యిద్దాని నిఁక జాలింతును.

*పేదింటిది :*

తే. తృణమనుచు దాని నీలంబు తెగడు నేని
నీలమణికె భంగంబు జనించు పగిది
భార్య పేదింటిదని దానిఁ బాయు భర్త
తనకుఁదానె గౌరవహానిఁ గనుచునుండు.

*దారిద్ర్యము :*

క. దారిద్ర్యము బెబ్బులియని
పాఱుందోలుదురు ప్రజలు భయవిహ్వాయులై ;
దారిద్ర్యముఁ దమ నిధియని
హేరాళంబుగఁ గవుంగిలింతురు విజ్ఞుల్.

*భక్తియనెడి యులి :*

తే. శిల్పి యులిచేత రాతిని జెక్కి యందు
దివ్యమౌ విగ్రహంబును దీర్చునట్లు
సత్త్వగుణి యుపాధిగతాత్మ తత్త్వముఁ గొని
భక్తితోడ శుద్ధాత్మగాఁ బరగమలుచు.

విద్వత్కవిపరేణ్యులు - శ్రీ నారాయణరావుగా రిన్ని కబ్బములు రచించియు వానిలో నే కొన్నింటినైనఁ బ్రకాశపఱచుకొనఁ జాలినవారు కారు. అందులకు సంసారభారము దొడ్డది యగుట ముఖ్యహేతువు. తమ కావ్యము లేనాఁటికి వెలుఁగుఁ గాంచలేదను నిరుత్సుకత వీరి కెప్పుడును గలుగదు. తొలినుండి శాంతి సౌజన్యాదులే వీరి యారాధ్య దైవతములు. అట్టి గొనములను గొలుచువా రగుటచేతనే 'పుణ్యార్జనమున మిన్నయై యమరు' నుపాధ్యాయపదవిని వరించి వీరందు సుఖవిజయముఁ బొందఁ గనుట. ఆ వృత్తి వీరి కెంతయును దగినదే, కాని దానివలని రాఁబడి మిక్కిలి యల్పము. ఆ స్వల్పాదాయముతోడతే యేదెని మిదిమంది బిడ్డలుగల కుటుంబరథమును దరలించుకొని పోవుటలో సాంసారికబాధల నెన్నింటినో వీ రెదుర్కొనవలసియుండెను. కాని వాని నంతగఁ బాటింపక వీరు తామరాకుమీఁది జలకణమువలె మెలఁగుచుండువారు. ఆదర్శప్రాయమైన యార్షజీవన విధానమొక రాచబాటయై యీ గృహస్థునెదుట విరాజిల్లుచుండెడిది. ఏపాటి క్లిష్టపరిస్థితులలోఁ గూడ నొడుదొడుకులు పొందని ప్రశాంతమార్గమున చిత్రము నడుపఁదివురు సమర్థత యీ సహన శీలికి మెండు. ఈ సంసారిని బరివేష్టించి యెడతెగక సేవించు నదృష్టసంపదలు శమదమాది గుణశ్రీలె. ★

# రెడ్డిప్రోలయ

మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

తెలుఁగుజాతికి జీవకళవోసిన ప్రతాప
రుద్రవల్లభుని తీరువల నెఱిఁగి
వయి నేడుగడలేక వలవించు దుర్గాధి
పతులలో ధీరభావమ్ము పొదిగి
ప్రాపుండి నడప, బొబ్బలిడు బెబ్బులిగొంతు
వలచేతఁగొను యువకులను జేర్చి
తన పినతండ్రి సంతాన రత్నములైన
కాపయ ప్రముఖుల దాపుచూచి

యవన సేనాంబుధి మునింగి యంగలార్చు
నవని నెత్తెను శ్రీవరాహం బనంగ;
రడ్డి సామ్రాజ్య భవన నిర్మాణమునకు
నడుసుముద్దలు మోసెఁ బ్రోలయ మనీషి.

*　　*　　*

ఊరూరఁ బ్రజాసేనలు
కూరిచి, పరులాక్రమించుకొన్నవి దుర్గ
ద్వారములు తెఱచి వీర వి
హారమ్మొనరించెఁ బ్రోలయ జయప్రియతన్.

*　　*　　*

నడుమ విసరిన వడగాడ్పునకు వడంకి
తలలు వాల్చిన వైదిక ధర్మలతలు
తేఱుకొని యల్ల నల్ల నర్తింపఁదొడఁగె
ప్రోలయ మనీషి కృషి వర్షమునకుఁ దడిసి.

*　　*　　*

తఱుగువట్టిన దేశీయధర్మమునకుఁ
బెరుగుదల నీయఁ బరులనొప్పించి తటిమె;

నంతియేకాని, సర్వరాజ్యమ్ము తానె
కరుడుగాఁ జేసి గ్రమింగెడి కాంతులేదు.

*    *    *

పరువు న్నిల్పి పరాళి గెల్చుకొని యావత్కాకతీయాంధ్ర రా
జ్యరమా స్వామితఁ దానె పూనఁగల దార్ఢ్యం బుండియున్ బంధు సా
గర జైవాతృకుఁడైన ప్రోలయకుఁ గాంతా రాజసత్వమ్ము లే;
దరులం దోలుటః ధర్మమేలుటయు రెండౌ రెడ్డి యుద్దేశముల్.

*    *    *

తన బరువుపడ్డ దొడ్డయత్నమ్ము కంటె
నాయకుల సాయమునకంటెఁ, బ్రాయమిచ్చి
పోరు సల్పిన ప్రజల గెల్పునకు మురిసి
'యది ప్రజారాజ్య మనియెఁ బ్రోలయ్య తనిసె.



## "ఆంధ్రప్రదేశ్" పత్రిక ధర హెచ్చింపు

"ఆంధ్రప్రదేశ్'' పత్రిక ధరను 1961 సం॥ జూన్ నెల సంచికనుంచి ప్రతి ఒక్కంటికి 25 నయాపైసల చొప్పున హెచ్చించడానికి నిశ్చయించబడినది. ధర హెచ్చింపు తెలుగు, ఇంగ్లీషు, ఉరుదూ—మూడు భాషల పత్రికలకూ వర్తిస్తుంది. సంవత్సరం చందా ఆ నెలనుంచి రు. 3/- లకు పెరుగుతుంది.

—డైరెక్టరు,
*సమాచార పౌర సంబంధముల శాఖ, ఆంధ్రప్రదేశ్*

# రెండు ప్రశస్త యక్షగానములు

వేదాంతము గోపాలకృష్ణమాచార్యులు

ప్రాయికముగా యక్షగానము లందలి రచనము, కథా శరీరము సంస్కార వంతులకు రోతఁ గొల్పుచుండును. తదపవాదము లనఁదగిన ముద్రితములు గాని రెండు ప్రశస్త యక్షగానములను గూర్చి సంగ్రహముగా వివరించుట ప్రకృత వ్యాస ప్రయోజనము.

*వేంకటపతి : పద్మినీ పరిణయము :*

ప్రబంధమను పేరఁ గర్త చే వ్యవహరింపఁబడిన యీ పద్మినీ పరిణయమను యక్షగాన మందలి రచనము ప్రశస్తముగా నున్నది. ఈ యక్షగానము.

"నందనీ కృతవచోనాథుని పేర, నందక చక్రసనాథుని పేర
నీరజమిత్రాబ్జ నేత్రుని పేర, నీరంధ్ర సౌవర్ణనేత్రుని పేర
అహివర శయ్యా పరాయణు పేర, రహిసమాశ్రిత
బాదరాయణు పేర
దారుణ రణరంగధాముని పేర, దారిద్ర్యహర
రంగధాముని పేర"

రచింపఁబడినది. భట్టరాచార్యుఁడీ సరస కృతి కర్తయగు వేంకటపతికి దేశికుఁడు. వేంకటపతి రామాయణనంబి పౌత్త్రుఁడు. వేంకట నంబిసూనుఁడు. పరమవైష్ణవ పాద పద్మ సేవకుఁడు.

నిచుళాపురాధిపతియగు రాయచౌహత్త మల్లుఁడు శ్రీ రంగనాథుని సందర్శించెను. శ్రీరంగనాథుని సేవించి నిజరాజధానికేగువాఁడు జలపానేచ్ఛ నొక సరోవరమునకుఁ జని యందు హేమ కమలమునఁ గమలాంశ జాతయై యలరుచున్న రాచ కొమరితగని యామెఁ జేకొని నిజరాజధానికే తెంచెను. ఆమెకుఁ బద్మినియని నామకరణ మొనర్చెను. ఆమె జలక్రీడ లాడుచు శ్రీరంగనాథుని గాంచి ప్రేమించెను. ఆమె

"అలరు గుత్తులమీఁద వ్రాలిన యళులగని ముదమంధియాగతి
చెలువుఁడెప్పుడు ఘనదుకుచములఁ జేరునొక్కో
ఎక్కిబింబముఁ జీరు కీరముచక్కఁగని నానాథుఁ డీవగ
నిక్కి యెప్పుడు మోవిపంటను నొక్కునొక్కో
మక్కువల జక్కవలకవఁగని సొక్కి యాక్రియ నాయకుఁడు నా
ప్రక్క నెప్పుడు దక్కి కౌఁగిటఁ జిక్కునొక్కో"

యని తలఁచుచుఁ జింతాక్రాంత యైనది. ఆమెకు నీలకుంతల తాప ముపశమించునట్లుగా శీతలోపచారములఁ గావించినది. రాయచౌహత్త మల్లుఁ డామెను నీవేల స్రుక్కినావని ప్రశ్నింప జనకునితో శ్రీరంగనాథుని వరునిగాఁ బడయ తా నభిలషించుచుండుట నెఱిఁగించెను. నిర్వేదపడుచున్న రాయచౌహత్త మల్లునకు శ్రీరంగ విభుఁడు సాక్షాత్కరించి స్వాభీష్టమును దెలిపెను.

"ప్రమదమునఁ బద్మినీసతి
రమణీయగ్రీవ నిందిరాపతి సుముహూ
ర్తమునన్ మంగళసూత్రము
తమిమీఱఁగఁ జేర్చె శాశ్వతంబై యొప్పన్."

ఇది సంక్షేపముగాఁ బ్రకృత యక్షగాన మందలి యితివృత్తము.

ద్రవిడ ప్రబంధ మూలకమగు తాళ్లపాక తిరువేంగళనాథుని (క్రీ 1498-1561) పరమయోగివిలాసమను ద్విపద కావ్యమున నీ వృత్తాంతము కావేరీతటస్థిత నిచుళానామక నగర వర్ణనము. రాయచౌహత్త మల్లాఖ్యభూపాల రాజ్యక్రమము నను శీర్షికలతో నారబ్ధమై పద్మినీ రంగరాజ పరిణయ వైభవమును శీర్షికతోఁ బరిసమాప్తమగు చున్నది. తిరువేంగళ నాథుని గ్రంథమునఁ బద్మినీసతి పరాంకుశ ముఖ్య మునులు పలికిన దివ్య ప్రబంధముల వలన రంగనాథుని రూపును శృంగారము నుఁ గాంచి శ్రీరంగనాథుని యందు వలపుఁ గొన్నట్లు సూచింపఁబడినది. ప్రకృత యక్షగానమునఁ బద్మినీసతి యాకృష్ట యగుటకు శ్రీరంగనాథుని జూచుటయే హేతువుగాఁ గల్పింపఁబడినది. నంబూరి కేశవాచార్య కర్తృకమగు నాచార్య సూక్తి

ముక్తావళి పూర్వభాగ మందలి తృతీయోల్లాసము పు 41-44 లోఁదీ కథకాన నగును. ఈ గ్రంథమునఁజోళ నృపాలకుని పేరు ధర్మవర్మయని పేర్కొనఁ బడినది. పరమయోగివిలాసము నందలి కల్పనమునకు భిన్నముగానీ గ్రంథ మందును బద్మిని.

"అంతట నవయౌవ నారంభదశఁ జెంద
　　యుద్యానవనమున కొక్కనాఁడు
చనియందుఁ జెలులతో సౌరభమిళిత పు
　　ష్పములు గ్రహించుచుఁబాడియాడి
యలసి పుష్ప ప్రవాళాంచల్లతా వృక్ష
　　వాటికలందువిశ్రమించి
రంగరాజచటికి రంగుగా వేఁటాడి
　　విచ్చేయఁ దద్దివ్యవిగ్రహంబుఁ
జూడ్కులలరంగఁ గని మ్రొక్కిచోళరాజ
కన్య కామించి కందర్పకర విముక్త
పుష్పనారాచ వేదనఁ" బొందెనని తెలుపఁబడినది.

"జనకుఁడా శ్రీరామచంద్ర భూజానికి
　　బ్రీతిమున్ సీతనర్పించినట్లు
ధర్మవర్మ్మఁడు తనతనయను సలిల ధా
　　రాపూర్వకముగ శ్రీరంగభర్త
కర్పింప నాకన్నియను బాణివరణి
　　వరణముచేసి హర్షించె లక్ష్మీవరుఁడు"

నని పరువాతి కథ వివృతము. కట్టావరదరాజఁ క్రీ. 1650 కర్తృకమగు శ్రీరంగ మాహాత్మ్యమున దశమాశ్వాసమున శ్రీరంగనాథుఁడు వాహ్యాళి వెడలి.

"ప్రచురోత్సాహముతోఁదా
　　నుచితక్రియ వచ్చునప్పు డొరయూరపురిన్
　　నిచుళాధినా థకన్యక
విచలితధమ్మిల్ల" యాతనిఁ గాంచుట వారిరువురకుఁ బరస్పరము మోహము గలుగుట తత్ఫలముగా రంగవిభుడు

"చోళక్ష్మాపతి పుత్రికన్ గనకవాసోమాల్య భూషాది నా
　నాలంకార విభూషితాంగిని, మనోజ్ఞాకార కల్యాణమై
　యాలీలావతిఁ బల్లకిఁ నునిచి రంగా వాసముంజేరి తా"

నేలుట వర్ణింపఁబడినది. రామానుజాచార్య కర్తృకమగు రామానుజ చంపువనుఁ క్రీ. 1600 గీర్వాణ గ్రంథమందు నీకథ సూచింపఁబడినది. పై ప్రమాణములచే నీ యక్షగానమందలి వస్తువు ప్రసిద్ధమని సిద్ధాంతము. ఈ యక్షగాన కర్తృకాలమును నిర్ణయించుట కాధారములు మృగ్యములు.

*శేషమురంగాచార్యుఁడు : భావనారాయణ విలాసము :*

ఇతని కృత్యంతరములు రతిమన్మథ విలాస శివ కేశవ పారిజాతములను రెండు యక్షగానములు. తండ్రి చెన్నభట్టారకుఁడు. చెన్నభట్టభిమన్యు కల్యాణమను రసోత్తరమయిన ద్విపద కావ్యమునకుఁ గర్త, మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము వారిచే నిటీవల ప్రకటితమైన శేషము రఘునాథార్య ప్రణీతమగు కులశేఖర మహీపాలచరిత్రావతారికననుసరించి రంగాచార్యుని వంశవృక్ష మీ క్రింది తీరున నేర్పడు చున్నది.




రామానుజాచార్యుఁడు,



విద్వత్కవి వంశమునకుఁ జెందిన రంగాచార్యుఁడు కౌండిన్య గోత్రుఁడు ఆపస్తంబసూత్రుఁడు. ఆధారములు నేఁ డుపలబ్ధమైనంతలో నితఁడు 18వ శతాబ్దపు టుత్తరార్ధమునకుఁ జెందినవాఁడని నిర్ణయింపవచ్చు నని పరిశోధకుల భావము.

భావ నారాయణ విలాసము శ్రీహరి కంకిత మని క్రింది గ్రంథాంత మందలి మాలినీ వృత్తము నాధారపరచుకొని యూహింప వచ్చును.

"విమలఘన చరిత్రా విక్రమాతీత మిత్రా
దనుజ తృణ లవిత్రా ధర్మ నిష్ఠా విచిత్రా
జలధర నిభ గాత్రా సారస వ్యక్త నేత్రా
పరమగుణ పవిత్రా వార్ధి కన్యా కళత్రా"

కొండవీటి సీమ యందలి నండూరి పురమునకుఁ జెందిన గూని గోవిందుఁడను విప్రుఁడు మేన మామయగు కారంచేటి నరసింహునితోఁ గాశికేగెను. గూని గోవిందున కొక వారణసీ విప్రుఁడు కన్యనిత్తు ననఁగా మేనమామకీ వలసినదిగా నభ్యర్థించి యాప్రదాత నంగీకరింపఁ జేసెను. ఆమె పేరక్కమాంబ. వారికిఁగలిగిన కూఁతును దనకిచ్చు నట్లుగా వారి నొడంబఱిచి భావనారాయణ విశ్వనాథాదులను సాక్షులుగా నిర్దేశించెను. నరసింహునకుఁ గాల క్రమమునఁ బుత్తడిబొమ్మఁ బోని పుత్రిక యుదయించెను. భార్యానురోధమున నాతఁడు ప్రతిజ్ఞాభంగము గావింప గూనిగోవిందుఁడు కాశికేగి.

"అలనాఁడు మామ కన్యక నిత్తునని పల్కి
వెరవుఁ దప్పెగదయ్యా విశ్వనాథ
నరసింహుఁ డలనాఁడు నమ్మఁ బల్కిన మాట
తొలఁగఁ ద్రోచెఁ గదమ్మ తుంగభద్ర
మొదలఁజేసిన బాస తుదిఁగాన రాదయ్యో
వినులార వినుండు వెలఁగలార
మున్ను మాతుల సూక్తి విన్నారుగద నేఁడు
తప్పె గాఁ బంచభూతంబులార."

పేరులేక మిగులఁ బెరిగిన తరులార
భావదేవ గృహ నివాసు లార
ద్వార పాలు రార ధర్మదేవత లార
కావుఁడనుచు దెసలుకలయఁ జూచి

ప్రాణత్యాగ మొనర్పఁ బూనఁగా భావ నారాయణుఁడు కాశి నుండి యేతెంచి పొన్నూరనిలిచి గ్రామాస్థాన సభ్యుల యెదుట సాక్ష్య మొసంగెను. నరసింహుని కూఁతునకు గోవిందునకుఁ గల్యాణము జరిగెను. ఈ కథ గుంటూరు మండల వాస్తవ్యులకు బ్రకృత యక్షగాన నిరపేక్షముగాఁ బరిచితము.

మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తకా గారమున వీనికి వ్రాఁత ప్రతులున్నవి క్రమముగా వాని సంఖ్యలు R. No. 1897, D. No. 1931.



సకల దేశములను సన్మార్గ వర్తులుఁ, గలరు దుష్ట తతియుఁ గలిగి యుండు
మదినెఱుంగ నేర్చు మధ్యస్థులదియును, నదియు నుగ్గడింతు రెదురు మెచ్చ.

—భారతము

# ఏకాంతసేవ

యామిజాల పద్మనాభస్వామి

మాధవుం గొలిచి సంపాదించి నానివే
మధురవాసన లీను మల్లెపూలు,
ఉదయభానుని మ్రొక్కి ముదమారఁ గైకొంటి
మదికింపు నింపు తామరస సుమము,
ధనదు నారాధించి కొనిపెట్టి నానివే
కాంచన ప్రభల సౌగంధికములు,
చరమసంధ్యాసటీశ్వరుఁ గోరి చేకొంటి;
వలపు లూరించు సంపంగిపూలు,

భక్తి భావానుకూల ప్రభావ గరిమ
సద్గుణాధారమౌ మనస్సారసంబు
ఇన్నిటికి మిన్న; వీనిలో నెంచుకొమ్ము
నీకు నిష్టంబయిన దాని నిగమవంద్య!

2

జలకము లాడరమ్ము విరజాజులు, సంపగులున్, గులాబి పు
వ్వులు, సరిక్రొత్త మల్లెలు గుబుల్కొను తావుల మంచినీటితో
కలిపితి నత్తరున్; మధురకంఠరవంబున నీ చరిత్రలో
వలపులు తెల్పు లీలలను పాడెద నీదరి నిల్చి మాధవా!

3

వేలుగనుంతునా నెమలిపింఛము; పన్నగ భూషణంబులున్,
సారసవైరి రేఖయును, స్వర్ణమణీమకుటంబు తీయుమా
నీరము పట్టునేమొ; కరుణింపుము ఒక్క నిమేష మింతలో
తీరిచివైతు స్నానమును; తెల్పుము లోపములున్న; మాధవా!

4

కనుగన మూసి, హేమ మణీకంకణరావము లుప్పతిల్ల, ఆ
మని తొలి సంజవేళ వ్రజమానిని రాధ తలంటుహోయి నీ

మనసున నాటియుండనగు; మా కొలువున్ గయికోవ? భక్తి భా
వన కపచారమున్ సలుపు వాడవు కావనుకొంటినో ప్రభూ !

5

సంపగిపూనె పూయుదున ? చల్లనితావుల మల్లెపూనెతో
ఇంపుగ చిక్కతీయన ఒకించుక నీ జునపాలు; రాధతో
సొంపుగ తానమాడు సరసుండవు మెత్తువె నా సపర్య; కో
పింపకు జాలమయ్యెనని; విశ్వవిభూ ! శతమన్మథ ప్రభూ !

6

పసిడికమ్ముల జలతారు వలిప మిదిగొ
మేన నీరొత్తెదను రమ్మొ మృదులహృదయ !
బాహువల్లుల నందిమ్మొ పరమపురుష !
పాదపద్మము లొత్తనా ! ప్రణయమూర్తి !

7

ఎంత తపించినానొ కనవేమి; శరద్ఘనమయ్యె మోము, బా
ళెంతను పోలిమేన నవలీలగ నీరస మావరించె, నీ
చింతను జిక్కి నాల్కమఱచెన్ రుచి, కోకనదంబులయ్యె గా
ఇంతలు కన్నులున్; వినవదేమొకొ నామొర, లోకమోహనా !

8

పండు వెన్నెలరేని పసిమి చాయలలోన
వెదకుచున్నాను నీ పెదవి సొబగు,
మలయమారుతగానమాధురీఝరులపై
అరయుచున్నాను నీ మురళి పాట,
పలుకరించెడు రామచిలుక పల్కులలోన
దిద్దుచున్నాను నీ ముద్దుపలుకు,
క్రొక్కారు మొయిలు తళ్కుల బెళ్కులన్గాంచి
మోహించినాను నీ దేహలతను,

కాని, కడలేని ప్రణయాంధకార బలము
దివ్యతరమౌ పదార్థ మందించలేదు;
మోసపోయితి నీ దొంగ వేసమునకు
వెలుగు చూపవె యికనైన విశ్వనాథ !

9

సాహంకార మనో వికారముల నాట్యంబాడుచున్నాను వి
ద్యా హీనస్థితి తోడుగా: భువనమర్యాదన్ గణింపంగ లే

దీహో నిర్ఘరు లూరడిల్లవిక నే నేరీతి ధన్యాధ్వగ
వ్యాహారంబున మేలుగాంతు; భువనై కారాధ్య పీఠాధిపా !

10

అమృతభానుని మందహాస వీచికలలో
తల మున్కలాడు వెన్నెల పులుంగు,
పద్మినీ ప్రణయ జీవన తంతువులలోన
ప్రేమామృతమ్మాను భృంగరాజు,
బాలభానుని ఫాలభాగాన కుంకుమ
ప్రభ బొట్టుదిద్దు ప్రాభాతలక్ష్మి,
పసిమిజవ్వనపు సొంపెసలారు కుసుమాంగి
మనసు నాకర్షించు మల్లెపూవు

ఈ భువనరాజ్య పతివి నీవేయటంచు
లలిత భావానుకూల విలాస మధుర
సరసవృత్తులతో బాధ సల్పుచుండె
సత్యశివసుందరాకార సద్విహార !

11

నీవు తుంటరివంచును ప్రేవెలందు
లమ్మతో సిద్ధపడిరి కయ్యంబునకును;
యోగి మానసవర్తి ! నీ కోగిరంబు
వియ్యమా ! కయ్యమా! చెప్పవే మహాత్మ !

12

మది మెచ్చి, మనసిచ్చి, మనువిచ్చి, సుఖపరం
పరఁ దేల్చు రాధ కాపురముకన్న,
గొల్లవారిళ్ళలో క్రొత్తకోడళ్ళకుఁ
వలపు పాటలనేర్పు చెలిమికన్న,
ఆలమందలకు నొయ్యారమ్ముగా వేణు
గానామృతమ్మిచ్చు ఘనతకన్న,
యమునా తరంగ నాట్యములతో గొల్ల పూ
బోండ్ల కీఁతను నేర్పు మురువుకన్న

మిన్నగా నేమిసౌఖ్యము గొన్నవాఁడ
వెలుగఁజెప్పుమ సత్యాచే తలుచుగాను
కటువుగా బుగ్గ పోట్లు పొందుటయె కాని;
విశ్వనట నాంతరంగ ! ఓ వెన్నదొంగ !

13

పునుక పేరులు మార్చిప్రోవ నద్భుతరీతి
నమలరోచీ రత్నహారములుగ,
మొలనున్న పులితోలు మలిరూపు చెందంగ
రమణీయ పీతాంబరమ్ముగాను,
గంగాతరంగరంగజ్జటాజూటంబు
డంబైన మణికిరీటంబుగాను,
పదును(క్రొంబొగలూదు నుదుటి చిచ్చఱకన్ను
మహిత సిందూర నామమ్ముగాను
కోమరుఁ దనమొప్పగా పెండ్లికొడుకువోలె
దారుకావని స్వేచ్ఛావిహారివౌచు
అపజయముతోడ నింటికి నరిగినావు
భావ్యమా యిట్టివేషమ్ము ! పరమపురుష !

14

మనసుపుట్టైన మౌనిమానినుల్ వడ్డించు
తీరైన పరమాన్నమారగింప,
తలపుగల్గెన పరిమళమనోహర లతాం
తలతానికుంజ పంక్తులఁ జరింప,
కోర్కెలూరెన సతీకులతత్త్వ విద్యలన్
పుష్పసాయకుని తీర్పులు పఠింప
బుద్ధిపుట్టెన క్రొత్తపద్ధతిన్ ఋషిభామి
నుల మోసగించి పంచల నటింప,
ఏది కానిమ్ము అపకీర్తి నాదుకొనుచు
చెక్కులు చెమర్చి కొండల నెక్కినావు
దారుకావని మరువని పేరుచేసి
నటనచూపినవాడవో నటవతంస !

15

రత్నకంకణ ఘలఘలా రావములకు
ముగ్ధముఖ చంద్రసౌభాగ్యమునకు లోగి
సాగిపోతివి దేశదేశాల కడకు
ఎవ్వరిని మోహినీమూర్తి నెంచినావో ?

16

తెలివినిచూపి హాలహాల దేహావిరోధినడంచి తండ్రివై
చెలగితివమ్మవై కరుణచెల్లగ జ్ఞానసుధాప్రదాన ని

శ్చల పరతత్త్వ బోధనము సల్పితివా విబుధాళికిన్ కళా
విలసితవృత్తి తత్త్వపదవిఁ బ్రకటింపగ; విశ్వనాయకా!

17

భవ్యభారత నాట్యభంగీతరంగ వి
న్యాసమ్ముతో నాట్యమాడలేనా?
కమనీయ పికగానకాకలీస్వరముతో
భావగీతమ్ములఁ బాడలేనా?
శారదోపాసనాధారమ్ముగా సుధా
రసపూర్ణ కావ్యముల్ వ్రాయలేనా?
భువనరాజ్యము చూడఁబోయి వచ్చిన శ్రమం
బుడుగ నీపాదమ్ము లొత్తలేనా?
ఏమి యనుమానమో నిల్వవేమి యెదుట
కోర్కెలేమేని యున్నచో కోరుకొనుము
సముఖమున రాయబారము జరిపెదేమి
విశ్వవిద్యాలయాధ్యక్ష! విబుధపక్ష!

18

వ్రేపెలదుల్ వరించిరి తరించిరి ప్రేమసుధాబ్ధితేల్చు నీ
భావనలో మునింగి మునివర్యులకుఁ రహదారిచూపిరీ
జీవితయాత్రలో ననుచు చెప్పును భాగవత ప్రబోధ గీ
తావళి; దాచలేవు పరమార్ధరహస్యము జీవితేశ్వరా!

19

ఆదిమ బ్రహ్మచారివి ఖ్యాతి నొంది
భావబలమున పార్వతీదేవి కొఱకు
యోగివై, మౌనివై, విప్రయోగివై తి
విస్మరింతునె ఆగాధ; విశ్వనాథ!

20

ఆత్మవిద్యార్థికిని ప్రథమాక్షరము
చక్కగా వినిపించె నీఢక్కలోన
సులువుగాసాగె పాణిని సూత్రవృత్తి
ఆదిగురుడవు నీవు లోకాధినాథ!

21

సాయంకాలనటన్న వేళ దరహాసజ్యోత్స్న నీగాన వి
ద్యాయత్నమ్మున పూలుపూసి, భువనైకారాధ్య కావ్యది మా

ధ్యాయమైన్న కురుభూమి నర్జునుని యాత్మారామమం దద్భుత
స్థాయిఁకూసె వసంతకోకిలకలస్వానమ్ముపొనీశ్వరా !

22

సిగలోని జాబిల్లి చిరునవ్వు తొలిరేక
కలువకన్నుల మెరుంగులను దిద్ద,
గంగాతరంగరంగజ్జటాజూటంబు
శిఖిపింఛమునకు క్రొంజెలువు గూర్ప,
గళహారమౌ పాముతలమీది రతనంబు
నల్లరాతికిని అందము ఘటింప,
విసపుగాలులుగ్రక్కు నొసటి చిచ్చుఅకన్ను
కమ్మకస్తురికి రూపమ్ముతీర్ప,
విప్రలంభమ్ము నోర్వనివిధము తెలుప
మేన సగమైన అచలభూజాని తనయ
ఉరమునకు మించు వెలుగుల హొయలు నెరప
సృష్టికధినేతవైతి; ప్రాచీనయోగి !

23

ఏ ముహూర్తాన పల్కితో యీ ప్రబంధ
మాత్మ విద్యార్థులకు అవిద్యా ప్రచార
తత్త్వకథనంబుగా, ఉదాత్తత చెలంగ
వ్యాసుడొక్కడె తద్రహస్యము గ్రహించె.

24

ఆత్మపీఠము రజతాద్రి, అంబ ప్రకృతి,
జీవ రంగస్థలము కాగుచెట్టునీడ,
గతులు చర్చించు పీఠాధిపతివి నీవు
శంకరుఁడవీవు గోపాలచక్రవర్తి !

25

ఎన్ని తిలకాలు దిద్దితో వన్నెకాడ !
గొల్లచేడెల; కిపుడు నీకును ప్రమోద
మెసఁగ తిలకము దిద్దుటకేను పడిన
శ్రమ ఫలింపఁగచేయుమో సారసాక్ష !



శబ్దాశ్రయ హాస్యము - (4)

# ఉచ్చారణ - ఊపు - విశ్రాంతి

మునిమాణిక్యం నరసింహారావు

ఉచ్చారణ, ఊపు, విశ్రాంతి - ఈ మూడిటిలో వైపరీత్యము నవ్వు పుట్టించడానికి కారణములు అవుతూ ఉన్నవి.

ఉచ్చారణా వైపరీత్యమును అనేక మార్గాలవలన సాధించవచ్చు. ఇంగ్లీషును తెనుగువలె తెనుగును ఇంగ్లీషువలె ఉచ్చరిస్తే నవ్వు వస్తుంది.

మై మదర్ కేము హియరు-సి, ఈస్, సిక్క (My mother came here. She is sick) అని ఇంగ్లీషును తెలుగులాగ ఉచ్చరించవచ్చు.

"వాడు వచ్చినాడు, మంచివాడు" అనే ఈ రెండు వాక్యాలు ఇంగ్లీషు వాక్యాలకు సహజంగా ఉండే, ఊపుతోనూ నొక్కుతోనూ ఉచ్చరిస్తే మందస్మిత పరిమితమైన ఆనందం కలుగవచ్చు.

కొంతమంది తెలుగు వాక్యాలను సంస్కృత వాక్యాలవలె ఉచ్చరించి హాస్యమును సాధించడము కద్దు. ఒకసారి శివశంకర శాస్త్రి గారిని అడిగినాను. "ఏమండీ, అనుష్టుప్ అనే రచన నడక ఎట్లా ఉంటుందీ" అని! వారు ఈ క్రింది వాక్యాలను అనుష్టుప్ వలె పలికారు ఉదాత్తానుదాత్తాది స్వర వైవిధ్యంతో.

ఒక కాని ఒకే కాని
రెండు కానులు అర్ధనా
మూఢు కానులు ముక్కానీ
నాల్గు కానులు ఒక అణా!

తెలుగులో వ్రాయబడిన ఈ క్రింది పద్యాన్ని సంస్కృతం వలె ఉచ్చరిస్తే రమణీయము అనింద్యమూ అయిన హాస్యము జనిస్తున్నది. అయితే ఈ క్రింది పద్యాన్ని శ్లోకము చదివినట్లు చదవవలె. అల్లాంటి పరామర్శకులో నైనప్పుడే ఇది అందంగా ఉంటుంది. ఈ రచనను సంస్కృత శ్లోకంలాగ నడిపించే నేర్పు ఉండాలె చదివేవానికి. తెనుగు పదాలలో కూర్చిన ఈ రచనను సంస్కృత శ్లోకంవలె చదివి ఉచ్చారణా వాల్లభ్యము వలన సంస్కృత శ్లోకమేమోనన్న భ్రమ గలుగజేయడంలో ఉంది నేర్పంతా !—

దొంగల్లారా భ్రమలు పడితే పేదవాళ్లం గదఝ్ఝా
కుండా మండా పగలగొడితే కొనుక్కోలేం గదఝ్ఝా

*    *    *

నత్తిగా మాట్లాడడము కూడా ఉచ్చారణా వైపరీత్యం క్రిందకే వస్తుంది. ఈ వైపరీత్యాన్ని ఈ అసహజత్వాన్ని ఆలంబనగా తీసికొని చేసిన రచన హాస్యజనకంగా ఉండకమానదు.

చెవిటివాళ్ల సంభాషణ కూడా ఈ రకము వైపరీత్యాన్నే ప్రదర్శించి హాస్య జనకము అవుతున్నది. కన్యాశుల్కంలో గిరీశానికీ ఫొటోగ్రాఫరు నౌకరుకూ మధ్య నడిచిన సంభాషణలో ఈ రకము శబ్దాశ్రయ హాస్యము కనపడుతుంది.

నేను ఒకసారి క్లాసులో పాఠంచెబుతున్నాను. అది నెపోలియన్ చక్రవర్తిని గురించిన విషయము. యూరోపును అంతా హడలగొట్టి, యుద్ధాలలో అనేకమంది రాజులను పరాజితులను చేసిన ఆ మహా పరాక్రమవంతుని చరిత్ర చెపుతూ ఉన్నప్పుడు ఎరికైనా రక్తం పొంగుతుంది. ఆవేశమూ వస్తుంది. నాకూ అల్లాగే ఆవేశము వచ్చింది. ఆ ఆవేశంలో మాట కాస్త తడబడ్డది. ఒక్క పర్యాయం మాత్రం నె, నె నె పోలియన్ అన్నాను నత్తిగా.

పాఠం చెప్పడం అయిపోయింది. చెప్పిన విషయాన్ని పాఠ్య గ్రంథంలో నుంచి చదవమని ఒక కుఱ్ఱవాడిని అడిగినాను. ఆ కుర్రవాడు చదవడము మొదలుపెట్టి "నే నెనె పోలియన్ యూ యూరప్‌ను అంతా-జ జ జయించెను" అని చదివినాడు. వీడు నన్ను హేళన చేస్తున్నాడే అని కష్టం వేసింది. అయితే వాడిని ఏమని కోప్పడేది! కోప్పడక, "ఏంరో, నాకేదో ఒక్క

సారి నత్తి వచ్చింది! ఆ మాత్రానికి నన్ను వెక్కిరిస్తావా? మర్యాదేనా ఇది'' అన్నాను. వాడు ఏడ్పుముఖం పెట్టి "నే-నే న్నేను మి మి మి మ్మల్ను ఎ ఎ ఎక్కిరించవలసిన కర్మం ఏ ఏ ఏ మొచ్చిందండి! నా నా న్నాకు న-న-నత్తి లే-లే లేక పోతే గద!'' అన్నాడు. వాడికి పాపం నత్తి ఉంది.

ఈ మాటలు అని ఆ అబ్బాయి సిగ్గుతో తల వంచుకొన్నాడు. అప్పుడు నేను అన్నానూ. "ఒరే నాయనా ఇందులో సిగ్గుపడా ల్సిన అవసరం ఏమీలేదు. అయినా ఇంకోసంగతి. ఈ నత్తి ఉంది చూశావూ ఇది గొప్ప గొప్ప వాళ్లకు ఉండేలక్షణం. బహు గ్రంథకర్త అయిన వర్జిల్‌కూ మహావక్త అయిన డిమా స్తెనీస్‌కు నత్తి ఉండేది. మొన్న మొన్నటిదాకా ఇంగ్లండులో (ప్రధాన మంత్రి)గా ఉంటూఉన్న చర్చిల్‌కు బాల్యంలో నత్తి ఉండేది. అంతగొప్ప వాళ్లకు ఉంటూ వచ్చిన నత్తి, నీకూ ఉందంటే, నీవుకూడా, అంత కాక పోయినా కొంత అయినా, గొప్పవాడవు కాక తప్పదు." అన్నాను. ఆ కుఱ్ఱవాడు సంతో షించాడు. ఇంతకూ నేను చెప్పవచ్చిన విషయం ఏమిటీ అంటే నత్తివలన పదోచ్చారణలో ఒక వైపరీత్యము ఒక అసహజత్వము ఏర్పడుతుందనీ దాని వలన నవ్వు వస్తుందనీ!

చెవిటివాళ్ళ సంభాషణలోకూడా మాటలు పలకడంలో ఒక వైపరీత్యము సంభవిస్తుంది. మనము ఒక మాట మాట్లాడితే చెవిటి వానికి ఇంకో మాటగా వినిపిస్తుంది. అదీ ఉచ్చారణలో వైపరీత్యము వంటిదే!

ఛాందస వైదికులు మాటలను ఉచ్చరించే విధముకూడా హాస్య జనకమే! పదోచ్చారణలో అపభ్రంశాలు, వంకరలు అవక తవకలు, ఇవన్నీ ఈరకము హాస్య సృష్టికి పనికి వస్తవి. మనము అందరమూ మాటలను ఉచ్చరించే విధానం ఒకటి ఉంది. దానికి విరుద్ధమైన పలుకుబడి మనకు విపరీతంగా తోచి నవ్వు పుట్టిస్తుంది. ఈ కారణంచేతనే ఛాందస వైదికులు మాట్లాడే కొన్ని పలుకు బళ్లు హాస్యా స్పదంగా కనిపిస్తవి. దీనికి ఒక ఉదాహరణ.

ఒక వైదిక కుటుంబంలో తల్లి కుమారునితో అంటుంది "నాయినా చద్దివణ్ణం తింఛావా, మీనాన్నగారు వచ్చిందాక ఉంఛావా" అని! ఈ మోస్తరు పదోచ్చారణ మనలో కొందరికి అసహజంగానూ విపరీతంగానూ కనిపిస్తుంది.

ఇంటికి పెద్ద వాడైన సోమయాజులు గారు సోమిదేవమ్మ గారితో ఒక శుభవర్తమానం చెబుతూ, "అస్సే విన్నావుషే, విస్సా వధ్ఘుల్లవారి బ్బ్రరినష మన విస్తాయ కిస్తారషే"అన్నారు. ఇల్లాగ అషే, ఉషేలు వారి సంభాషణలో తరచువస్తూ ఉంటవి. వైదికుల యింట్లో పిల్లి మ్రావు మ్రావు మంఛుంది అని హేళ నగా చెప్పుకోవడం కూడా కద్దు.

ఇల్లాగ మాటలను ఒత్తి పలకటమూ, సంయుక్తాక్షరాలు ఉపయోగించటమూ పామరజనం విని తాముకూడా స్వచ్ఛంగా పలకాలనుకొని చిత్ర విచిత్రమైన అపభ్రంశ రూపాలనువాడుతూ ఉంటే మనము నవ్వుకొంటూ ఉంటాము.

బిచ్చగాడు ఒకడు రామదాసు కీర్తన పాడుతూ "వెందుకూ వ్రేర్పరచినావో ఈ బ్రంధీఖానా'' అని అనడము నేను మొదటి సారి విన్నప్పుడు నాలో నేను ఎంతో సేపు నవ్వుకొన్నాను.

శబ్ద స్వరూపం తెలియకా ఆశబ్దాన్ని తనునోటికి వచ్చిన విధంగా ఉచ్చరించటము వల్లనూ వికృతాతి వికృతమైన రూపాలు తయారై వినోద కల్పనకు తోడ్పడుతున్నవి. యూక లిప్టస్ ఆయిల్ అనేమాట కొందరు స్త్రీల నోళ్లలో పడి యూక్లి సాహెబుగానూ యూకల్ పట్టసాయీబ్‌గానూ మారడము విచిత్రంగా ఉండి నవ్వడానికి హేతువు అవుతున్నది అల్లాంటిదే ఉమాపతి వైద్యము.

జీవితంలో దైనందిన వ్యాపారాలలో ఎక్కడ ఉచ్చారణా వైపరీత్య కారణాన ఇల్లాంటి వికృతమైన భాష వచ్చినా అది నవ్వు పుట్టిస్తూనే ఉంటుంది. శబ్దాశ్రయ హాస్యంలో ఉచ్చారణా వైపరీత్యం వలన సిద్ధించే హాస్యము ఒక అంతర్విశేషము.

కన్యాశుల్కంలో ఇల్లాగ ఉచ్చారణా వైపరీత్యం వలన జనించిన హాస్యము పుష్కలంగా దొరుకుతుంది.

దుకాణాదారుడు అంటాడు. "ఎందుకు కాట్లాడు తార్రా! నీదేవుడూ నిజమే! అదిగో ఆసీసాలో ఎలుగుతున్న ఆ రాముడూ నిజమే! గాజు కుప్పెలోన గడగుచు ద్రీపంబు, వ్రెట్టులుండు ఘ్యాన మట్టలుండు, తెలిసినట్టివారి ద్రేహంబు లందున ఇశ్వదా భిరామ ఇనుర ఏమ! కాట్లాట మాని ఘ్యానం వినం డొస్సి, ఎర్రి గొల్లోళ్లు."

ఇంకోచోట పోలిసెట్టి అంటాడూ, "ఈ బాపనోడు కపిత్వం శెప్పి మధుర వాణి దగ్గర వాణీ ఉంచని చెప్పేశాడు.''

ఘ్యానము ఇనడం, ద్రీపంబు, కపిత్వం, ద్రేహము. మొద

లైన మాటలు ఉచ్చారణా వైచిత్రి వల్లనే జనించినవి. ఈ మాటల ప్రయోగము వలన ఏదైనా హాస్యం జనిస్తే అది ఉచ్చారణా వైపరీత్యం వలననే జనించింది అంటానికి సందేహం లేదు.

ఇంక ఊపు, వలన విశ్రాంతి వలన. వాక్యంలోని ఒక శబ్దాన్ని నొక్కి చెప్పడము మూలాన హాస్యము ఏవిధంగా ఉత్పన్నము కాగలదో చూద్దాము.

ఒకాయన ఒక కాలేజీలో బుద్ధిహీనులను గురించి ఉపన్యాసం ఇయ్యడానికి ఒప్పుకొన్నాడు. ఆ కాలేజీ ప్రిన్సిపాల్ ఆయనను సదస్యులకు పరిచయం చేస్తూ "ఇవ్వాళ మీరు బుద్ధిహీనులను గురించి మంచి ఉపన్యాసము వింటారు. మంచి అని ఎందుకు అంటున్నానూ అంటే, ఆ ఉపన్యాసం యిచ్చే ఆయన బుద్ధిహీనతను....గురించి దాని స్వరూప స్వభావాలను గురించీ ఎక్కువగా పరిశోధన చేశారు.'' బుద్ధిహీనత అన్నమాట తరువాత కావాలని ఏర్పరచిన విశ్రాంతి వలన అర్థాంతర స్ఫురణ కలిగింది. చమత్కార జనకమూ అయింది.

ఉపన్యాసకుడు లేచి ఇల్లా అన్నాడు "నేను బుద్ధిహీనతను గురించి ఎక్కువగా చదివినాను కాని బుద్ధిహీనత విషయంలో మీ ప్రిన్సిపాలుగారు....తెలిసికొన్నంత నేను తెలిసికోలేదు.''

ఉపన్యాసకుడు కూడా కాకువులో నిక్షిప్తమైన అర్థాంతరాన్ని సాధించాడు. ఈ హాస్యము శబ్దములు ఉచ్చరించడంలో కాకువు వలన జనించింది ఇది శబ్దాశ్రయ హాస్య విశేషమే!

ఇటువంటిదే ఇంకొకటి-ఒక న్యాయాధిపతి ఒక నేరస్థుని గూర్చి "ఇంత స్కౌండ్రల్‌ను నే నెక్కడాచూడలేదు" అనగా, ఆ నేరస్థుడు జబాబుగా ఇల్లా అన్నాడు: "నేను దుర్మార్గుణ్ణే కాని, గౌరవనీయులైన న్యాయాధిపతి నా కంటే ... పెద్దదుర్మార్గుణ్ణి చూడలేదనడం అన్యాయం. నాకంటే అన్నచోట ఏర్పడ్డ విశ్రాంతివలన విపరీతమైన అర్థం వచ్చి చమత్కారం సిద్ధించింది.

ఈ రెండు కథలలోనూ బుద్ధిపూర్వకంగా కల్పించిన విశ్రాంతి వల్ల విపరీతార్థం ధ్వనిస్తున్నది. ఈ మోస్తరుగా కాకువువలన హాస్యోత్పత్తి శబ్దములు ఉచ్చరించడంలో గల వైచిత్రి వలననే!

రామునితో కపీశ్వరుం డిట్లనియె అనే వాక్యములో "రామునితోక'' దగ్గర ఆపి చదవడం వల్ల ఎంత అసభ్యమూ హాస్యాస్పదమూ అవుతుందో అందరికీ తెలిసిందే!

విశ్రాంతి ఇవ్వడంవల్ల హాస్యసృష్టి జరిగిన దానికి మరొక ఉదాహరణ. ఇది అందరకు తెలిసిందే. గుంటూరుకు సమీపంలో "లంజ చెరుకూరు" "కుక్క కాకాని'' అనే గ్రామాలున్నవి. ఒక యువకుడు మార్గ మధ్యంలో తనకు తారసిల్లిన ఒక సొగసు కత్తెతో వేళాకోళంగా అన్నాడు. "లంజా, చెరుకూరుకు దారేది?'' అని, లంజ అన్నమాట సంబోధించినట్లు ఉచ్చరించాడు. ఆ పిల్ల కూడా ఈ సరసోక్తిని అర్థంచేసుకొని, ''కుక్కా, కాకాని మీదుగాపో!" అన్నది కుక్క అన్నమాటను కొంత దీర్ఘాంతం చేసి, ఇందులో హాస్యముకూడా పైన చెప్పిన దాంట్లోవలె వాక్య మధ్యమంలో విశ్రాంతి కల్పింపగా జనించిన విశేషార్థాశ్రయమే!

అప్పిచ్చువాడు, వైద్యుడు ఎప్పుడు ఎడతెగక పారు నేరును ద్విజుడున్ అని ఏదో ఉంది పద్యపాదం. ఈ వాక్యం చదవడంలో 'అ' తరువాత విశ్రాంతి కల్పించి ఆ పిచ్చువాడు (పిచ్చివాడు) వైద్యుడు. అని చదివి వాక్యాన్ని విపరీతార్థ ప్రతిపాదకం చేయవచ్చు.

"తుమ్మెదా నొకసారి మోమెత్తి చూడమని చెప్పవే'' అని ఒక గేయంఉంది అందులో నాయకుడు తుమ్మెదను సంబోధిస్తున్నాడు. ఆ వాక్యాన్ని చదవడంలో తుమ్మెదా, అని దీర్ఘం తీయక, 'తుమ్మెద' అని ఉచ్చరించడం జరిగిందా, అర్థం మారిపోయి హాస్యజనకం అవుతుంది. తుమ్మెదను తుమ్ముతాను అని అర్థం వస్తుంది.

ఈ విధంగా ఊపు విశ్రాంతి ఉచ్చారణలలో వైపరీత్యం వలన ఒకరకమైన శబ్దాశ్రయ హాస్యము జనిస్తున్నది. విశ్రాంతి కల్పించి హాస్యాన్ని పుట్టించినట్లే వాక్యంలోని మాటలలో ఒక దానిని నొక్కి పలికి ఒక విపరీతమైన అర్థాన్ని స్ఫురింపచేయవచ్చు. ఆయనకు భార్య వలన సంతానం కలుగలేదు అన్న వాక్యంలో భార్య అన్నమాటను కాస్త నొక్కి పలికితేసరి, అర్థాంతర స్ఫురణ కలుగుతుంది. భార్య వలన సంతానం కలుగలేదు కాని ఇతరత్రా కలిగింది అనే అర్థము వస్తుంది. నిర్ణిరీక్షిత మైనట్టి హఠాత్ జనితమైనట్టి ఈ నూతనార్థము స్ఫురించడంతోనే అప్రయత్నంగానే నవ్వుతాము.

ఇల్లాంటి హాస్యము నారాయణదాసుగారు ఒకసారి కల్పన చేసినారుట! ఎవరో పురుషోత్తంగారి విషయమై మాట్లాడుతూ 'ఉత్తముండవు పురుషోత్తముండవు' అన్నాడు. ఆ అనడంలో 'ము' మీద కొద్దిగా నొక్కడంతో అర్థాంతర స్ఫురణ కలిగింది

సభికులు చకితులై మందస్మిత వదనులైనారు. పద్యం చదవ డంలో వచ్చే అవక తవకలుకూడా ఉచ్చారణా వైలక్షణ్యము క్రిందికే వస్తవి. అర్థానికి అనుగుణంగా విశ్రాంతి కల్పించక పోవడం వలన వచ్చే వికృతికి ఇంకొక ఉదాహరణ ఇస్తున్నాను.

"అనుగుం జెల్లెలవై ముకుందునకు, నా కర్ధాంగివై" అనే పద్యపాదం చదవడంలో అనుగుం జెల్లెలవై, ముకుందునకు నా కర్ధాంగివై, అని చదివి చెల్లెలవై అన్నచోట కొంచెము ఆగితే విపరీతార్థము జనిస్తుంది. ఫక్కున నవ్వు వస్తుంది.

ఒకసారి పత్రికలో రెండు శీర్షికలు ఒకదానిక్రిందమరొకటి, ప్రచురింపబడ్డవి. మొక్కపాటివారి ఉపన్యాసము అని ఒకటి, బెజవాడలో దొంగతనాలు ఎక్కువైనవి అని మరొకటీనూ! ఈ రెండూ ఒకదానితో మరొకటి సంబంధములేనివి కాని మొదటివాక్యం చదివినతరువాత విశ్రాంతి ఇయ్యక ఆ గుక్కలోనే రెండోవాక్యం కూడా చదివితే మొక్కపాటివారి ఉపన్యాసానికి ఫలితంగా దొంగతనాలు ఎక్కువైనవి అని అర్థం వచ్చి నవ్వులాటగా మారుతుంది. వాక్యాంతంతో విశ్రాంతి కల్పింపక పోవుటవలన జనించిన వికృతివలన హాస్యం ఉత్పన్నమైనదని గ్రహించవలెనని కోరుతున్నాను.

అల్లాగే "గుంటూరుకు క్రొత్త డాక్టరుగారు వచ్చారు. కలరావల్ల చావులు ఎక్కువైనై" అనే రెండు వాక్యాలనూ ఒకదానితో ఒకటి సంబంధంలేని వానిని కలిపి చదివి హాస్యవంతము చేయవచ్చు.

వాక్య మధ్యమంలో విశ్రాంతి కల్పించినట్లే, పదాంతం హ్రస్వము అయితే దాన్ని దీర్ఘముచేసి, దీర్ఘము అయితేదాన్ని హ్రస్వముచేసి, అర్థాంతర స్ఫోరకమగునట్లు మలచి ఇదేరకము హాస్యాన్ని సాధించవచ్చు.

ఒక ఆసామి కోర్టులో సాక్ష్యం చెప్పవలసివచ్చింది. ఆయన చేత ప్రమాణం చేయిస్తున్నారు. 'దేవుని ఎదుట నిజం చెప్పుతాను. అబద్ధం చెప్పను' అని అనమంటే ఆయన మొదటి వాక్యంలోని చివరి అక్షరానికీ రెండవ వాక్యంలోని చివరి అక్షరానికీ దీర్ఘంయిచ్చి, దేవుని ఎదుటనిజం చెబుతానూ, అబద్ధం చెప్పనూ, అని అన్నాడు. దీని వలన ఆ వాక్యాల వివక్షితార్థం మారిపోయి, వ్యతిరేకార్థ ప్రతి పాదకములై మొత్తం ఈ వాగ్ వ్యాపారమంతా హాస్యాస్పదం అయింది. ఇది పేలవమైన హాస్యము కావచ్చు. ఇందులో ప్రతిభగాని పాండిత్యం గాని ప్రదర్శితం కావడం లేదన్నమాట నిజమే కాని ఉచ్చారణా వైలక్షణ్యము వలన హాస్యాన్ని సాధించడానికి, ఇది యొక మార్గంగా పేర్కొనక తప్పదు కదా! ఎప్పుడో ఎవరో మహానుభావుడు ఈ పద్ధతిని, ఇంతకంటే మిక్కిలి రమణీయమైన హాస్యాన్ని కల్పన చేయకపోడు!

ఇంకొక్క విషయమున్నది. అది అనుకరణ. ప్రసిద్ధులైన వారు పద్యాలు పాడే పద్ధతినిగాని మాట్లాడే ధోరణిని గాని అనుకరించి హాస్యాన్ని సాధించవచ్చు, శ్రీ రుక్మిణీనాథశాస్త్రి శ్రీ విశ్వనాథవారినీ రాయప్రోలువారినీ, అనుకరించి నవ్విస్తూ ఉంటారు. శ్రీ వేణుమాధవరావు ఈ విషయంలో చాలా ప్రజ్ఞను సంపాదించాడు. వారు మాధవరాయశర్మగారిని బహు చమత్కారంగా అనుకరిస్తారు. ఒకరు 'మాట్లాడే పద్ధతిని అనుకరించటంలో అసమాన ప్రజ్ఞా విశేషాలను సంపాదించినాడు వేణుమాధవరావుగారు. ఎవరినైతే అనుకరిస్తున్నాడో, వారియందు గౌరవప్రతిపత్తులు ఉన్నప్పుడే అనుకరణ రమణీయమైన పద్ధతిలో నడుస్తుంది. అనుకర్త అవతల వ్యక్తి యొక్క ప్రతిభావిశేషాలను గుర్తించినపుడే ఈ ప్రక్రియ సాధ్యమౌతుంది. ప్రతిభ లేకపోతే ఏమి అనుకరిస్తాడు! కాబట్టి మనలను ఒకరు అనుకరిస్తున్నారూ అంటే మనలోఉండే ఏదో ప్రత్యేకతనూ, ప్రతిభనూ అవతలవాడు గుర్తించాడన్నమాటే! ఈ అనుకరణద్వారా చమత్కారాన్ని సాధించడము, ఉచ్చారణా వైలక్షణ్యమువలన హాస్యసృష్టి చేసే పద్ధతులలో ప్రప్రథమమైనదిగా ఉదహరించతగినది మాత్రం అవును,

పరమానందాయ గారి శిష్యులలో ఒకడు ఈ రకము శబ్దాశ్రయ హాస్యము అంటే విపరీతోచ్చారణ వలన జనించే హాస్యమును సాధించినాడు. గురువుగారు అన్నారట - 'పదన్న విషయము చెప్పినప్పుడు కాస్త రాగయుక్తంగా చెబితే మనోరంజకంగా ఉంటుంది' అని! ఒకరోజున గురువుగారు ఇంటలేనపుడు ఆయన నివసించే కుటీరమునకు నిప్పు అంటుకొంది. శిష్యుడు చూశాడు. గురువుగారి దగ్గరకు పరుగెత్తి కెళ్ళాడు. పున్నాగరాకంలో ఎత్తుకొన్నాడు, మీ యింటికి నిప్పంటుకొన్నది. అనే పాదము, రాగం, తానం పల్లవిలతో పావుగంట ఆలాపన చేశాడు. ఈ లోపున అక్కడ పనిపూర్తి అయింది. ఒక శబ్ద సముచ్చయమును పలకటంలో లేక ఉచ్చరించడంలో శిష్యుడు అవలంబించిన ఒకానొక అసహజమూ హాస్యాస్పదమూ అయిన

మార్గము నవ్వు పుట్టించడానికి కారణము అవుతున్నది. ఇక్కడ ఇదికూడా ఉచ్చారణా వైపరీత్యం క్రింద చేర్చడంలో విప్రతిపత్తి ఏమీలేదని అనుకొంటాను.

ఇంకొక్క విషయం చెప్పవలసివుంది. పసిపిల్లల ముద్దు మాటలు కొందరి పెద్దల ముద్దమాటలు, ఇటువంటి హాస్యాత్మకమైన అనుభూతిని కలుగజేస్తవి. తండ్రి పసిదానిని ముద్దాడుతూ అంటాడు. ఏం తల్లీ ఎందుకమ్మా ఏడుస్తావు? అంటే పసిపిల్ల "నాన్నా అమ్మె కొత్తింది. ఇక్కల కొత్తిందినాన్నా" అంటూ ఆ పసిబిడ్డ శబ్దాలను వికృతంచేసి ఉచ్చరిస్తున్నది. ఆ వింత ఉచ్చారణ మనలను చక్కిలిగింత పెడుతున్నది. పెద్ద వాళ్లు కొందరు ఇల్లాగే మాట్లాడతారు. వాటిని ముద్ద మాటలు అంటాము. ఆ మాటలు వింటున్నప్పుడూ, ఇల్లాంటి అనుభూతే కలుగుతుంది. ఒకాయన పత్రికలో అచ్చువేయమని పంపిన ప్రకటన చూడండి. **Thrunk - both - finther pleathe rethurn to Thamael Thmith ath thoon ath pothibel (Trunk - lost - finder please return to Samuel Smith as soon as possible).**

ఇటువంటిదే ఇంకొక కథ ఇద్దరు జంగాలు కలుస్తారు ఇద్దరూ చదువుకోని వాళ్లే! అయితే నేం విద్వాంసుల లాగ సంస్కృత మాటలు ఉపయోగించి స్వచ్ఛంగా మట్లాడాలని కోరిక కలవాళ్ళే. అందులో ఒకాయన. జంగంబు ద్రేబరగారూ చదుబ్రు కొన్నారా! అని అడిగినాడు రెండో ఆయన తృప్తిగా నవ్వుకొంటూ అన్నాడూ 'మీ కొప్పులో కిచ కిచలు' అని. అంటే మీ కృపవలన కించిత్ కించిత్ అని అనాలని ఆతని ఉద్దేశము. ఇక్కడ కూడా ఒక విచిత్రమైన ఉచ్చారణ వలన హాస్యము కొలదిగా భాసిస్తున్నది.

ఇంతకూ ఈ ఉచ్చారణా వైచిత్రివలన సిద్ధించే హాస్యము. శబ్దాశ్రయ హాస్య అంతర్విశేషాలలో చాలా పేలవమైనది మటుకు అవును. ఈరకము హాస్యము విన్నప్పుడు మనకు కలిగే ఆనందము వికార రహితమైనది. ఆత్మ వికాసమువలన కలిగేది కాదు. ఉత్తమమైనదీ కాదు. ఒక రకము చౌకబారు హాస్యము భావాశ్రయ హాస్యమూ అర్థాంతర హాస్యమూ ఇంతకంటే ఉత్తమమైనవని ముందు చెప్పదల్చుకొన్నాను.

శబ్దాశ్రయ హాస్యవిభాగాలలో ఉచ్చారణా వైపరీత్యం వల్లనూ, ఊపూ. విశ్రాంతులలో ఒక వైశిష్ట్యము వల్లనూ వికృతికల్పన చేయడమూ తత్ఫలితంగా ఆ శబ్దవ్యాపారం అంత హాస్యజనకం కావడమూ, ఏవిధంగా సంభవిస్తున్నదో చూశాము.

ఈ వ్యాపారంలో మనము ఏం జేస్తున్నామూ అంటే వ్యష్టి యందు పదస్వరూపాన్ని మార్చి, సాంగత్య సహచర్య సాన్నిధ్యాలలో వైరుధ్యంవల్ల సమష్టియందు వికృతిని సాధించి హాస్యకల్పన చేస్తున్నాము. వ్యష్టియందు సాధించిన వినూతన వికృతీరూప దర్శనమే ఆనందాన్ని ఇస్తున్నది.

ఈశ్వరుడే సృష్టిలో చిత్రవిచిత్రమైన రూపకల్పనచేసి ఆనందాన్ని పొందుతున్నాడు. గుఱ్ఱానికి మెడ పొట్టి, ఒంటెకు పొడుగు. మేకచేత నడిపిస్తున్నాడు. కంగారూచేత గంతులు వేయిస్తున్నాడు. పాముచేత పాకిస్తున్నాడు. పక్షిచేత ఎగిరిస్తున్నాడు.

అల్లాగే హాస్య సృష్టికర్త ఒక మాటను నొక్కి, ఒకమాటను తేల్చి పలకడం వల్లా, మాటలో ఉండే వర్ణక్రమాన్ని మార్చడమువల్లా వాక్యోచ్చారణలో కొన్నిచోట్ల విశ్రాంతి కల్పించడమువల్లా చిత్ర విచిత్రమైన రూపకల్పనలు చేసి, వికృతిని ఆవిష్కరించి, తత్ఫలితంగా ఈ వ్యాపారాన్నంతా హాస్య జనకంచేసి ముసి ముసినవ్వు నవ్వు కొంటున్నాడు. నిత్య జీవితంలో ఇంత వికృతి ఉండకపోవచ్చు అందుకని కావ్య జగత్తునందు, అనితర సాధ్యమైన రూపకల్పనచేసి, పరితృప్తితో ఆనందిస్తున్నాడు.





శ్రీ వేంకటేశ్వర హైయర్ సెకండరీ స్కూల్, గిద్దలూరు, కర్నూలు జిల్లా:
ముఖ్యమంత్రి చేత 1961 ఏప్రిల్ 12 వ తేదీన తెరువబడ్డది.



హైదరాబాదు జిల్లా యాచారంలో గతనెలలో తెరిచిన నూతన ప్రాథమిక ఆరోగ్య కేంద్రం.



యిన నెల రాష్ట్ర ముఖ్యమంత్రిచే తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ నూతన వసతి గృహం తెరువబడినది.



భద్రాచల శ్రీరామ ఆలయ దృశ్యం. వెనుక గోదావరి నది కనబడుతుంది.



హైదరాబాదులో సచివాలయంలో మార్చి 30 వ తేదీన జిల్లా పరిషత్తుల అధ్యక్షులు; ఉపాధ్యక్షుల సమావేశం జరిగింది. కేంద్ర సమాజాభివృద్ధి శాఖామంత్రి. శ్రీ యస్. కె. దే అధ్యక్షత వహించారు.



కలెక్టర్ల సమావేశం హైదరాబాదులోని జూబిలీ హాలులో ఏప్రిల్ 14 వ తేదిన ముఖ్యమంత్రి చేత ప్రారంభించబడినది.



ఏప్రిల్ 5 న శ్రీకాకుళం జిల్లాలోని పనసనందివాడ ప్రాజెక్టుకు శంకు స్థాపనోత్సవం జరిగింది.



నాగావళి నదిపై పనసనందివాడ ప్రాజెక్టు స్థల దృశ్యం.



స్వప్నలోకం కాదు-నాగార్జునసాగరం ఆనకట్ట స్థలం రాత్రి దృశ్యం.



నిజామాబాదులో మార్చి 28 న లఘు పరిశ్రమల అభివృద్ధికి రాష్ట్ర లఘు, కుటీర పరిశ్రమల మంత్రి తీవ్రతర ఉద్యమాన్ని ప్రారంభించారు.



పోయిన నెల ఆంధ్ర ప్రదేశ్‌లో పంజాబు సాంస్కృతిక బృందం వారిచ్చిన ప్రదర్శనలలో ఒక చక్కని దృశ్యం.

# శిలాక్షరాలు

పొరుగువాడు నడిచే యిరుకుటిరుల మార్గంలో
ఒక చిన్ని వెలుగుకిరణం ప్రసరింప గలిగితే నేను
సాటివాని కుచితమైన సత్క్రమదృక్పథం నేర్పి
విధ్యుక్త ధర్మ స్వరూపం వివరింపగలిగితే నేను
మున్నీరుగా మానవుడి ముఖంమీద కారే కన్నీటిలో
కరుణతో ఒక బిందువైనా చెరిపివేయగలిగితే నేను—

ఈ జగతి యిన్నేళ్లు సాగిన
నా జన్మ వృధా కాదు
నరజన్మ వృధా కాదు.

త్రోవతప్పిన బాటసారికి అందించి ఆరని ధర్మజ్యోతి
కర్తవ్యగాధ దీక్షాశీలిగా మార్చగలిగితే నేను
పూలమొక్క హృదయంలో పూర్ణసౌందర్య వాసన రేపి
అనంత కాంతి కుసుమాలు ఆవిష్కరింపగలిగితే నేను
దివికీ భువికీ మధ్య తీరాలు దూరం కావని
నరులకు ధైర్యం పలికి నమ్మించగలిగితే నేను—

ఈ జగతి యిన్నేళ్లు సాగిన
నా జన్మ వృధా కాదు
నరజన్మ వృధా కాదు.

మదిలో సందేహాన్ని విశ్వాసంతో ఖండించి, భయాన్ని దండించి
బ్రతుకులో ప్రేమకు-కరుణకు పట్టాభిషేకం చేసుకోగలిగితే
ఆశల వెలుగులలో పొంచి, ఆనందం జగతికి పంచి
అజ్ఞానపుటంధకోటికి దృష్టిప్రసాదింప గలిగితే
అందరి మదిలో ఆనందం నిండి-ఆశ వెన్నెలగా పండి
ఆపదలూ, భయాలు, బాధలు రూపుమాపుకోగలిగితే

ఈ జగతి యిన్నేళ్లు సాగిన
నా జన్మ వృధా కాదు
నరజన్మ వృధా కాదు

పూనికతో జీవితం దారిప్రక్క
నే నెపుడో నాటిన చిన్న మొక్క
కాలాంతరాన పెరిగిపెద్దదై
శాఖోపశాఖలై సాగినవేళ

ఏ ఒక్క తెరువరియోవచ్చి
ఆ ఊడలమర్రి నీడలక్రింద
పథిశ్రమం బాపుకుంటే
అదే నాకు పదివేలు!

ఆ నీడకూ నాకు అనుభూతి కూడకపోనీ
ఆ చెట్టు అందం నేను కళ్ళార చూడకపోనీ,—

ఆ మొక్క నాటిన నేను
అజ్ఞాతంగా వుంటాను
ఆ నీడ అద్భుతపు గాథలు
అమరుడనై వింటాను!

[కథియవాడ్ సమీపంలో లభ్యమైన శిలాశాసనం, అజ్ఞాతకవి రచన. దీనికి ప్రచారం కల్పించినవారు ఒక సుప్రసిద్ధ రక్తదాత. ఆంగ్లంనుండి అనువాదం—"కులపతి."]



ఆధునికుడు ఒక జిరాఫీలా తయారవు తున్నాడు. రోజు రోజుకు అతని మెదడుకీ హృదయానికీ దూరమెక్కువై పోతుంది.

—శరత్

# గొలుసు

బుచ్చిబాబు

పాత్రలు

1. **కుటుంబయ్య :** వయస్సు 47,48. అరవైయ్యేళ్ళవాడిలా కనిపిస్తాడు. దిగజారిన ఆకృతి. చామనచాయ. చాలాభాగం నెత్తిని వెనక్కి జరిగిన తలవెంట్రుకలు - కాస్తఫాషన్‌గా పొట్టిగా కత్తిరించిన మీసం. అరుబొత్తాముల చొక్కా, బ్లీచ్ అవని ముతకఖద్దరుధోవతి. ఆకర్షణీయంగా వుండే కళ్ల మినహా సాధారణమైన గ్రామపెద్దవైఖరీ.

2. **సీనయ్య :** నౌకరు. పల్లెటూరివనివాడి వేషం. నలభైలోపు.

3. **తిరుమల :** కుటుంబయ్య ఆఖరికొడుకు. ఏడెనిమిదేండ్లు, ఛలాకీగా వుంటాడు.

4. **ప్రతాపరాజు :** కుటుంబయ్య రెండోకొడుకు. వయస్సు ఇరవైరెండు. కొంత కాలేజీ చదువు అబ్బింది. ఉద్యోగంలేదు. పంచె, లాల్చీ ధరిస్తాడు. మొహం దీనంగా కనబడుతుంది కాని మాట పెంకిగా, దౌర్జన్యంగా వుంటుంది.

5. **లక్ష్మి:** కుటుంబయ్య మూడోకూతురు. పై ఊళ్లో హైస్కూల్లో చదువుకుంటోంది. సెలవలకి ఇంటికొస్తుంది. వయస్సు 16. పల్చటి కోలమొహం. చిన్నినోరు. వెడల్పుకళ్లు, చామనచాయ. పక్కపాపిడి, రెండు జడలు మెడ చుట్టూ జారతాయి. ముతకదుస్తులు-వోణీ-గులాబిరంగు జాకెట్టు, సంస్కారం సూచించే మొహం.

6. **పరంధామయ్య :** పక్కింటాయన. డబ్బుగల ఆసామీ. కాస్తచదువు, సంస్కారం పునాదియి. వ్యవసాయం, తోట, ఇంటి పనులు, ఊళ్లో కథలు, కార్యాలకీ ఆదుకోడం ఆయన వ్యాపకం. వయస్సు 44. సైకిల్‌కట్టుపంచి, పొడుగుచేతులచొక్కా, దానిమీద స్వెటర్ మధ్య పాపిడి-ఎగదువ్విన క్రాప్, కాస్తమీసం వుంటుంది. కండ్లకి జోడు. బుగ్గనిమచ్చ. కళైన మొహం కాని దిగులుగా కనబడతాడు. పరధ్యానంగా నవ్వుతూ పలకరించేకళ్లు,

7. **రామయోగి :** వయస్సు 25. కుడివైపు పాపిడి. రెండుప్రక్కలా ఎగదువ్వినక్రాప్. లాల్చీ, పైజామా-లాల్చీపైన ఖాదీ వేస్టుకోటులాంటిది ధరిస్తాడు. కాస్తంత ఎరుపు. సన్నటిపెదవులు, తీవ్రంగా, సూటిగా చూసేకళ్ళు, విశాలమైన నుదురు. మాట్లాడేటప్పుడు నవ్వుతూ సరదాగా కనబడినా పట్టుదల సూచించే పెదవుల బిగింపు, నోరు. అందమైనపళ్ళవరస. బి. ఎల్ పరీక్ష పూర్తి కాలేదు. సెలవలకి ఆ ఊరొచ్చి నప్పుడు, డెవలప్‌మెంట్‌బ్లాక్ అధికార్లతో గోష్ఠులు జరపడం, ప్రజా కార్యాల్లో పాల్గొనడం, పిల్లలకు చదువు చెప్పడం- అతని వ్యాపకాలు.

8. **కాంతమ్మ :** డెవలప్‌మెంట్‌బ్లాక్‌లో పనిచేస్తున్న గ్రామసేవిక. వయస్సు 22. తెలివైన కోలమొహం. సన్నటి పొడుగాటి శరీరం. ఖాదీచీర, జాకెట్టు, చేతికి రిస్టువాచి. మెళ్లో పగడాలదండ, జడలో గులాబీలు. తొందరగా మాట్లాడినా, స్ఫుటంగా, కచ్చితంగా చెబుతుంది. నిండైనపెదవులు. సన్నటిముక్కు-నిద్రనుండి లేచిన దానికిమల్లె తేరిపారచూసేకళ్లు. పమిట రొమ్మంతటా లాగి కప్పుకుంటుంది-పెద్దబరువు ఎత్తేటందుకు సిద్ధపడినదానికి మల్లె.

9. **దానయ్య :** వయస్సు దాదాపు అరవై. పాతకాలపు దుస్తులు. ఛాందసుడు. పై పూర్ణించి శుభకార్యాలు నిర్ణయించేటందుకు అవధాన్లు పంపగా వొచ్చిన ఆసామి. మతిమరుపు జాస్తి-కాని వొక్కొక్క సమయంలో ప్రతిదీ జ్ఞప్తికి తెచ్చుకుని, దాన్ని చెప్పివేసి, క్లిష్టపరిస్థితి లేవదీసే స్వభావం. ఫలానాపని అనిలేకపోయినా, సమయంవొస్తే, అతనికి సాధ్యంకాదన్న పనికి పూనుకుని, ఆశ్చర్యం కలగచెయ్యగల నిగూఢ శక్తులున్నవాడు.

10. **నాగయ్య :** ఊళ్లోపెద్ద. పల్లెటూరి వ్యవహర్తవైఖరి. వయస్సు యాభైలోపు. మీసాలు, వేషం భీకరంగా కనబడ్డా, సన్నటికంఠం, మృదువైనమాట.

# మొదటి అంకం

తెర లేవగానే చిందరవందరగా వున్న గది కనబడుతుంది. ఒక పాత భోషాణం, రంగూన్ కఱ్ఱపెట్టె, మూత తొలిగిన పాత ట్రంక్, కాళ్ళు ఎగుడుదిగుడుగావున్న పడకకుర్చీ, గోడకి జార్ల వేసిన రెండుమూడు మడతమంచాలు — కనిపించే సామాన్లు, నేలమీద గొంగళి పరచివుంటుంది. పిల్లల ఆటవస్తువులు, దుస్తులు, టిఫిన్‌కారియర్ గిన్నెలు, వంటింట్లో వుండవల్సిన కొన్ని వంటపరికరాలు, గోడని పాతకాలెండరు, వుట్టి, కొబ్బరి కాయలగుత్తి, కాగితాలకట్టలు. లుంగచుట్టి తగిల్చిన పంచెలు,— ఇవన్నీ యజమాని ఆర్థికస్తోమతని సూచిస్తాయి — గది మధ్యగా వున్న వొక ట్రైసికిల్ తప్ప.

నౌకరు సీనయ్య ప్రవేశించి కిందపడిన సామాన్లు సర్ది బాగుచేసే యత్నం చేస్తాడు. ఊడ్చేటందుకు ఖాళీజాగా కనపడదు. ఆట వస్తువుల్ని తీసుకెళ్ళి వో మూల కూర్చుని వినోదిస్తూండగా, ఇంటియజమాని కుటుంబయ్య చిన్న అద్దంముక్కలో మొహం చూసుకుంటూ ప్రవేసిస్తాడు. భోషాణం తెరిచి లోపల కెలుకుతూంటాడు.

సీతన్న : బాబోయ్ ! (కెవ్వున కేకపెట్టి) గొలుసు ! గొలుసు ! దొరికిందిరా గొలుసు....

కుటుంబయ్య : (అదిరిపడి) ఎక్కడ్రా, ఎక్కడ్రా గొలుసు .... గొలుసేమిట్రా ?

సీన : దూరంగా తొలగండి — నచ్చింది — నచ్చింది (గోడ మీద దేనితోనో కొడుతూ) గోడమీదబొమ్మ, గొలుసుల బొమ్మ, వొచ్చేపొయ్యేవారికి వొడ్డించేబొమ్మ — ఆ గొలుసండి.

కుటుం : ఏమిట్రా — తేలా ? — ఓర్ దానికంత కేకేమిట్రా. ఎర్రదా, నల్లదా ?

సీన : మనింట్లో ఎవరికి ఎర్రతేలుందండీ, ఎర్రతేలు రావడానికి— బొగ్గు నలుపుదే. (దూరంగా పారెయ్యడానికి వెడతాడు. మళ్లా కుటుంబయ్య భోషాణం కెలికి స్త్రీలు మెళ్లోవేసుగునే వొక పాతకాలపు గొలుసు పైకితీస్తాడు. అటుఇటు చూస్తాడు.)

కుటుంబ : సీనయ్యా — ఇటురా. ఇదిగోరా — అమ్మగా రిచ్చి పోయిన.... (గొలుసు సీతన్నకి ఇస్తూండగా, వాక్యం పూర్తి కాకుండానే, కుటుంబయ్య ఆఖరికొడుకు తిరుమల, వొకకాలు పైకెత్తి గెంతుతూ ప్రవేశించి, మధ్యగావున్న ట్రైసికిల్ ఈడ్చుకుపోతూ, నాన్న గుప్పెట్లో దేన్నో బిగించడం చూసి, అది కావాలని మారాం సాగిస్తాడు)

తిరుమల : అదియ్యి నాన్నా — గుప్పెట్లోది — నాకియ్యి. ఇవ్వకుంటే కోటుభొత్తాలు కత్తిరిస్తా నంతే—

కుటుం : నా కోటుకి బొత్తాలు ఎక్కడేడ్చినయ్యి కానీ నువ్వల్లా వెళ్ళి ఆ బల్లకట్టువాళ్లున్నారేమో చూసిరా—

తిరుమల : చేపలు పడుతున్నారుగా — ఇయ్యినాన్నా. 'ఇవ్వకుంటే ఏట్లోపడతా నంతే. ఏరంటే ఏరుకాదురా — నా సామిరంగా ఏరు పారేకాడ, కారూ నడవాదురా — నా సామిరంగా (పాట ధోరణిలో సాగిస్తాడు) అదేమిటి నాన్నా ? చేతులోది — దాచుకుంటున్నావు.

కుటుం : ఇదేముందిరా—ఇది లొసుగురా....

తిరుమల : లొసుగంటె ఏమిటినాన్నా. టర్‌టర్ బర్‌బర్ (సైకిల్ ఈడుస్తూ) ఆ లొసుగియ్యి నాన్నా. — ఆకలేస్తోంది. లచ్చమ్మ. కొట్టుకాడకెళ్లి కొనుక్కుంటా.

కుటుం : లొసుగంటె — లంపటంరా — ఏడుకొండలవాడా — లంపటం అంటె లొటారం — తెలిసిందా? ఏడిసావ్ - నడవ్వోయ్— వెళ్లి పాఠంఏడు.

తిరుమల : మా కివ్వాళ బడిలేదుగా. మేస్టారింట్లో పురుడు. వరుడికి పురుడూరాదూ

మరదూకి నిదురారాదూ-(పాడుతూ సైకిల్ బరబర ఈడుస్తాడు)

కుటుం : ఓరేయ్ — అది ఎరువు సైకిల్‌రా — వెళ్ళి ఆ పరంధామయ్య ఇంట్లో ఇచ్చేసిరా — నడూ.

(కొట్టబోతాడు. తిరుమల సైకిల్‌తో నిష్క్రమిస్తాడు)

అమ్మయ్య — ఇదుగో సీనయ్య — అమ్మగారిది ఆరుకాసుల బంగారం గొలుసు. దానిది బంగారంలాంటి మనస్సు గనకనే ఇది మిగిలివుంది ఇన్నాళ్ళు. చచ్చి స్వర్గానవుంది.

సీన : అదిమాత్రం నిజమండి. ఆమెగోరున్నన్నాళ్ళు ఇల్లు నరకమే

గదటండీ — అరు, మీరు, పిల్లలు, దేనికోదానికి కీసులాడతమే గదండీ—

కుటుం : ఒరేయ్ అవ్వేమ్మాటలురా — సంసారం అన్నాక, ఏవో గొడవలుండకుండా వుంటయ్యా.

సీన : తప్పేనండి — మరన్ను - స్వర్గంలో వున్నవారికి మనం సెప్పుకునే పన్నీ ఇనబడుతాయంట.

కుటుం : చప్పున తీసుకో గొలుసు. ఇది తీసుకెళ్లి—ఇక్కడొద్దు— రాచారంలో, తెలిసిందా — రాచారంవెళ్లి...(వాక్యం పూర్తవ కుండా కొడుకు ప్రతాపరాజు ప్రవేశించి, చేతులో సంచి దూరంగా పడేసి, మడతమంచం వాల్చుగుని దానిమీద చతిగిల బడతాడు. కుటుంబయ్య గాబరాపడి, గొలుసు దాచేసి, తేరు కుంటాడు)

ప్రతాపరాజు : ఏం రాచారమో—అయిందిగా—రాచారం వ్యవహారం గుండుసున్నా—తాతావారిదగ్గర బుర్ర గోరికించుకునేందుకు కానీ లేదట. వెనకటి బాకీతాలూకు వో ఇరవై నయాపైసాలు నువ్వు పంపితే. క్షురకర్మ కానిచ్చుకుంటాడుట!

కుటుం : హారివీడి! వోపందకూడా ఇవ్వనన్నాడుట్రా తాతిగాడు. మొన్ననేకదుట్రా వాళ్ళ పాలేరు చెప్పాడు, పుగాకుకి మంచి ధరొచ్చిందని—నిరుడు పదివేలు కట్నంపోసి కూతురుపెళ్లి కిర్రుగా చేశాడు. అడగలేకపొయ్యావూ?

ప్రతా : అడక్కేం! ఈ ఏడు, పుగాకుకి రంగు రాలేదుట. పెళ్ళయిన కూతురుకి పురుడురోజులుట. పురిటికి పట్నం తీసుకెడతాడుట. వెనకటి బాకీలో పదోవంతు నువ్వు పంపితే నరసింహస్వామి ఆలయంలో పది కొబ్బరికాయలు కొడతా డుట—వొంతు కొకటిచొప్పున.

కుటుం : ఆరి వీడికితస్సా! ఏమిటి చెయ్యడం?

సీన : రాచారం నన్నెళ్ళమంటిరిగా—అడిగొస్తా—

కుటుం : వొరే సీనయ్యా, నువ్వెళ్ళి ఆ పడవలవాళ్ల కలప తెచ్చా రేమో చూడు.

సీన : అయ్యగారు ఎక్కడో వుండారు. కాలవలో నీళ్ళే లేకుంటే పడవల వాళ్ళేందండీ!

కుటుం : నీళ్ళంటే జ్ఞాపకం వొచ్చింది—కాసిని మంచినీళ్లందుకోరా (సీనయ్య వెడతాడు)ఏమిటి చెయ్యడమో పాలుపోవడంలేదురా.

ప్రతా : ఏమో ఏంచేస్తావో—మామగారు తక్షణం బైలుదేరి రావల్సిందిగా కబురంపాడు. రేపోమాపో నీకోడలు కనడానికి సిద్ధంగా వుందిట.

కుటుం : అప్పుడే నెలలైనాయా?—బైలుదేరి వెళ్లు—వొరేయ్ ప్రతాపం. పోనీ మీ మామని కాస్త అదుకోమంటె?

ప్రతా : ఛఛ—నావల్లకాదు. కాన్పుకి ఇక్కడికి తీసుకురావడంలేదు సరిగదా—వాళ్లింట్లో ఇల్లరికం వుంటూ వాళ్ళనే వెళ్లి డబ్బడ గడమా—ఏ మొహం పెట్టుకుని అడగను?

కుటుం : కోడల్ని వొక్క పండక్కి పంపారు కారని జగడ మెయ్యి — వాళ్ళే లొంగుతారు.

ప్రతా : మనకి రోజుగడవడం లేదు — ఇక ఆ ముతా అంతాదిగితే. ఆక్కడ చూచేదిక్కెవరు? — నిరుడి పండక్కి, సీతా దాని మొగుడు పుట్టింట్లో బావుకుందామని వొచ్చినప్పుడు జరిగిన సంబడం చాలు. వీళ్లుకూడా ఎందుకు? అదల్లావుంచు. రేపు మరోవారంలో ఇంటర్వ్యూకి పట్నం వెళ్లాలి — వో పందేనా కావాలా? ఏం చేద్దామనీ? ఆలోచించావా?

కుటుం : ఆస్తంతా క్షవరమైతే వొక సుగుణమేమిటంటే ఆలో చించే అవసరం వుండదు. బుర్రఖాళీగా హాయిగా వుంటుంది.

ప్రతా : ఆస్తంతా క్షవరం కాలేదుగా ఇంకా — అమ్మ భూమి మిగిల్చావుగా.

కుటుం : (సీనయ్య తేచ్చిన మంచినీరు త్రాగుతూ) ఒరేయ్ అట్లాంటి మాటలనబోకు. పెద్దలగడింపూ, నా కష్టార్జితం — అంతా మీ కోసమే ఖర్చయింది — నీ కోసం, నీ అన్నకోసం, తమ్ముళ్లకోసం, అక్కలకోసం, చెల్లెళ్లకోసం.

సీన : మరోమాట చెప్పారు

ప్రతా : నువ్వు నోరు మూయవోయ్. మా కోసం ఖర్చయిందంటే నవ్వుతారు. పెద్దకొడుకు పెళ్లికి వొచ్చిన కట్నంతో మమ్మల్ని చదువువెలిగించమన్నావు. అమ్మాయిలకు కళ్లుతెరవకుండానే పెళ్లిళ్లుచేసి అత్తారింటికి సాగనంపావ్.

కుటుం : అవునురా — ధర్మానుసారంగా ఈడురాగానే పెళ్లిళ్లు చేశాను. అదీతప్పేనా ఏమిటి? ఇంకా లక్ష్మి, రాధా పెళ్లి కున్నారు. రేపు మీ ఆవిడ ఆడపిల్లనే కంటుంది. పెళ్లిచెయ్యా కుండా ఎంతవరకూ. అట్టే బెడతావో — నేనూ చూస్తానుగా. భార్యాపిల్లలూ, ఏకమై తగలెయ్యడానికి సాధ్యంకానంత ఆస్తి

సంక్రమించనూ లేదు — నేను కూడాబెట్టనూ లేదు, మరి!

(కూతురు లక్ష్మి ప్రవేశిస్తుంది)

లక్ష్మి : నాన్నా — ఎట్లావుంది అద్దాలతో కుట్టిన ఈ అంచు ? మన మహిళా సమాజంలో చూసి కుట్టాను. సగం పూర్తయింది. అద్దాలు దొరకవు ఈ పాడువూళ్లో. ఎర్రద్దాలు కావాలి—సీనయను పంపి తెప్పించి పెట్టవూ ? ఏం అన్నయ్యా. బాగుందా —?

ప్రతా : అద్దాల మాటకేం గాని లక్ష్మి — అన్నం మాటచూద్దూ? ఆకలేస్తోంది.

లక్ష్మి : నేను చూడ్డమే — అన్నపూర్ణమ్మ లేదు ?

సీన : లేరండి. లెగిచిపోయింది.

కుటుం : అదేమిట్రా. ప్రొద్దుటేచూశాను — వంటింట్లో సర్దుతోంది.

సీన : ఎద్దుబండెక్కి పుడాయించిదండీ — కూతురు పురుడంట.

ప్రతా : చెప్పకుండనే.

సీన : నెలారగంగానే జీతంరాళ్లు ఇస్తారా ఏమన్నానా - చెప్పే దేందిలే - అంటూ గుణిసి లెగిసిపోయిందండి.

లక్ష్మి : లేచిపోయిందన కూడదురా — అది తప్పు. నిష్క్రమించింది.

సీన : ఆ నోరు తిరుగనిపని గొప్పోరు సేసినప్పుడు నప్పుద్దండి.

కుటుం : ఇదేమన్నా పురుళ్లయుగమా ఏమిటి ! ప్రొద్దుటినుంచీ, ఆ మాట ఎన్నిసార్లు విన్నానో. లక్ష్మి, నీ కొత్త అద్దాలపరికిణితో వంటకి దిగమని ఎల్లా అనను ?

ప్రతా : ఆఖరికి మనగతి ఇల్లాగైంది. సమయానికి ఇంత అన్నం కూడా సిద్ధం అవదు గదా.

లక్ష్మి : నీకేం అన్నయ్య, హాయిగా సీనయ్య భాషలో — మామగారింటికి లెగిచి పోతావ్, నా మాటో ?

కుటుం : నీ విషయమే ఆలోచిస్తున్నాను లక్ష్మి — నీక్కూడా వొక మంచి సంబంధం కుదిరితే నాకు వొక బెంగ తీరిపోతుంది. రాధకింకా పదో ఏడేగా — దాని చదువు, పెంపకం, పినతల్లి చూసుకుంటుం దనుకో — మంచి సంబంధం అంటే వేలు కురిపించాలి.

ప్రతా : మొత్తంమీద ఎక్కడికో అక్కడికి ఈ గూడ్సుని రవాణా చేసెయ్యాలి.

కుటుం : గూడ్సులో సామానేదైనా, లాగేది బొగ్గింజినే కదుట్రా. ఎంత అప్పు తేగలిగితే అంత స్థితిపరుడన్నమాట ఈ రోజుల్లో.

ప్రతా : రాబట్టగల జాగాలన్నీ ఖర్చీ అయ్యాయిగా.

కుటుం : పెద్దల్లుడికి వ్రాశాను - వో నాలుగు వేలు సర్దమని. నాలుగు వేలేం కర్మ — అంతకంటె విలువైన నలుగురి సంతానాన్నికని దేశాని కంకితం చేశాను. కాబట్టి తన దగ్గర ప్రస్తుతం ఏం లేదని — సమాధానం వ్రాశాడు పెద్దయ్య.

లక్ష్మి : నాకు నచ్చాడు పెద్దయ్యర్ అవర్‌గళ్.

ప్రతా : ఒసే మవ్వేళ్లీ వంట తతంగం చూడు.

లక్ష్మి : ఒదిన్ని పిలిపించరాదా ఏం? ఆవిడగారు సుకుమార బిడ్డ — గారాలకొలికి. ఆవిడ నీడ కూడా అగపడనంత సన్నం. ఆవిడకు అన్నిపనులూ చేసి పెడితే, ముసలమ్మతో సహా విచ్చేసి మనకి విందు చేసిపెడుతుంది. అన్నట్లు — రోజులుగా — మరిచాను. క్షమించన్నయ్యా. రా - సీనయ్య. వంటవ్యవహారం చూద్దాం — నువ్వు కూర తరుగుదువు గాని....

(వెడుతుంది)

ప్రతా : సాయంత్రం నేనూ వెడతాను. చచ్చింతర్వాత మిగిలేది డబ్బు అన్నారు. అమ్మతాలూకు భూముందిగా. బేరంపెట్టు.

కుటుం : బేరం పెట్టి అమ్మడంకూడా జరిగింది.

ప్రతా : అమ్మయ్య బ్రతికాం. ప్రస్తుతానికి ఏదో వుందికద.

కుటుం : ఇప్పుడు కాదోయ్. అదంతా అమ్మడం, ఖర్చవడం జరిగి మూడేళ్లైంది.

ప్రతా : ఏమిటి — అమ్మేశావా ? — మాతో చెప్పకుండానే ?

కుటుం : చెప్పకుండా ఏం కర్మ —— సీతపెళ్లి ఎట్లాజరిగిందను కున్నావ్ ! చిలక్కి చెప్పినట్లు చెప్పి, మీ అందరి సంతకాలూ తీసుకున్న తర్వాతనే అమ్మగలిగాను.

ప్రతా : నాకేం తెలుసు? — డబ్బు బాకీ తాలూకు నోట్లనుకున్నాను. ఘోరం. మా కోసం అమ్మ ఇచ్చిపోయిన భూమిని, విషయం చెప్పకుండా సంతకాలు పెట్టించి అమ్మడం అన్యాయం.

కుటుం : అమ్మభూమి అనడానికి వీల్లేదు. దానిమీద తణకా లున్నాయి. ఉన్నాయని తెలిసికూడా కొనే దాత దొరికాడు మన అదృష్టవశాత్తు — మన పక్కింటి పరంధామయ్య.

ప్రతా : కొంపతీశావు నాన్నా.

కుటుం : కొంప నిలబెట్టాను —— అమ్మి. లేకపోతే అమ్మాయిల

పెళ్ళిళ్లూ అబ్బాయిల సతుకులూ ఎల్లా సాగుతాయను కున్నావ్. అమ్మభూమి అమ్మి ఆవిడకోరిక ప్రకారం. సంతానానికే ముట్ట జెప్పాను.

ప్రతా : ఛ! ఛ! పాడుబ్రతుకు. పెట్టిబేడా నెత్తినెట్టికుని హాలో లక్ష్మణా అనుకుంటూ పోతాను మామగారింటికి.

(వెడతాడు)

కుటుం : సీనయ్యా మన బ్రతుకులు ఇల్లాగున్నై.

సీన : అయినా, ప్రతాపరాజు అంత దురుసుగా అనకూడదండి. పెళ్ళికాకక్రితం సమ్మగ, మంచిగ వుండేవారు. అదుగో ఆ యమ్మని కట్టుకున్నాక—ఓ పేఁచేగి పోతుండారు. నానగూడ దనుకోండి.

కుటుం : ఏమిటోరా—మన బుద్ధులకు మరొకర్ని నిందించడం నా వల్లకాదు సీనయ్య. దైవం నన్ను తీసుకుపోతే బావుండునురా. ఇంతమంది సంతానాన్ని దేవుడు ఎందుకిచ్చినట్లు ?

సీన : దేవుడివ్వడం ఏందండి—దేవుడు వొద్దంటుంటె వినకుండా పుట్టుకొస్తారండి—పుడతం ప్రారంభిస్తే—ఎందుకో సెప్పనాండి—అల్ల, మొన్న ఆ నాగయ్య చెప్పాడండి—ఆళ్లకి మీరు బాకీ వున్నారట క్రితం జన్మలో—ఆ అప్పు రాబట్టుకునేందుకు మీ కడుపున పుట్టి, అణాపైసలతో వసూలు చేస్తానికే పుడతారంట.

కుటుం : అది నిజమైతే మన పక్కింటి పరంధామయ్యకి సంతానం ఎందుకు లేరంటావ్ ? పిల్లలకోసం, జపాలు, మొక్కులు, తీర్థయాత్రలు, మందులు,—ఓ నీ చిత్తం—ఎన్ని వేల ఖర్చు పెడతాడో లెక్కలేదు. నలభయ్యోపడిలో పడ్డాడా—సంతానం లేదు. మనసుకేనా భార్య డొక్కోడు.

సీన : మరాయన ఎవరికి బాకీ లేడుగనక. నా ఇసయం సూడండి. ఎనక జన్మంలో, రెండు మూడు పుంజీల రూపాయలు తీసుకున్నా కామాసండి—మా రంగమ్మ పుట్టుకొచ్చి, కట్నం సొమ్ముగా ఆ వొందా గుంజుకుపోయిందండి—వడ్డీతోసహా. ఈ మాటంటే రామయోగయ్య ఏమన్నాడో ఎరుగుదురాండి—

కుటుం : మనమ్మాయికి చదువుచెప్పే. ఘరానా ఆసామి రామ యోగా ?

సీన : ఆయనేనండి. భలేకబుర్లు సెప్తాడండి. రోజు సాయంకాలం ఆ బ్లాకోళ్ళ సావిడిలో నలుగుర్నీ పోగుసేసి, వో తెగనవ్విస్తా డండి. ఆయ నన్నాడూ——ఓరే బాకీపడత. సువ్వా, మీ ఆవిడా అని అడిగాడండి. దెబ్బతో ఎలట్రీ తీగమీద కాకి కూలినట్లు కూలానండి.

కుటుం : పోరాపో—నీ తత్వానికి సరియైన వ్యాఖ్యానమే చేశాడు ఆ రామయోగి—ఇదుగో—ఇట్లారా. వంటింట్లో అమ్మాయికి ఏం కావాలో చూడు. అదయింతర్వాత—ఇదుగో ఈ గొలుసు తీసుకెళ్లి.... (ఇవ్వబోతూండగా నాగయ్య ప్రవేసిస్తాడు)

నాగయ్య : ఏం కుటుంబయ్యా—రావొచ్చా ?

కుటుం : ఇంకా నయం. తమకి అడ్డుంటుందా——రండి——ఇల్లా కూర్చోండి. ఈ పడక్కుర్చీలో....

సీన : ఉండండి—ఈ కుర్చీ కాళ్ళన్నీ సరిగ్గా వున్నయ్యేమో చూడ నీండి. (సర్దుతాడు) ఇహ ఫరవాలేదు. కూర్చోండి.

కుటుం : సీనయ్యా నువ్వింట్లోపని చూసుకో.

సీన : చిత్తం. (వెడతాడు)

కుటుం : ఏం నాగయ్యా—ఇంత ఎండెక్కినా, ఇంకా ఇంటికి చేరుకోలేదేం ?

నాగ : బ్లాక్ ఆఫీసర్లతో యుద్ధమైంది. గాయాలకి మందేమన్నా వేస్తావని వొచ్చా.

కుటుం : చెప్పు, చెప్పు, ఏం జరిగిందేమిటి ?

నాగ : రోడ్డు వేస్తున్నారుగా—అది మా తోటని సగానికి చీలుస్తుంది. అందుకు భరించి వూరుకోవాలిట. ఇదంతా గ్రామాల అభివృద్ధి పథకమంట. నీ దొడ్డివైపు భూమి లేదు ?—ఆ గోడ పడగొట్టి, భూమి కొంత స్వాధీనం చేసుకుని, రోడ్డు పోనిచ్చి, మాఇంటి వెనక కాలవరేవు లేదు—అక్కడ కట్టబొయ్యే వొంతెనకు కల్పుతారట. ఇక నీకు బల్లకట్ల ఆదాయం సున్న.

కుటుం : దాని కొప్పుకోలేదుగా—ఆరోనెంబరు రాయిదగ్గర వొంతెన వుండనేవుంది. మళ్ళా ఇదెందుకు. నాకూ కబురంపారు. వీల్లే దన్నాను.

నాగ : ఆ వొంతెన మనుషులకేగాని, బళ్ళకి ఆగదుట. ఏముందీ ఈ గవర్నమెంట్ ఏపని చేసినా ఇంతేగా. మంచి రోడ్డెయ్యడం దానిమీద బలమైన లారీలు పోనివ్వడం, ఆ రోడ్లు ధ్వంసం చెయ్యడం. మళ్లా ఏ మహానుభావుడో తనిఖీ కొచ్చినదాకా కంకరతో మిశితమైన ఊబేననుకో. నువ్వుమాత్రం వొప్పుకోకు. నా తోటెంతలే. నాలుగైదొందలిస్తే సరేనంటాను. దానిమీద

అందులో సగం ఆదాయం రాదు. ఇంతకీ భోజనం అయిందా?

కుటుం : ఇంకలేదు. వొంటావిడ కూతురు పురుడుకని వెళ్లింది. మా లక్ష్మి అవస్థపడుతోంది.

నాగ : కష్టమే — నీకు. లక్ష్మికి వొంటచేసి పెట్టేటంత కుదు రొచ్చిందా?

కుటుం : అది మొదటినుంచీ కుదరైందే.

నాగ : ఏమోలె. కమ్యూనిటీ హాల్లో రిహార్సల్స్ జోరుగా సాగు తున్నాయిట: రాత్రింబగళ్లు మీ లక్ష్మి, ఆ మోహనం — వాడే ఆ శాంత అన్నగారు — అంతాచేరి నాటకం వేస్తున్నారట. అందుకన్నాను.

కుటుం : అల్లానా — నాకింకా తెలియదే.

నాగ : అవును మరి — వాళ్లమ్మ బ్రతికివుంటే ఇవన్నీ పట్టించు కునేది. అసలింత వరకూ పెళ్లిచెయ్యకుండా వుంచేదా ఏమిటి.

కుటుం : లక్ష్మికింకా పదహారేగా. వెనకటి రోజుల్లోలాగా, పసి తనంలో ఎవణ్ణో అంటగట్టి, బ్రతికున్నంతకాలం ఉభయులూ నన్నాడిపోస్తే సహించి ఎల్లా వూరుకోను. నే పడ్డాగా అవస్థ.

అదృష్టవంతురాలు — చనిపోయింది—భారతమాత నెత్తిన మరింత భారం వెయ్యకుండా.

నాగ : ఏం మాటలు కుటుంబయ్య. ఆ శాంతమ్మ ఉపన్యాసాలు వింటున్నావా ఏం కర్మ. దేశంలో అధికజన సంఖ్య సమస్య వొకటుందనీ, ఆ జనాన్ని పోషించడానికి తగినంత తిండి లేదనీ — కుటుంబనియంత్రణ ఇలాకా వాళ్ల ప్రచారం నిజమను కోకు. నా సలహా ఏమిటంటే — తక్షణం మళ్లా వివాహం చేసుకో సుఖపడతావు.

కుటుం : ఆ మధ్య రామానుజంగారు కూడా ఆ సలహా ఇచ్చారు. అవుతే ఆ సమస్యలేదంటావా?

నాగ : నేనీ భోగట్టా అంతా కదిపి చూశాను. ఏదేశంలో గరిష్ఠ- ఉత్పాదకశక్తి వుపయోగించి ఆ ఉత్పత్తివల్ల ప్రజలు జీవించ లేకపోతున్నారో—ఆ దేశంలో అధిక జనసంఖ్య సమస్య ఉంటుంది. అది మనదేశంలో లేదు.

కుటుం : అవును మరి. ఉత్పత్తి పెంచాలని రెండు పథకాలు వేసి అమలు జరిపారుగా.

నాగ : రెండేమిటి—మూడవ ప్రణాళిక చివరలో దేశం సస్య శ్యామల మవుతుం దన్నప్పుడు ఈ సంతాన నిరోధ పథకం ఎందుకు? నిన్ను నన్ను పెళ్లిళ్ళు చేసుకుని పిల్లల్ని కనడం విరమించండని చంపుకు తినేబదులు, నలభై మిలియన్ ఎకరాలు బీడు, నూటయాభై మిలియన్ ఎకరాల భూమి, యాభై మిలియన్ ఎకరాల అడవులపైనా దృష్టి మరలిస్తే, ఆహారపు కొరతుండదుగా.

కుటుం : కడుపునిండా అన్నం దొరకని బీదకుటుంబాలకే ఎక్కువ సంతానం—అదేం చిత్రమో!

నాద : అదే పొరబాటు. నువ్వు మొత్తానికి ప్రభుత్వంవారి ప్రచా రానికి లొంగిపొయ్యావు అమాయకుడవు. నువ్వు బీద కుటుంబంవాడివా—నీకు తొమ్మండుగురు సంతానం. నువ్వు మీ ఆవిడ పస్తుండగా పుట్టారా వీరంతా? ఆహారపు కొరత బీదకుటుంబాలలోనే—అంతస్తు తగ్గినకొద్దీ సంతానం అధిక మవుతోంది—అత్యధిక జనసంఖ్య ఈ కొరతకు కారణం అని ప్రభుత్వం తన లోపాన్ని కప్పిపుచ్చడానికి ప్రచారం చేస్తోంది.

కుటుం : నువ్వు చెప్పిందీ నిజంగానే తోస్తోంది. మన పూర్వీకులకి ఈ సమస్యలు లేవా?

నాగ : అదేంమాటయ్యా. ఐహికాముష్మిక జీవిత సమన్వయమే భారతీయ జీవితం. సంతానప్రాప్తే మన దాంపత్య ధర్మం. అదక్కర్లేకపోతే అసలు పెళ్ళే వొద్దన్నాడు గాంధీగారు. వెనకటివాళ్ళు ఇవన్నీ ఆలోచించే కొన్ని ఏరాట్లు చేశారు— నాలుగాశ్రమాలు, నాలుగోభాగం మాత్రమే గృహస్థాశ్రమం. అందులోనూ బోలెడు నిషేధాలు. తిధివార నక్షత్ర దోషా లున్నాయి. వ్రతాలు. నోములు బోలెడు. (కంఠందించి) గర్భోత్పత్తి దినాలుకూడా నిర్ణయించారు. అందుచేత కళ్లు మూసుకుని నువ్వు మళ్ళా పెళ్లిచేసుకోవాలి. నారు పోసినవాడు నీరు పొయ్యడా?

కుటుం : మరింత చెప్పినవాడవు. నువ్వు చేసుకోలేదేం నాగయ్యా.

నాగ : నేనా—మా పెద్దాడు పేచీకోరు. ఇంకేమన్నా వుందీ? రెండో వాడిదేం లేదులే. చెప్పుచేతల్లో వున్నాడు. వాడి పైచదువు సంగతే పట్టుకుంది. వొక్క వందలో ఈ గండం గట్టెక్కు తుంది—మరి...

కుటుం : చంపేశావు. నేనే జ్ఞాపకం వొచ్చాను! ఇంకేం చెప్పేది? వందే—!

నాగ : వందం చె—యాభై అయినా గిట్టొచ్చా ?

కుటుం : అందులో యాభైయ్యోవొంతు ఎవడైనా సర్దుతే ఈ క్షణాన ఎగిరి గంతేస్తాను.

నాగ : (లేస్తాడు) మరి వెడతాను. కొన్ని దేశాల్లో సంతానం కలిగినప్పుడల్లా ఏదో కొంత డబ్బు బహుమతిరూపంగా ముట్ట చెబుతారట—అల్లాంటి దేశాల్లో నువ్వూ నేనూ ఎంత గొప్ప వాళ్ళ వయ్యేవారమో !

కుటుం : అట్లాంటి సంతానాన్ని యుద్ధాలకి తీసుకుపోయేటందుకేగా.

నాగ : సరే—ఇంటికెడతా—ఇల్లాలు లేదు యుద్ధాలు లేవనుకుంటే. నాకు నా పెద్దాడొకడు దాపరించాడుకదా—

(వెడతాడు)

కుటుం : సీనయ్యా—ఇటురా (సీనయ్య వొస్తాడు) చూడు ఆ వీధిగుమ్మం తలుపు గడివెయ్యెట్టు.

సీన : అది నాతరం కాదండి—కింద మేకుకి తగిలించే కొక్కెం వూడిందండి—

కుటుం : ఎందుకూడింది—బాగుచెయించొద్దు ?

సీన : మన తిరుమలయ్య ఆటకోసం వూడగొట్టి కొక్కెం లాక్కెళ్లాడండి.

కుటుం : చూడు (గొలుసు పైకితీసి) ఇది తీసుకెళ్లి—రాచారం—ఎంతొస్తే అంతా....

(వాక్యం పూర్తవకుండా పరంధామయ్య ప్రవేశిస్తాడు)

ఒహో పరంధామయ్యా. ఎప్పుడు, పట్నంనుంచి రావడం ? రా, రా. కూర్చో.

పరంధామయ్య ; రాత్రొచ్చాను. ఇలా ఈ కింద కూర్చుంటాను — పట్నంనుంచి నే తెచ్చిన నల్లులు మీ కుర్చీకి పట్టకండా.

సీన : అంత లావుగావుంటా యేమిటండీ పట్నంలో.

పరం : మరేమిట్రా — భూతద్దంతో చూసినా దాని ఆకారం కన బడదు. అవీ పట్నంలో మనుషులకిమల్లె, పుష్కలమైన తిండి దొరక్క, చిక్కి శల్యమైనాయి. బీదవాళ్ళకి సంతానం ఎక్కువైనట్లు, వాటిసంఖ్యకూడా హెచ్చు. ఇదుగోసీనయ్యా— నీ కోసం తెచ్చాను — తీసుకో ఈ ముక్కుపొడుం డబ్బీ.

(సంచీలోంచి తీసి ఒక్కొక్కసామానే బైటపెడుతూ)

సీన : భలే, భలే — మీకు దణ్ణాలు బాబయ్యా. కాని అల్లా సాటుగా కేకేసి ఇవ్వలేకపొయ్యారా !

కుటుం : ఏడిశావ్ — వెళ్ళి పనిచూసుకో.

పరం : ఉండు సీనయ్యా — ఇదుగో పైకిల్‌బెల్ — తిరుమలయ్య ట్రైసికల్‌కి బెల్లూడిందిట. ఇదిగో — నిట్టింగ్‌దారాలు, లక్ష్మికి. బ్లాక్‌వారి వార్షికోత్సవానికి ఆడే నాటకంలో లక్ష్మికి వేషంవుంది. దానికి అద్దాల కుట్టుపని అంచులుగల దుస్తులు కావాలిట. అమ్మాయికియ్యి.

(అవి తీసుకువెడతాడు సీనయ్య)

కుటుం ; ఎంతమంచివాడివి పరంధామయ్యా — నీ ఋణం ఎల్లా తీర్చుకుంటామోకాని. లక్ష్మి అద్దాలపరికిణీ మాట చెప్పింది. ఏమిటో ఆ బ్లాకువాళ్ళ సంపర్కం నాకు సుతరాము ఇష్టంలేదు. పెళ్ళి కావల్సినపిల్ల. అదంతా అల్లరిచిల్లర మూక — వాళ్ళకి ప్రోత్సాహం ఆ రామయోగి వొకడు. బి. ఎల్. సున్న చుట్టిం దిటగా. ఈ వేషాలేస్తే చదువులొస్తయ్యా.

పరం : ఒకవిధంగా ఫేలవడం మంచిదేననుకో. ప్యాసైతే ఏ బస్తీలోనో, ఏ ఆఫీసులోనో స్థిరపడిపోతాడు. ఫేలవడంవల్ల గ్రామంలో వుండి, కొంచం గ్రామీణ జీవితం ఏమిటో, అక్కడివారి కష్టసుఖాలేమిటో తెలుసుకొనే అనుభవం దొరుకు తుంది. మన ఊళ్లో నలుగుర్నీ పోగుచేసి చదువు చెబు తున్నాడా మరి ! నాటకాలు మంచి ట్రైనింగే. ఈ పల్లెటూర్లో మరో వ్యాపకం లేదాయిరి. కాస్త సమాజం దృష్టి అలవడు తుంది. మన సమాజం వొకటుందనీ, దానిలో కొంతతనదనీ, దానిపట్ల కొన్నిబాధ్యత లున్నాయనీ తెలిసొస్తుంది. ఏంమంచి జరక్కపోయినా.

కుటుం : నీకేం నాయనా ? డబ్బుగల ఆసామివి. పిల్లాపీచులేదు. ఈ వినోదాలు, వేడుకలు నీకు చెల్లుతాయికాని—నాక్కుదరవు. ఆ మధ్య సమాజం వాళ్లు వేరే కులాల వాళ్లకి పెళ్లిచేసేశారట. ఇందుకా ఈ బ్లాకులు !

పరం : అవును. వారు ప్రేమించుకున్నారు. ప్రేమించుకున్నాక. ఈ కులాల పట్టింపులు అడ్డురావుగా, కుటుంబ పెద్దలు వొప్పు కోకపోయినా, సమాజం పెద్దలు చేసేశారు. ముచ్చటగా జరిగింది పెళ్లి. ఇద్దరూ ఏదో గడించుకుంటున్నారు. స్వతం త్రంగా బ్రతుకుతున్నారు. బ్లాక్‌పనులల్లో కృషి చేస్తున్నారు. జీవితంలో ఇంకేం కావాలి చెప్పు ?

కుటుం : నీకు సంతానం వుంటే అట్లాగనవు. రేపు లక్ష్మీ అట్లాంటి పని చేసిందంటే నేనీ వూళ్లో తలెత్తుకు తిరగ్గలనా ?

పరం : నువ్వన్నది కాదన్ను; అయినా మనం చేసినవన్నీ పది మంది హర్షించారా లేదా అన్నది ముఖ్యంకాదు కుటుంబయ్యా. మన దృష్టిలో అది సరియైంది — మంచిది అని తోచినప్పుడు ఆ పని చేసెయ్యడం న్యాయం. మొదట్లో పెద్దలు, పిన్నల అఘాయిత్యాలపైన విరుచుకు పడతారు — నిజంగా వారికి కోపం వొచ్చికాదు — అల్లా విరుచుకు పడితే తోటివాళ్లు మెచ్చుకుంటారనీ—అది సంప్రదాయం గనకా. కోపతాపాలకి కారణం, స్వార్థంకాక మరేమిటంటావ్ ? సరే — ఈ లెక్చర్ ఇచ్చే అర్హత నాకు లేదు — పిల్లలు లేరుగనక. ఇంతకీ నే నొచ్చిన పనేమిటంటే...(తటపటా యిస్తాడు) ఆ....పట్నంనుండి, వొక పిండిమర, నూని మరా తీసుకొచ్చా. మీ బల్లకట్టు వాళ్లు రూపాయి వొసూలు చేశారు ఇనాం అంటూ సరే, దానికేం.... మూడువే లయ్యాయి....

కుటుం : చూడు పరంధామయ్య — అవతల కోడలు ప్రసవించే రోజులని అబ్బాయి కోపించి వుడాయించాడు. పైగా ఏదో ఇంటరవ్యూట — డబ్బుకావాలిట. అమ్మాయి నాలుగు రోజుల్లో కాలేజీకెడుతుంది, జీతం కట్టాలి....నీ బాకీ....

పరం : (నవ్వుతాడు) ఇప్పుడు నేను బాకీ అడగబోవడం లేదు. అందుకురాలేదు. ఈ సరుకు పిల్లలకిచ్చి పోదామనొచ్చాను. సాయంత్రం తీరికైతే, వోసారి మన తోటలోకొస్తా వేమో పిలుద్దామని అమరలూ అవీ చూద్దువుగాని...

కుటుం : అమ్మయ్య. అందుకేకదా. చంపేశావ్. పరంధామయ్యా— ఎన్నాళ్లనుంచో అడగాలనివుంది — ధైర్యం చాలడం లేదు. అడిగెయ్యనా ?....

పరం : నాకు తెలుసు. ప్రస్తుతం అడక్కపోవడమే మంచిది. తీరా అడిగింతర్వాత, నే ననుకున్నది అడక్కపోతే మనస్సు చీకాకు పడుతుంది: అయినా వూహించి చూస్తాను. నీకుబోలెడు సంతానం వుంది. అందులో వొకర్ని పెంచుకోమని....అవునా?

కుటుం : భలే వూహించావు పరంధామయ్యా. అసాధ్యుడవు.

పర : నా భార్యకి ఆ అభిప్రాయంవుంది. నిజమే. చాలాసార్లు అనుకున్నాం. కాని మనస్సు అటు మొగ్గడంలేదు.

కుటుం : ఇంకా పుడతారన్న ఆశవుందా మీ ఇల్లాలికి ?

పరం : ఉన్నవాళ్ల అవస్థలు చూశాక, సంతానం స్వార్థంకోసమేమో అనిపిస్తుంది. పెద్దల ఆటలకి, ముద్దు మురిపాలకి పిల్లల్ని ఆటవొస్తువుగా వాడతారేమో. లేని నాబోటిగాడు కుక్కపిల్లనిపెంచి వినోదిస్తాడు. దాన్ని నలుగురికీ చూపించి, మా కుక్క ఎంతబాగుందో, ఎంతతెలివైందో అని ప్రదర్శించి గర్వపడతాడు. అది పెద్దదవగానే మరో ఆడదాన్ని వెదుక్కుంటుంది. దానికి సంతానం. ఆ సమయంలో దాని జోలికెడితే పైనబడి కరుస్తుంది.

కుటుం : ప్రస్తుతం. మా ప్రతాపం వైఖరి అల్లానే వుందనుకో.

పరం : ఇంకా నువ్వు అదృష్టవంతుడవు. నీ నెమ్మది, నిదానం, ఔదార్యం వారికి అబ్బాయి. అబ్బాయి అబద్ధమాడితే తండ్రి చెంప పగలెయ్యమన్నారు. తమ స్వంత కాపరాలు స్థిరపడగానే తలిదండ్రుల్ని ఇంట్లోంచి తరిమెయ్యడం చూస్తున్నాం. ఆస్తులకోసం హత్యలు చూస్తున్నాం. కలియుగంలో మనం ఎరగనిఘోరం ఏదుంది చెప్పు. మధ్యతరగతి సమష్టి కుటుంబాలన్నీ విచ్ఛిన్నం అయిపోతున్నాయని దేశనాయకులు వాపోతున్నారు. అదెల్లా అరికట్టాలో తెలీడంలేదు.

కుటుం : మరి మార్గం లేదంటావా ?

పరం : ఎందుకులేదు .... అసలు మనుషుల్లో స్వార్థం ఉండకూడదు. పిల్లలు, సంసారం బెడద అనగానే స్వార్థంపెరుగుతూంటుంది. వారి క్షేమంకోసం ఎన్ని పాపాలేనా చేస్తాం. లంచాలుచ్చుగుంటాం; అబద్ధాలాడతాం. నిజాయితీ వొదులుకుంటాం.

కుటుం : స్వార్థంలేక, సంతానంలేక, సర్దాలేక నీకు ఈ పొలాలు, తోటలు, మేడలు, మరలు ఎందుకు పరంధామయ్యా ! హాయిగా ఎవరైనా దత్తతుచ్చుగున్నావంటే వాడే అనుభవిస్తాడు మీ తదనంతరం.

పరం : తదనంతరందాకా ఎందుకు — నే వుండగానే జరుపుతాడు ఆ వైభవం. తదనంతరం మరింత జోరుగా సాగిస్తాడు. నాలుగేళ్ళలో అంతా ఖాళీ — వాడికి సంతానంవుంటే వాళ్లు రోడ్లుచ్చుకోవాలి.

కుటుం : మావాళ్ళు అట్లాంటివాళ్లు కారుస్మా. మహా బుద్ధిమంతులు. పూచికపుల్ల బైటకిపోనివ్వరు.

పరం : ఇన్సూరెన్స్ ఏజంట్ ధోరణిలో యాకరువు పెడుతున్నా

వేం—ఇప్పుడేగా మీ ప్రతాపం గురించి ఇదయ్యావు. అదల్లా వుంచు. వోవేళ పెంచుకున్నా ఆ పెంపు అసహజంగా తయారవుతుంది. కృత్రిమప్రేమ, వాడు, వాణ్ణి కన్న తల్లిదండ్రులు, డబ్బుమూటకేసి చూస్తూ కూర్చుంటారు. మనదేశంలో వారికి ఆయుర్దాయం తక్కువ. అదీ ఒకందుకు మెరుగే. పెంపుడు తండ్రి వోపట్టాన చావకపోతే బలవంతంగా చంపాల్సి వొస్తుంది. అది బైటికి రాకుండా, సంక్రమించే ఆస్తిలో సగం ఆక్షణానే ఖర్చు చెయ్యాలి. పెంచుకున్నవారికి, సహజమైన ప్రేమానురాగాలు, వాటిల్లోవుండే ఆనందం వుండవు. ఆ కుర్రాడి మనస్తత్వం కృత్రిమంగా తయారవుతుంది. ఆసించిన డబ్బు చేతికి రాకపోతే పిచ్చికూడా ఎత్తిన వుదంతం మనం పత్రికలద్వారా ఎరుగున్నదే. ఇంతకీ ఇవేవి నీముందు అనాల్సినవి కావు, తీరా ఎత్తావుగనక, కాస్త విపులంగా విసిగించాను. క్షమించేం. మరి సాయంత్రం అటుకేసిరా—పిల్లల్నికూడా తీసుకురా—చూస్తారు. (వెడతాడు)

కుటుం : శుభం—అల్లాగే.... (లోపలికెళ్లి తలుపు దగ్గరగా వేసి తిరిగి వొస్తాడు) సీనయ్యా—కాస్త మంచితీర్థం తీసుకురా. (సీనయ్య వొస్తాడు) ఇదుగో ఇటురా. (జేబులోంచి గొలుసు తీస్తాడు) ఈ గొలుసు తీసికెళ్లి—ఎంతొస్తే అంతా తెచ్చెయ్యి—మంచిధర తెస్తివా, నీ జీతంరాళ్లకి లోటుండదు.

సీన : అంతా రైట్ చేసుకొస్తా,—అమ్మాయి సదువు, అబ్బాయి పెళ్లి, కోడలు పురుడు, అల్లుడి ఉద్యోగం—నా జీతంరాళ్ళు—అన్నీ ఈ డబ్బుతో పెళ్ళుమని జరగవంటండీ...

కుటుం : అంతకంటె మంచిపని వొకటి జరగాలిరా. దగ్గరగా రా (రహస్యంగా) నీకింకా తెలుసుననుకున్నా—మొన్న అవధాన్లు చెబుతుంటే నువ్వూ వున్నావుకదుట్రా—

సీన : ఏటేటి—అవధాన్లు మంచిపిల్ల, బంగారంలా గుంటుంది. కావాలంటే కట్నంకూడా కురిపిస్తా నన్నాడు—ఇన్నా—అబ్బాయి గారికి కదంటండీ.

కుటుం : నీ మొహం — మన భూషణానికి ఇంకా పద్నాలుగో ఏడే కదుట్రా.

సీన : ఎల్లా - ఎల్లా - అసలు మొత్తంగా మొదట్నుంచీ చెప్పండి. ముంగలేమో పెద్దాయిన సత్యంగారు పెళ్ళయింది.

కుటుం : వాడితర్వాత, వో కొడుకు పుట్టిపొయ్యాడులే, నువ్వెరగవు. మూడోది అలివేణి.

సీన : అదే మార్తాండంగారి కిచ్చి చేశారుగా — ఆమె తర్వాత. రెండోఆయిన ప్రతాపరాజుగారు. అవునాండి ?

కుటుం : తర్వాత, సీతమ్మ, వివాహం చేసేశాను. తర్వాత, మన లక్ష్మి —

సీన : ఆపైన అబ్బాయి భూషణం — తర్వాతండి ?

కుటుం : తర్వాత, రాధ — పదకొండోఏడు — పినతల్లి దగ్గర పెరుగుతోందిగా.

సీన : మరె — సరి. — చివర చిలిపయ్య మన తిరుమలయ్య — తెలిసిందండి. మరైతే, మీ కెన్నేళ్ళండి ?

కుటుం : ఏడికావ్ లేవోయ్—వాళ్ళందరి వయస్సులూ కలుపు.

సీన : సచ్చాను. నావల్లకాదు బాబు. మరి అవధాన్లు సంబంధం ఎవరికండి ?

కుటుం : ఓరి చెవిటి సీనయ్య - మనకి.

సీన : మనకేంటండోయ్ ! తమకా బాబయ్య ?

కుటుం : సందేహం ఏమిటి పిచ్చినాగన్నా—స్వయానా నాకే. ఆ పిల్లని వోదఫా చూశాను. వారి కుటుంబాన్నిగురించి విన్నాను. రేపో మాపో అవధాన్లు తెగింపు చేసుకొస్తాడు. ముందు అవధాన్లు చేతిలో కొంత పడెయ్యాలి. అందుకు ఈ గొలుసు అమ్మకం హడావుడి—తెలిసిందా ? ఎవ్వరితోనూ అనమాక. ఏం ?

సీన : ఎవ్వరికీ తెలీకుండా అకివిలో రాచ్చసుల పెళ్ళంటండీ !

కుటుం : కాదురా మందగొండి. సంబంధం నిశ్చయమై అన్నీ స్థిరపడ్డాక, నలుగురికీ తెలియబరిచి బహిరంగంగా జరిగే వివాహమే. ఏం తప్పా ? ఎందుకు చేసుకోకూడదూ—ఇంకా యాభై రాలేదు. బోలెడు సంసారం. ఈ పిల్లల్ని ఎవరు చూస్తార్రా. వొంటావిడ లేచెళ్లిందీ—ఈపూట కుండలు డింకీలు. బోలెడు కథలు, కార్యాలు, ఎవరు జరిపిస్తారు. ఇదంతా పిల్లలకోసమే. ఆ ఇల్లాలు—అన్నపూర్ణ—చల్లటి వేళ తల్చుకోవాలి—పోయి మూడేళ్లవుతుంది నేకాబట్టి రెండేళ్లవరకూ పెళ్లిమాట అనుకోలేదు. మరోడైతే నెల తిరక్కుండా పీటలమీద కూర్చోడుట్రా !

సీన : అల్లానే వండి—నెలదాకా వుంటారంటండి—వొక్కొక్క అయ్య....

కుటుం : నోరుముయ్.

సీన : సిత్తం. సిత్తం. పోతుండ (వెడతాడు)

(కుటుంబయ్య భోషాణంబల్ల సర్దుతాడు. కుర్చీమీద జాగ్రత్తగా కూర్చుని పంచాంగం తిరగేస్తూంటాడు. అమ్మాయి లక్ష్మి వొస్తుంది)

లక్ష్మి : సీనయ్యా, సీనయ్యా—ఏడి? సీనయ్యేడి నాన్నా?

కుటుం : సీనయ్య పైవూరెల్లాడు. (కాస్త నిదానించి) మునసబు కొండయ్య పెళ్ళానికి జబ్బుగా వుందంటే.

లక్ష్మి : సరె. ఆ మునసబుకి పెళ్ళే కాందే.

కుటుం : పోనీ—ఆ మునసబు పెళ్ళాం చెల్లిలికి—ఎవరో వొకరికి—సరా?

లక్ష్మి : అంతకోపం ఎందుకునాన్నా. ఈపూట సమాజంవాళ్ళు వంటచేసి పంపుతామన్నారు. సీనయ్యాని తీసుకెళ్ళి పట్టించుకొద్దామని—సర్లే—నేనే వెళ్ళి బండిలో పెట్టించుకుని తీసుకొస్తా.

కుటుం : సమాజంవాళ్ళకి అంతదయ కలిగిందేం? అవుతే నువ్వు వాళ్ళనాటకంలో వేషం వేస్తున్నావుటగా—నాతో చెప్పొద్దూ?

లక్ష్మి : ఏదీ ఇంకా నిర్ణయం కాందే. కల్యాణి ఏదో పనిమీద ఇంటికెళ్ళిందిట—అందుకు నన్ను వెయ్యమంటే సెలవులుకదా అని సరే అన్నాను. వెళ్ళి తీసుకొస్తా (వెడుతుంది)

(తిరుమల ట్రైసికిల్ తొక్కుతూ పాడుతూ వొస్తాడు)

కుటుం : అన్నయ్యేడీ?

తిరుమల : సమాజంలో అన్నంతిని అత్తారింటి కెళ్ళాడు. నేను పరంధామయ్యగారింట్లో తిన్నాను. నాన్నా, వాళ్ళింట్లో భలేగా వుందిలే. కుర్చీలు, బల్లలు,—భోజనానికి—అన్నీ తళతళా మెరిసి పొయ్యే గిన్నెలు, ప్లేట్లు, కప్పులు—గోడల్ని దీపాలు, పూలతొట్లు బొమ్మలు—గాజువి నాన్నా—గుడ్డ విప్పుగున్న ఆడబొమ్మలు (నోరు నొక్కుగుంటాడు)

కుటుం : ఆయనకేం? ఎన్ని షోకులేనా పోతాడు, పిల్లా పీచూ లేదు.

తిరుమల : పీచు లేకేం నాన్నా—కాళ్ళు తుడుచుకునే పీచుంది—ప్లాస్టిక్‌ది—భలేవుందిలే—ఎరుపు, పసుపు, తెలుపు గొలుసులా అల్లింది—కాళ్ళ బురదంతా రాశాను—ఇంక కప్పులు పసుపు రంగువి—ఎట్లా వుంటుందో చూద్దామని, ఒకదాన్ని కింద పడేశాను. గుమ్ గుమ్, ముయ్ ముయ్, లింక్ లింక్, లాంగ్ లాంగ్ మంటూ పగిలి ముక్కలు ముక్కలుగా, ఎగిరి ఎగిరి—క్లింగ్ క్లాంగ్.... (తెర పడుతుంది)

(సశేషం)

---

# ప్రభుత్వ నిర్ణయాలు

కేంద్రప్రభుత్వంచే కొత్తగా ఆమోదింపబడిన పెన్షన్ నిబంధనలను రాష్ట్రప్రభుత్వ ఉద్యోగులందరికీ వర్తింపచేయడానికి ప్రభుత్వం నిశ్చయించింది.

కొత్తగూడెంలో రు. 21 కోట్లతో స్థాపించదలచిన ఎరువుల కర్మాగారాన్ని ప్రైవేటురంగానికి ఇవ్వడానికి ప్రభుత్వం నిర్ణయించింది.

ప్రభుత్వానికీ, ప్రభుత్వోద్యోగులకూ మధ్య సమన్వయాన్ని సాధించడానికి ఇంగ్లాండులోని విట్లీకౌన్సిళ్ళ మాదిరిగా సిబ్బంది సంఘాలను యేర్పరచాలని ప్రభుత్వం నిర్ణయించింది.

# మహానాయకుడు మోతీలాల్ నెహ్రూ

జి. కమలా త్రివేణి

మాతృగర్భంలో వుండగానే తండ్రిని కోల్పోయిన మోతీలాల్ నెహ్రూ చిన్నతనంలో శక్తికి మించిన విజ్ఞానంతోనూ, యౌవనంలో ఒడుదుడుకులతోనూ పెరిగి, గంభీరమయిన వ్యక్తిగా వికసించాడు. మొగలాయీ దర్బారుతో సంబంధాలు కలిగివున్న ధనిక కుటుంబంలో ఉద్భవించడాన రాచపోకడలు అలవడినవి. లోకపరిజ్ఞానానికి కావలసిన అజేయమయిన శక్తి తన మాతృమూర్తి విశేష ప్రభావంవల్ల ఆయనకు అబ్బింది.

యౌవనంలో వుండే తొందరపాటు కొద్దీ బి. ఏ. పరీక్షకు హాజరవకుండా మానివేసినా, హైకోర్టు వకీళ్ళ పరీక్షకు కూర్చొని ప్రథమశ్రేణిలో కూడా ప్రథమస్థానాన్ని పొంది బంగారు పతకం గెల్చుకున్నాడు. జీవితంలో విజయం సాధించాలనే దృఢసంకల్పం హృదయంలో తీవ్రంగా నాటుకున్నది. తండ్రితో సమానంగా ఎంచుకున్న పెద్దసోదరుడు ఆకస్మాత్తుగా పరమపదించటంతో మోతీలాల్‌పై అనేక బాధ్యతలు పడినాయి. శాయశక్తులా శ్రమించాడు. ఉన్నతస్థానం ఆక్రమించడానికి నిరంతరం కృషి చేశాడు. న్యాయవాద వృత్తిలో సిసలయిన యువరాజుగా చెలామణి అయాడు. ధనం అంతులేకుండా సంపాదించాడు. తగ్గట్లుగానే విపరీతంగా ఖర్చుచేసేవాడు.

మొగలాయి కోర్టుయొక్క మరుగువపడిన వైభవాన్ని ఆయన పునరుద్ధరించాడు. ఆంగ్ల గవర్నర్లకు, హైకోర్టు న్యాయమూర్తులకు ఆతిథ్యాలు ఇస్తూవుండేవాడు. ఆయన అత్యద్భుత జీవన విధానాలను గురించి కథలు ప్రచారంలో వున్నాయి. బట్టలు పరిశుభ్రం చేయడానికి వారం వారం పారిస్ పంపుతూవుండే వాడంటే ఆయన అభిరుచులు, విలాస జీవనం ఎలాంటిదో వెల్లడవుతూంది.

స్వతంత్రమయిన విద్యుచ్ఛక్తి ప్లాంటు, జలక్రీడా సరస్సు, విశాలమయిన నందనోద్యాన వనాలతో ఆనందభవనం రాజభవనంలా వుండేది. రోమను చక్రవర్తిని పోలిన శరీరకాయము, చూపరులను ఇట్టే ఆకర్షించే సౌందర్యముతో ఆనంద భవనం అధినేత అజేయంగా వెలుగొందాడు. ఇంటిలో ఆయన వున్నంతసేపూ పరిసరాల భక్తిపూరితమయిన భయం ఆవరించినా, ఇంటిగోడలు ఆపశక్యంకాని ఆయన నవ్వును ప్రతిధ్వనింపజేస్తూ వుంటాయి.

అలా కీర్తి, వైభవాలతో జీవితపు మధురానుభూతులలో తేలియాడుతూవున్న సమయాన గాంధీజీ పిలుపు వినిపించింది.

గాంధీజీ మంత్రదండం ఊపటంతో, మోతీలాల్ జీవితంలో ఎంతమార్పు వచ్చింది! అరువదేండ్ల వయస్సు సమీపించి, జీవిత విధానాలను, అలవాట్లను మార్చుకోవడం కష్టసాధ్యమయినప్పుడు కూడా, అంతవరకు శాసనానికి బద్ధుడుగా వున్న న్యాయవాది శాసనాన్ని ధిక్కరించడం నేర్చుకున్నాడు. మోతీలాల్ ముక్కోపి. జవహర్‌లాల్‌ను ఎంత గారాబంగా పెంచినా కోపం వస్తే చేయి చేసుకోటానికి వెనుకాదేవాడు కాదు. అటువంటి వాడు కోపాన్ని అణచుకొని, తనను తను అదుపులో పెట్టుకో నారంభించాడు ఆ వయస్సులో కూడా. ధనిక కుటుంబీకుడై కూడా పూలపాన్పును ముళ్ళశయ్యగా మార్చుకున్నాడు. వివిధ రుచులనుంచి మనసును మళ్ళింపజేశాడు. విదేశీ పోకడలకు జెందిన వస్త్రధారణకు అలవడినవాడల్లా దేశవాళీ చేనేతబట్టలను తొడగడం ప్రారంభించాడు. దేశశ్రేయస్సుకోసం సుఖజీవనాన్ని వదిలి, స్వాతంత్ర్య లక్ష్యంకోసం కష్టాల నెదుర్కోడానికి సిద్ధమయ్యాడు. సముద్రాన్ని దాటినందుకు ప్రాయశ్చిత్తం చేసుకో నిరాకరించిన వాడు, మతంలో నమ్మకం లేని యీ పండితుడు, ఎంతో వృద్ధిలోవున్న ప్రాక్టీసుకు స్వస్తి చెప్పడం ద్వారా వీటి సంబంధమయిన ప్రాయశ్చిత్తం ఆచరించాడు. వ్యాజ్యాలు, వివాదాలు మొదలయిన అనర్థకాల్ని ఆయన ఖండించాడు. పంచాయతీలు స్థాపించవలసిన అవసరాన్ని గురించి పెక్కుసార్లు నొక్కిచెప్పాడు. "కోర్టులో జయం అపజయమే; అపజయం అంటే మరణమే" నన్న ఒక హిందీ సామెతను పేర్కొని కోర్టులను బహిష్కరించవలసిందిగా విజ్ఞప్తిచేశాడు. జాతీయతా దృక్పథాన్ని ప్రచారంచేసే సాధనంగా ఆయన ఆరంభించిన

"స్వాతంత్ర్యం" (Independent) అనే దిన పత్రికలో తనుచేసిన తప్పిదాలకు విచారాన్ని వెలిబుచ్చాడు.

"ఈ పోటీలో నేనంత చిన్నపాత్ర వహించలేదని వెల్లబెట్టడానికి నాకు స్వేచ్ఛ వున్నది. అంతదాకా ఎందుకు. గత నాలుగువారాల క్రితంవరకు కూడా నేను యీ పోటీలో మునిగి తేలుతూ వున్నవాణ్ణే. హిందీ సామెతలో సవివరంగా తెలియపరచిన అనర్థకపు ఫలితాలలో నావ్హాటా ఎంత అనేదే నేను చెప్పను. అయితే పరిస్థితుల స్వభావాన్నిబట్టి, గత 37 సంవత్సరాలుగా సాధించినది త్రోసిపారవేయదగింది కాదు. ఆధునిక జీవన పరిస్థితులనుబట్టి ఎక్కువ ఫీజుకోసం సమర్థించడం, యీ రంగంలో గౌరవం బడసిన ప్రఖ్యాతుల పేర్లు ఉదహరించడం సాధ్యమే కావచ్చు. కాని దేశానికి అందువల్ల పరిణమించే ప్రభావాలతో నాకూ సంబంధం వున్నందున, అవన్నీ కూడా పతనానికి దారి తీస్తాయనిమాత్రమే చిత్తశుద్ధితో చెప్పగలను."

ఉద్దండుల యుగం అది. మోతీలాల్ ఉద్దండులలో ఉద్దండుడుగా ప్రకాశించాడు. భారతమాత కంఠహారములోని అద్వితీయ వజ్రముగా ఆయన వెలుగొందాడు. అవి తీవ్రమయిన సంరంభంతో గడచిన రోజులు. జాతీయ పోరాటంలో ఆయన పాత్ర ప్రశంసనీయం.

ప్రజల ప్రాథమిక పౌరసత్వ హక్కుల అపహరణకు దారితీసే రౌలత్ చట్టానికి నిరసనగా 1919 ఏప్రిల్ 6 న సత్యాగ్రహదినం జరుపబడింది. హర్తాళ్ళు, కాల్పులు, ప్రాణనష్టాలు జరిగాయి. జలియన్‌వాలాబాగ్ అమానుష రాక్షస కృత్యాలకు, సైనిక శాసనపు అరాచకాలకు దేశం ఘోషిల్లింది. పంజాబు సంఘటనలను గురించి దేశబంధుదాసు సహకారంతో మోతీలాల్ దర్యాప్తు నిర్వహించాడు. మోతీలాల్ హృదయం ఆక్రోసించింది. 1919 లో జరిగిన అమృతసర్ కాంగ్రెసు సమావేశానికి అధ్యక్షత వహిస్తూ, కాంగ్రెసులో చేరిపోవలసిందిగా లిబరల్ వర్గానికి చెందినవారికి విజ్ఞప్తి చేశారు. వారు నిరాకరించడంతో, ఆయన వారికి దూరమయ్యాడు.

సహాయ నిరాకరణోద్యమంలో గాంధీజీతో సహకరించి జైలు శిక్ష అనుభవించాడు. శాసన సభలలోకూడా యీ పోరాటం కొనసాగించాలని నెహ్రూ అభిమతం. అయితే ఈ విషయంలో ఆయన గాంధీజీని ఒప్పించలేక పోయాడు. జైలునుంచి తిరిగి రాగానే చిత్తరంజన్‌దాసుతో కలిసి మోతీలాల్ స్వరాజ్యపార్టీని స్థాపించాడు. "ఈ పార్టీ ఆశయం—స్వీయ కార్యక్రమంతో, అవకాశంకొద్దీ, జాతీయశ్రేయస్సు కనుగుణంగా సహకారం, సహాయ నిరాకరణ, నిర్మాణం, నిర్మాణేతర కార్యక్రమంకూడా."*

బెంగాలు శాసనమండలిలో ప్రతిపక్ష నాయకత్వాన్ని దాసు స్వీకరించాడు. నెహ్రూ ఢిల్లీలో కేంద్ర శాసనసభ నాయకత్వం వహించారు. ప్రఖ్యాత హిందూ, మహమ్మదీయ నాయకులు శాసనసభలో మేధావుల వర్గంగా యేర్పడినారు. నెహ్రూ, శ్రీనివాస అయ్యంగార్, రంగస్వామి అయ్యంగార్, చమన్‌లాల్, గోస్వామి, జిన్నా ప్రభృతులు సర్ విలియమ్ మడిమన్, సర్ మాకోమ్ హైలే వంటి ప్రభుత్వాధిపతులతో కత్తులు దూశారు. శాసనసభ అధ్యక్షుడుగా విఠల్‌భాయిపటేల్ చరిత్రను సృష్టించారు. అంతరంగిక వ్యవహారాల సభ్యుడు సర్ మాకోమ్ గవర్నరుగా నియుక్తుడవగానే, ఒక్క నిట్టూర్పు విడిచి, "పండితుల, పటేలుల బాధ నాకు వదిలింది" అని ఊపిరి పీల్చాడు. ప్రభుత్వ సభ్యులకు మోతీలాల్ ఒక బూచిలా తయారయ్యాడు. అయితే 1930 లాహోరు కాంగ్రెసు సమయానికి, శాసనసభలో ప్రవేశించటం నిరర్థకమని గుర్తెరిగి, ఇంకా పటుతరమయిన ఉద్యమంకోసం ఉవ్విళ్ళూరాడు.

భారత రాజ్యాంగ సంస్కరణల సమస్యను పరిశీలించడానికి బ్రిటిష్‌ప్రభుత్వం నియమించిన సైమన్ కమీషనును కాంగ్రెసు బహిష్కరించింది. కమీషనుతో సహకరించి కేంద్ర శాసనసభ తిరస్కరించింది. 1928 లో బొంబాయిలో జరిగిన అఖిలపక్ష సమావేశానికి మోతీలాల్ అధ్యక్షత వహించారు. భారతదేశానికి సర్వతంత్ర ప్రతిపత్తినిచ్చే ఒక పథకాన్ని ఈ సమావేశంలోనే రూపొందించారు. కలకత్తా కాంగ్రెసు మహాసభ మోతీలాల్ అధ్యక్షతన రాజ్యాంగం ముసాయిదాను ఆమోదించింది. ఈ సభ ఆంగ్లప్రభుత్వానికి, ముసాయిదాను పరిశీలించడానికై, ఒక సంవత్సరం గడువును అనుమతించింది.

1929 లో జరిగిన లాహోరు కాంగ్రెసు సమావేశంలో డిసెంబరు 31 సరిగ్గా అర్థరాత్రి సమయాన స్వాతంత్ర్యం కావాలని డిమాండుచేస్తూ తీర్మానం చేయబడింది. నిజంగా ఆ సమావేశానికి చారిత్రక ప్రాముఖ్యత వున్నదని చెప్పవచ్చు. అక్కడే, కాంగ్రెసు ఆధిపత్యాన్ని తండ్రినుంచి కుమారుడు స్వీకరించాడు.

* చౌరి చౌరా సంఘటన జరగటంతో సహాయ నిరాకరణోద్యమాన్ని గాంధీజీ ఉపసంహరించుకున్న తదుపరి యీ కార్యక్రమం ప్రారంభమయింది.

ఈ నాడు అనేకులు మోతీలాలును జవాహర్‌లాల్ తండ్రిగా పరిగణించడం కద్దు. ఆ రోజుల్లో జవాహర్‌లాల్‌ను మేధావి అయిన తండ్రికి తగ్గ కొడుకుగా పోల్చారు. ఆ దృశ్యానికి దేవతలు సహితం చూసి ఆశీస్సుల నందచేశారనటంలో అబ్బురం వుండదేమో! పురాతన ఆర్యవంశానికి చెందిన చక్రవర్తి తన సార్వభౌమాధిపత్యాన్ని కుమారునికి అప్పగించడాన్ని లాహోరు కాంగ్రెసులో జరిగిన ఈ సంఘటన గుర్తుకు తెస్తుంది.

ఆ సందర్భంలో అందరికంటె అత్యధిక ఆనందాబ్ధిలో ఓలలాడినవాడు మోతీలాల్. ఈ విషయాన్ని ఆయన ముఖకవళికలలో ప్రస్ఫుటమయిన ఉత్సాహాతిశయాలు వెల్లడించాయి. అంతకు ముందొక సందర్భంలో, పితృవాత్సల్యం జవాహర్‌లాల్‌కు కరువయింది. రౌలత్ చట్టాన్ని ధిక్కరించి, తన్మూలంగా జైలుశిక్ష పొందడానికి గాంధీజీ సత్యాగ్రహ సభను ప్రారంభించారు. జవాహర్‌లాల్ ఈ అవకాశాన్ని సద్వినియోగ పరుచుకున్నాడు. మోతీలాల్ యీ శాసన ధిక్కారమునకు వ్యతిరేకి. తండ్రీకొడుకులు అత్యంత వేదనావస్థను గడిపారు. జైలులో తన కుమారుడు గడిపే పరిస్థితిని తలుచుకుని, గుండె చెరువై, ఆ అవస్థను తానుగా అనుభవించి తెలుసుకొనడానికి కటికనేలపై మోతీలాల్ పవళించాడు.

మోతీలాల్‌కు చాలామందితో పరిచయం వుందిగాని, అయితే సన్నిహిత స్నేహితం బహుకొద్దిమందితోనే. దేశబంధు, మహాత్ముడు ఆయన స్నేహితులే. ఈ సన్నిహిత స్నేహితం వారి విభిన్నదృక్పథాలను బయల్పరచింది. దాసు పరమపదించినపుడు మోతీలాల్ చాలా బాధపడినాడు. మానవత్వంలో మోతీలాల్‌కు దృఢమయిన విశ్వాసం. ఈయన అభిమానించింది గాంధీలోని దివ్యత్వాన్ని గాదు, గాంధీ మానవత్వాన్ని — ఆయన విశ్వాసాన్ని, మనస్థైర్యాన్నీను. వీరి పొత్తు విచిత్రమయినది. గాంధీఅంటే అభిమానం వున్నప్పటికీ, తన దృఢసంకల్పాన్ని వెల్లడించడానికీ, గాంధీ దృక్పథంతో ఏకీభవించక పోవడానికి ఆ అభిమానం ఆటంకం కాలేదు.

యేండ్లు గడచినకొద్దీ స్త్రీలపట్ల ఆయన దృక్పథం మారుతూ వచ్చింది. ఆడవారి అవివేకంవల్లనే కుటుంబ కలహాలు వస్తుంటాయని యవ్వనదశలో వుండగా ఆయన నమ్మకం. శాసనోల్లంఘనోద్యమం సమయంలో, మహిళలు వీధులకెక్కి పోలీసులతో తారసపడటం వ్యక్తిగతంగా ఆయన అభిలషించేవాడుకాదు. అయితే, వారిని నిరుత్సాహపరచడం, లేక వారి కార్యకలాపాలకు ఆటంకం కలుగజేయడం ఎప్పుడూ చేసేవాడుకాదు. తరువాత తరువాత వారి పట్టుదలను, సాహసాన్ని ఆయన మెచ్చుకొనక తప్పిందిగాదు. ఆయన ప్రోద్బలంతోనే భారతదేశ నారీమణులనుద్దేశించి 1931 జనవరి 26 న "సంస్మరణ తీర్మానం" ఆమోదించబడింది.

"మాతృభూమిని ఎదుర్కొన్న అత్యవసర సమయంలో గృహాలను వదలి, పటుత్వం తరుగని ధైర్యం, పట్టుదలతో భారత జాతీయ సైన్యం ముందువరుసలో తోటి పురుషులతో పాటు భుజం భుజం కలిపి నిలచి, త్యాగాలను, ఫలితాలను పంచుకున్న భారత నారీమణులకు జోహారు లర్పిస్తున్నాం."

1930 లో, తన పాత గృహాన్ని మోతీలాల్ దేశానికి అర్పించేశాడు. అదే సంవత్సరం ఏప్రిల్ 6 వ తేదీన ఉప్పు సత్యాగ్రహం అనే నూతన తరహా సత్యాగ్రహోద్యమానికి పిలుపు నిచ్చి గాంధీజీ దేశాన్ని సంభ్రమాశ్చర్యాలలో ముంచెత్తారు. జవాహర్‌లాల్ అరెస్టయ్యాడు. ఆరోగ్యం సరిగా లేకపోయినా తనకున్న యావచ్ఛక్తి, పట్టుదలలతో మోతీలాల్ ఉద్యమాన్ని నడిపారు. ఆయన్నుకూడా సామ్రాజ్యవాద దురహంకారులు అరెస్టుచేసి ఖైదులో పెట్టారు. ఆరోగ్యం పూర్తిగా దిగజారిపోయింది. విడుదల చేయాలనే సూచన వినిపించగానే, ఏదో ప్రత్యేక సానుభూతితో వదిలిపెట్టడం తన కిష్టం లేదని ఆయన వైస్రాయికి తంతి పంపాడు. అయినా వదిలేశారు. జవాహర్‌లాల్‌ను కూడా విడుదల జేసి, మరల అరెస్టు చేశారు. ఈ వార్త తండ్రికి ములుకులా గ్రుచ్చుకుంది. పట్టరాని కోపంతో లేచాడు. బల్ల గ్రుద్దాడు. దృఢసంకల్పబలంతో అనారోగ్యాన్ని పారదోల ప్రయత్నించాడు. శక్తికిమించి పోరాడాడు. శాసనోల్లంఘన ఉద్యమాన్ని నడిపాడు. జ్వరంతో మంచంలో వుండే అనేక ఉద్యమాలను నడిపాడు. అవన్నీకూడా కాంగ్రెస్ సంస్థకు విజయాలే. ఆరోగ్యం ఇంకా క్షీణించింది. మృత్యువు సమీపించినట్టు ముందుగానే చూసివుంటాడు. బాపూజీతో ఇలా అన్నాడు. "మహాత్మాజీ, నా జీవితానికి చివరిఘడియలు సమీపించాయి. స్వరాజ్యం కళ్ళారా చూడటానికి నేను వుండను. అయినా మీదే అంతిమ విజయమని, స్వరాజ్యం త్వరలోనే లభిస్తుందని నాకు తెలుసు."

యవ్వనం తొలిదశలో ఆయన దివ్యజ్ఞాన సమాజంలో చేరి

(మిగతా 54వ పేజీలో)

# ఒక ఎకరం నీటిలో చేపల పెంపకం

ఇ. రామమోహనరావు

ప్రశ్న : ఒక ఎకరం నీటిలో చేపల పెంపకమని శీర్షిక ఎందుకు పెట్టారో కొంచెం చెబుతారా ?

సమాధానం : మనం దేన్నిగురించైనా చెప్పేటప్పుడు ఏదో ఒక ప్రమాణం తీసుకోవటం సహజం. ఉదాహరణకు ఇన్నిమైళ్ళ రోడ్డని ఇన్నిమణుగుల బరువని మనం సూచిస్తాము. కాబట్టి ఒక ఎకరంలో చేపల పెంపకం గురించి తెలుసుకుంటే చేపల పెంపకం గురించి బాగా అర్థంచేసుకోటానికి వీలుగా వుండును.

ప్ర : ఈ చేపల పెంపకానికి కొంతనీరు అవసరమని ఏమన్నా ప్రమాణం ఉన్నదా ?

స : అటువంటి ప్రమాణాలేమీ లేవు. కొన్ని చదరపు టడుగులు మాత్రమే ఉన్న చిన్న గుంటనుండి, కొన్నిమైళ్ళ విస్తీర్ణము గల పెద్ద పెద్ద జలాశయములలో గూడా చేపలను పెంచవచ్చు. కాని ఒక ఎకరం నీరైతే అన్నిటికి అనువుగా ఉంటుంది. అద్దె పెట్టుబడిగాని శ్రమగాని లేకుండానే రైతు తనంతట తనే స్వంతంగా చూచుకోవచ్చు.

ప్ర : ప్రతి చెరువుల్లో, కుంటల్లో, ఎన్నో కొన్ని చేపలుంటుంటాయికదా మళ్ళీ వాటిని మనంపెంచవలసిన అవసరం ఏమిటి ?

స : ప్రతిచెరువులో కుంటలో కొన్ని చేపలుండటం మాట నిజమే కాని అవిచాలాతక్కువ. ఆ నీటిలోనే మనం సరియైన జాతి చేపపిల్లలను వేసి శ్రద్ధగా పెంచినచో మంచి ఆదాయము,మనయింటికి కావలసినచేపలు లభ్యమవుతాయి.

ప్ర : ఈ చేపల పెంపకానికి ఏమైనా ప్రత్యేకపు చెరువులు కుంటలు సరిపోతాయా లేక దీన్ని గురించి ప్రత్యేకంగా వాటిని త్రవ్వించాలా ?

స : చేపల పెంపకానికి వేరే ప్రత్యేకంగా చెరువులు కాని కుంటలుగాని త్రవ్వవలసిన అవుసరంలేదు. సాధారణంగా డెల్టా ప్రాంతాల్లో పొలములలోగాని తోటలలోగాని రైతులు వ్యవసాయానికి గాని త్రవ్విన చెరువులలో చేపల పెంపకానికికూడా ఉపయోగించు కోవచ్చు.

ప్ర : డెల్టా ప్రాంతాల్లో విషయం బాగానే వుందనుకోండి కాని రాయలసీమ వంటి మెట్ట ప్రాంతాల్లో చేపల పెంపకానికి అవకాశాలు ఉన్నవంటారా ?

స : రాయలసీమ వంటి మెట్టప్రాంతాల్లో అంతగా చెరువులుండవు కాని వ్యవసాయానికి కావలసిన నీటికోసం పెద్ద పెద్ద దిగుడుబావులు త్రవ్వుతారు. వీటినికూడా చేపల పెంపకానికి ఉపయోగించు కోవచ్చు.

ప్ర : ఈ చెరువులుగాని బావులుగాని చేపల పెంపకానికి ఉపయోగించేముందు వాటికి ఏమైనా మార్పులు చేయనవసరం ఉంటుందా అలాగే ఉపయోగించుకోవచ్చునా ?

స : సాధారణంగా చేపల పెంపకానికి నీరు నాలుగైదు అడుగులలోతు అవుసరం ఉంటుంది. ఈమాత్రపు లోతు లేకపోతే ఆ చెరువులను లోతుచేయవలసి ఉంటుంది. నీరుపొర్లిపోకుండా చుట్టూ మంచిగట్లు అవుసరం. చేప పిల్లలను వదిలిన తరువాత అవి బయటకు పారిపోకుండా తూములకు జల్లెడ మూతలు అమర్చాలి. వీటివల్ల మన చెరువులోని చేపలు బయటికి పోకుండా కాపాడుటయే కాక చేపపిల్లలను తిని జీవించే కప్పలు, పీతలు, నీటి పాములు మొదలగు వాటినిలోనికి రాకుండా అరికట్టవచ్చు. చేపపిల్లలను వదిలే ముందు ఆ చెరువులోఉన్న ఇతర జాతి చేపలన్నిటిని అనగా, వాలుగా, కొర్రమీను, జల్ల మొదలైన వాటిని తీసివేయటం అవుసరం. ఎందుకంటే వీటికి చేపపిల్లలను తినేగుణం ఉన్నది.

ప్ర : ఒక ఎకరం నీటిలో షుమారు ఎంత చేప పెంచవచ్చుంటారు ?

స : సాధారణంగా కొంచెం శ్రద్ధతీసుకొని పెంచితే ఒక టన్ను

వరకు ఒక ఎకరం నీటిలో పెంచవచ్చు. కాని ఇది రైతు తీసుకునే శ్రద్ధ మీద ఆధారపడి వుంటుంది. చైనా జపాను దేశాల్లో ఒక ఎకరంలో ఎక్కువ కృషిచేసి మూడు నాల్గు టన్నులవరకు కూడా చేపలను పెంచుతున్నారు.

ప్ర : మనదేశంలో ఈ చేపల పెంపకం ఎక్కువగా ఏ యే రాష్ట్రాల్లో జరుగుతోందో కొంచెం చెప్తారు.

స : ఈ చేపల పెంపకం మన దేశంలో బెంగాల్, ఒరిస్సా రాష్ట్రాల్లో విరివిగా సాగుతోంది. అక్కడ ప్రతి యింటికి పెరట్లో ఒక చిన్న చెరువు ఉంటుంది. సాధారణంగా మన ఇళ్ళలోని పెరట్లో కూరగాయలను పెంచినట్లే వారు చేపలను పెంచి ఎప్పుడు కావలిస్తే అప్పుడు తాజాచేపలనుపట్టి ఇంట్లో వాడుకుంటుంటారు. తాజాచేపలు బహుతక్కువ. ఖరీదుకే ఇలా లభ్యమవుతూంటాయి. అదీకాక తాజాచేపలు రుచికూడా ఎక్కువగా ఉంటుంది. మన ఆంధ్రరాష్ట్రములో కూడా ఈ చేపలపెంపకం ఎక్కువప్రచారంలోనికి వస్తుంది.

ప్ర : ఈ చేపల పెంపకానికి చెరువుల్లో నీరు సంవత్సరం పొడవునా ఉండాలా! లేక కొద్దికాలం ఉంటే సరిపోతుందా?

స : 6 నెలలు అంతకంటె తక్కువగాని నీరు ఉంటే అవి చేపల పెంపకానికి అంత అనువుగా ఉండవు. సాధారణంగా 10 లేక 11 నెలలు నీరు చెరువులలో ఉంటే చేపలపెంపకానికి బాగా అనువుగా ఉంటై. ఎందుకంటే చేపపిల్లలు బాగా ఎదగటానికి అవకాశం ఉంటుంది. ఇటువంటి అవకాశం నీరు తక్కువగా ఉన్న చెరువులలో యుండదు.

ప్ర : మనకు అనువైన చేపపిల్లలు ఎక్కడ దొరుకుతాయో కొంచెం చెబుతారా?

స : ఈ చేపపిల్లలు మనకు సాధారణంగా ఆగస్టు, సెప్టెంబరు, అక్టోబరు నెలలలో దొరుకుతాయి. వీటిని డిపార్టుమెంటు వారు పట్టించి ప్రతిజిల్లాలోను వీలుగా సరఫరా చేయటానికై తగుచర్య తీసుకొన్నారు.

ప్రతి జిల్లాలోను Fish farms గాని Nurseries గాని ఉన్నాయి. అక్కడనుండి ఈ చేపపిల్లలను డిపార్టుమెంటు వారు ఆ జిల్లాలోని రైతులకు సరఫరా చేస్తున్నారు.

ఈ చేపపిల్లల ఖరీదు వాటివాటి జాతినిబట్టి ఏర్పరచబడ్డాయి. "బొచ్చెలు" మన దేశంలో చేపలన్నిటికంటే చాలా త్వరగా ఎదిగేచేప. దీని ఖరీదు నూటికి 3.2.0. ఇది ఒక సంవత్సరంలో 1½ అడుగు ఎదిగి 1½ నుండి 2 పౌనులు బరువు తూగుతుంది. "ఎర్రమైల" దీని ఖరీదు వందపిల్లలు 2-2-0 ఇదికూడా దాదాపు 8"నుండి 1 అడుగువరకు పెరుగుతుంది. ఈ రెంటితోపాటు గండుమీను "Labeos" ఇది పైవాటంత ఎక్కువ పెరుగుదల చూపకపోయినా పెంపకానికి అనువుగా ఉంటాయి. దీనిఖరీదు 100 పిల్లలు 1-9-0.

ప్ర : మనం చేపపిల్లలనుకొని చెరువులో వదిలిన తరువాత యింకా ఏమైనా చేయవలసి ఉంటుందా?

స : వ్యవసాయంలాగే చేప పెంపకంకూడా రైతు శ్రద్ధ కృషి మీద ఆధారపడి ఉంటుంది. "కష్టేఫలి అన్నారు" చేపలు పెంపకం మిగిలిన జీవరాసుల వలెనే వాటికి దొరికే ఆహారం మీద ఆధారపడి ఉంటుంది. నిజం చెప్పాలంటే సరైన తిండి లేకపోతే ఎంతబాగా ఎదిగే చేపైనాసరే ఎదగక గిడసబారిపోతుంది. పైన చెప్పిన జాతి చేప పిల్లలన్నికూడా శాఖాహారులే. అంటే అవి నాచుగడ్డిని బ్రతుకుతాయి. మిగిలిన చేపపిల్లలను తినవు. వీటికి సరియైనతిండి దొరకాలంటే వ్యవసాయంలో వలెనే సరియైన ఎరువులు వేయాలి. ఈ ఎరువుల్లో మామూలుగా రెండు రకాలున్నట్లు మీ కందరకు తెలిసిన విషయమే. రసాయనిక ఎరువులకంటే స్వాభావికపుఎరువులే శ్రేష్టమైనవి. రైతు వ్యవసాయానికిగాను పశువులుండటంవల్ల ఇవి తేలికగానే లభ్యమవుతాయి. చేపలు ఎదుగుతున్నకొద్దీ ఆహారం ఎక్కువగా కావలసి వస్తుంది కాబట్టి ఈ ఎరువులేకుండా తెలగపిండి, వేరుశనగ పిండి మొదలైన ఆహారములు అప్పుడప్పుడు పెడ్తూఉంటే ఎక్కువగా పెరుగుదల చూపిస్తుంది. బరువు ఎక్కుతాయి.

ఈ ఎరువులు సాధారణంగా వేసవికాలంలో చెరువు బాగా ఎండిపోయిన తరువాత ఎకరానికి ఒకటన్ను చొ॥ నేలలో కలిపి దున్నివేస్తే మంచిది. తర్వాత మూలలలో గోతులు త్రవ్వి అప్పుడప్పుడు పేడవేస్తుండటం మంచిది.

ప్ర : మీరు చెప్పిన విషయంబాగానే ఉంది. కాని నీటిలో చేపలకు కావలసిన ఆహారం ఉన్నది లేనిది ఎట్లాతెలుస్తుంది. దానికేమైనా సులభమార్గముంటే సెలవిస్తారా?

స : దీనికి కొన్ని సూచనలునై్న. నీరు తేటగా క్రింద నేల కూడా కనపడేట్లు ఉంటే అందులో ఏమి ఆహారంలేదన్నట్లు

నిర్ధారణ చేసుకోవచ్చు. నీరు కొంచెము పచ్చగానుంటే దానిలో చేపకు తగిన ఆహారంఉన్నదని ఊహించవచ్చు. మనం మనచేతిని మోచేతివరకు నీటిలో ముంచితే మన అరచేయి కనుపించక పోతే దానిలో మంచి ఆహారము ఉందని నిర్ధారణ చేసుకోవచ్చు. దీనినే మనం ఎరువులు కలిపేటప్పుడు గమనించ వలసిఉంటుంది.

మామూలుగా రోజుకు ఒకసారి తెలగపిండిగాని వేరుశెనగ పిండిగాని చిన్న చిన్న ఉండలు చేసి వేయడంవల్ల కూడా చేపలుబాగా పెరగటానికి అవకాశం ఉంది.

ప్ర : మీరు చెప్పినదాన్నిబట్టి చూస్తే చేపల పెంపకం కొంచెం కష్టతరమైనదిగానే కనపడుతూందే ?

స : నేను ఇదివరకె చెప్పినట్లు చేపల పెంపకంకూడా రైతు చూపే శ్రద్ధమీద ఆధారపడి ఉంటుంది. కాని వ్యవసాయంతోపోల్చి, చూస్తే ఇదేమంత కష్టమైనది కాదనేచెప్పాలి. ఎందుకంటే దీనిలో దున్నటం, విత్తులు చల్లటం, కలుపు తీయటం, మొదలైనవి చేయనవసరంలేదు. సాధారణంగా చెరువులో చేపలను వదలినతరువాత అప్పు డప్పుడు దాని వలలలో పట్టి ఎట్లా ఎదుగుతున్నది చూస్తే చాలు వేరే 'వ్యవసాయ మంత' శ్రద్ధ చూపనవుసరంలేదు. పనికిరాని ఇతలు చేపలుగాని కప్పలుగాని ఉంటే తీస్తుండాలి బాగా ఎదగకపోతూంటే తిండిపెట్టుతూ ఉండాలి.

వేసవికాలంలో నీరు తగ్గేటప్పటికి చేపలుబాగా ధర రావాలంటే వర్షాకాలంలో చేపదొరకని సమయంలో అమ్మటం మంచిది.

ప్ర : మీరు చేపల పెంపకం లాభదాయకం అన్నారుకదా ఒక ఎకరంలో చేపలు పెంచాలంటే ఎంత ఖర్చు అవుతుంది. దానిపై రెండువేల బొచ్చె పిల్లల ఖరీదు 75 రూ. ఫారము నుండి చెరువుకు రవాణాఖర్చులు 100 రూ. ఎరువులు తెలగపిండి ఖర్చులు 150 రూ, చేపలు పట్టినందుకు 200రూ. మొత్తం ఖర్చులు 525 రూ. రాబడి:— 2000 పౌనుల చేపలు, పౌను 1కి 50 న.పై. చొప్పున రూ. 1000 ఇందులో ఖర్చులు 525 రూ. లాభము 475 రూ. వస్తుంది.

ప్ర : మీరు చెప్పినదంతా బాగానే ఉన్నది. చేపలు పెంపకం కూడా లాభదాయక మంటున్నారు. కాని దీనికి ప్రభుత్వం వారు ఏదైనా ప్రోత్సాం ఇస్తున్నారా ?

స : ఈ చేపల పెంపకం ఎక్కువగా Popular చేయాలని మత్స్య శాఖ ముఖ్యఉద్దేశాలలో ఒకటి దీనిని అభివృద్ధి చేయటానికి ప్రణాళికలో వేరు వేరు పథకాలు చేర్చబడ్డాయి.

చేప పిల్లల కొరకు రైతులవద్దనుండి గిరాకి పెరుగుతూంది, చేప పిల్లల ఖరీదుకూడా అందరికి అందుబాటులో ఉండేటట్లు రేట్లు ఇదివరకు కంటే తగ్గించ బడ్డాయి. సంవత్సర సంవత్సరానికి మత్యశాఖవారు చేప పిల్లలను ఎక్కువ సరఫరా చేస్తున్నారు.

1957—8,43,010

1958—9,44,786

1959—16,33,666.

ఈ చేపలపిల్లలను బ్లాకులకుకూడా యిస్తున్నారు. ఆ బ్లాకు వారు వాటిని సగం ఖరీదుకు రైతులకు ఇస్తున్నారు.

ఈ మధ్యని అవుసరం ఉన్నవాళ్ళకు చెరువులు త్రవ్వుకునేందుకు అప్పులు ఇచ్చే పథకంకూడా మంజూరైంది. ఈ మధ్యనే మన రాష్ట్రింలోకల్లా పెద్దదైన చేపల Farm "చేటపర్రు"లో నెలకొల్పబడింది. ఇంకా ఈ పరిశ్రమను అభివృద్ధి చేయటానికి తృతీయ ప్రణాళికలో క్రొత్తక్రొత్త పథకాలు వేయబడ్డాయి.

మత్స్య తృతీయప్రణాళికలో రూ. 115 లక్షలలో 26.73 రూ. లక్షలు మంచినీటిచేపల వృద్ధికై కేటాయించబడింది. కాబట్టి వీలైనంత ఎక్కువమంది వారివారి చెరువులలో చేపల పెంపకాన్నిచేసి ప్రణాళికలో కేటాయించిన ధనాన్ని సద్వినియోగం చేస్తారని ఆసిద్దాం.

(ఆకాశవాణి సౌజన్యంతో)



# తెలుగుకథ - తీరుతెన్నులు

పోతుకూచి సాంబశివరావు

నేటి సాహిత్యయుగంలో వివిధ సాహిత్య విభాగాల పోకడలు పరిశీలిస్తే, కథారచన ముఖ్యంగా బాగా విస్తృతంగా పెరిగిపోయింది. ఛందోబద్ధమై లేక యతిప్రాసలలో ఏదో ఒక నియమబద్ధమైన కవిత లేదా, స్వేఛ్ఛాయుతమైన అభ్యుదయ కవిత, సాహిత్యరంగంలో అడుగుపెట్టాలనుకునే ప్రాథమిక రచయితకు ఎక్కువ అందుబాటులో ఉండదు. ఇదేవిధంగా, నవల, నాటకం, విమర్శనకూడా ప్రాథమిక రచయితకు చాలా దూరం; ఆ ప్రక్రియ విశిష్టతబట్టి. ఏదో ఒక అంశం గురించి అందుబాటులో ఉన్న భాష సహాయంతో ఆ అంశానికి సంబంధించిన సంఘటనల చిత్రణ, ఒక క్రమమార్గంలో చేసినా, ఒక కథలాగ సులువుగా పరిణమిస్తుంది. అందుకే ప్రాథమిక రచయితలందరూ కథానికా రచనకు పూనుకుంటున్నారు. కథ వ్రాయడం సులువే, కాని ఉత్తమ కథ సృష్టించడంమాత్రం చాల కష్టం.

తెనుగుసాహిత్య రంగంలో కథానికల సృష్టికి ఒకవిధంగా బాధ్యత పత్రికలదే. ఉన్నతస్థాయికి చెందిన పత్రికలు కొద్దిగా ఉన్నా; ఆ పత్రికలన్నీ నడవడానికి ముఖ్యంగా కథమీద ఆధారపడుతున్నాయి. ఏ సమస్య ప్రాతిపదికగా, ఏ ఆశయాల ఆధారంగా, ఏ రాజకీయ విధానాలమూలంగా పత్రికలు స్థాపించినా, ఆ పత్రికల విజయానికి కథానికా రచయిత ముందుకు రావలసిందే. రచయితలకు ఆర్థికమైన ప్రోత్సాహం లేకపోవడంచే, ఉత్తమరచనాసృష్టికి ఉత్తమ రచయితలో ఆసక్తితగ్గుతుంది. వ్రాయాలనే కుతూహలం ఉన్న ప్రాథమిక రచయితలే చివరకు పత్రికల పేజీలు నింపడానికి కారకులౌతున్నారు. ఏది ఏమైనా కథలవ్యాప్తికి పత్రికారంగం చాలవరకు బాధ్యతవహిస్తోంది.

తీసుకున్న ఇతివృత్తాన్ని అనుసరించి కథలకు అనేక తరగతులు ఏర్పడ్డాయి. దయ్యాల కథలు, సాంసారికకథలు, పరిశోధక కథలు, సెక్సుకథలు, హాస్యకథలు, — ఈ తరగతులన్నీ వివిధ మనస్తత్వాలు కల్గిన పాఠకులను రంజింపజేస్తున్నాయి. కాని అన్ని రకాల తరగతులకథలూ సాహిత్యంగా పరిగణింపవచ్చునా అన్నది మాత్రం నేడు వివాదాంశం. పురాతన కాలంలో రాకపోకల సౌకర్యాలు లేనిరోజుల్లో యాత్రికుల కథలు, మూఢనమ్మకాలతో, మానసిక పరిభ్రమణంలోవున్న సమాజాలు సృష్టించిన దయ్యాల కథలు, రాచరికమే ప్రధానమైన. రోజుల్లో రాచవీరుల గాథలు, ఏదైనా క్రొత్తఉద్యమం ప్రబలినరోజుల్లో ఆ ఉద్యమ కథలు, నాగరికత పెంపొందిన ఈ రోజుల్లో స్వేచ్ఛా వాతావరణం, సంఘసంస్కరణ, మానసిక నిరంకుశత, ప్రతిబింబించే కథలు, తెలుగు సాహిత్యంనిండా కొల్లలుగా ఉన్నాయి. సాంఘిక వాతావరణాన్ని నాటి సమస్యలను, పరిష్కారమార్గాలను, ప్రజాదృష్టికి తెచ్చి, తెనుగుకథ ప్రతియుగంలో ఒక ప్రధానపాత్ర వహించిందని చెప్పకతప్పదు. ఏకాలంలోనైనా ఒకభావాన్ని సమున్నతమైన ప్రభావంతో ప్రజలలో ప్రవేశపెట్టాలంటే అందుకు సాహిత్యం తోడ్పడుతుంది. ముఖ్యంగా సాహిత్యంలో ఒక ప్రధాన విభాగమైన కథ ప్రాముఖ్యత వహిస్తుంది. నేటివరకు తెలుగు ప్రజల జీవితంలో కథ అటువంటి పాత్రవహించింది.

ఇంత విస్తృతంగా పెరుగుతున్న తెలుగుకథ పూర్తిగా పరిపూర్ణత్వం పొందిందని చెప్పవీలులేదు. కథా సాహిత్యం వెలువడుతున్న ప్రాథమిక సాహిత్యదశలలో దీనివిలువ, ప్రయోజనం పూర్తిగా గుర్తించబడినట్లులేదు. నేటి నాగరిక యుగంలో వచనానికి ప్రాధాన్యం కల్గుతున్న ఆధునిక సాహిత్య యుగంలో, తెలుగుకథా సాహిత్యం పోకడలు విమర్శకులదృష్టి ఆకర్షిస్తున్నది. ఇతివృత్తాలు ఊహాగానాలు పరిధులు వదలి వాస్తవికతకు సన్నిహితంగా మారుతున్నాయి. ఒకవ్యక్తిని ప్రధానకేంద్ర పాత్రగా సృష్టించి, ఆ వ్యక్తి గొప్పదనాన్ని పొగడుతూ అల్లేకథలు కూడా ప్రజాకర్షణ పొందటంలేదు. మానవుని జీవితవ్యవస్థ లోపభూయిష్ఠమైనసంగతి సర్వవిదితం. ఆ లోపాలు లోపాలుగా, మానవుడికి పరిపూర్ణత్వం లేనట్లుగానే చిత్రించిన కథలు సామాన్యమానవుల హృదయాలకు హత్తుకుంటున్నాయి.

లైంగికకథలు, సాంసారికకథలు రెండుదశాబ్దాలక్రితం తెలుగు కథారంగంలో విజృంభించాయి. కథారచనకు పూనుకున్న రచయిత లంతా, కొడవటిగంటి, గోపీచంద్, మొదలగువారు సాంఘిక ప్రవృత్తికి మూలమైన సంసారమే ప్రధానంగా అందులోని మనుష్యుల జీవితాలు చిత్రించారు. పరిధులు పరిమితమైన సాంసారికకథ, నాగరికత విజృంభించి, సమాజం విస్తృతమై, వివిధ రీతులలో జీవనప్రవాహాలు కదులుతున్న ఈ రోజులల్లో మోజు పోగొట్టుకుంది. సంసారంలో ఉన్న సంస్కృతి సమాజంలో నీచంగా చూడబడేవ్యక్తి హృదయంలోకూడా కనిపిస్తుందని చాటే విప్లవకథలు జనాన్ని ఆకర్షించాయి. స్థాయి, స్తోమత, గౌరవం, యివే సంఘంలోని వ్యక్తులకు ప్రాధాన్యం యివ్వవని, హృదయం, నడత, వ్యక్తికి ఔన్నత్యం యిస్తాయని తెలుగు కథలు తమనడకలు మార్చాయి. ఒకదశాబ్దం వెనుకనుంచి. లైంగిక కథలు సాధారణంగా సామాన్య పాఠకుల నాకర్షించడం సహజం. కాని లైంగిక యితివృత్తాలతోనే సమాజంలోని కుళ్లును అద్భుతంగా చిత్రించి, లైంగిక యితివృత్తాల కథలుకూడా సాహిత్యం అని చాటిన ప్రముఖ కథారచయిత చలం. దీని ననుసరించి, యితివృత్తం ఏరకమైనదైనా, రచన, రచనాగమనం ప్రధానమని స్పష్టమౌతుంది. కథాసాహిత్యంలో యితివృత్తాన్నిబట్టి కాక. రచనాప్రతిభ ననుసరించికూడా కథలకు విలువ పేరుగ మొదలు పెట్టింది.

తెలుగుకథలు పరిశీలిస్తే, కథానిక నిర్మాణంలో చాలవరకు అనిశ్చితస్థితి, పరాకాష్ఠలోపమై యున్నట్లు గోచరిస్తాయి. కథకు యితివృత్తం ప్రాధాన్యత, ఎంత అవసరమో, దానిని జనరంజకం చెయ్యడానికి అనిశ్చితస్థితి, పరాకాష్ఠకూడా అంత అవసరం. కథలను, సంఘటనలు సంపుటాలుగా తయారుచేసే అలవాటు తెలుగు రచయితలలో చాలా ఎక్కువైపోయింది. కథను ఏదో విధంగా ఆకర్షణీయంగా ఉత్తమంగా చెయ్యాలనే సంకల్పంతో, వాతావరణ వర్ణనలో కథాగమనం అల్లి, అస్పష్టమైన రూపంతో, అర్థంకాని సందేశంతో అంతం చేస్తున్నారు రచయితలు. కథ ముగింపులో సందేశం ఉండాలా లేదా అనే సమస్య ఒక వాదంగా పరిణమించింది. సందేశానికి, ప్రాధాన్యం యివ్వకుండా, కథాగమనంద్వారానే వివిధ చిత్రణలతో కథయొక్క సాహిత్య ప్రయోజనం సాధించడానికి ఆధునిక కథారచయితలు సృష్టిస్తున్నారు. సందేశం సాధించలేని ఏదో ఆశయస్వరూపమనీ, మానవుని బుద్ధి ఊహాగానంకన్న వాస్తవిక దృక్పథం ఎక్కువ పెంచుకుని జీవిత సమస్యల నిర్ణయం చెయ్యవలసిన అవసరం వుందని నేటి కథానికా రచయితల దృక్పథం. తెలుగు సంస్కృతినే కథలలో ప్రతిబింబించాలనే పూనికతో శ్రీపాద మొదలగువారు మూర్తీభవించిన తెలుగు సాంప్రదాయాల కథలు పూర్వం అల్లారు, నేడు యీ విషయానికి స్వస్తి చెప్పి, సార్వజనీనమైన కథలు తెలుగు వాతావరణంగురించి ఏరుకోవాలని రచయితలు వాదిస్తున్నారు. నూత్నవిజ్ఞానశాస్త్ర పురోగమన రీతులతో ప్రపంచం సన్నిహితమై, మానవుడు మానవుడుగానే పరిగణింపబడుతున్నప్పుడు, మానవతకు, మానవ సమస్యలకు సన్నిహితమైన కథలు ప్రజాభిరుచి పొందుతున్నాయి.

సాహిత్యంలోని వివిధ విభాగాలు పరిశీలిస్తే, ఒక్క విమర్శలో తప్ప, కవిత, నాటకం, నవలలో అంతర్లీనమై ఉంది. ఏ సాహిత్య ప్రక్రియను రచయిత వాడినా పై స్వరూపం లోపల కథ ఉండితీర వలసిందే. హోదాలు, సాంఘిక ప్రతిష్ఠలు, రక్తసంబంధాలు, కులవృత్తులు, ఆధారంగా సృష్టింపబడిన పాత్రల గుణగణాలు వాటికి అనుగుణంగానే సృష్టించి బాహ్యపరిశీలనకే బద్ధమైపోవడం తెలుగు కథా రచనలో ఎక్కువ కనిపిస్తోంది. పాత్రల గుణ పరిశీలనలో అంతర్గత పరిశీలన అవసరం పురాతన ప్రబంధయుగ సాహిత్యంలో వదలిపెట్టి ఇంద్రుడు చంద్రుడు అని పొగడబడే ఉత్తమ సాంఘిక స్థితి కలిగిన రాజువంటి పాత్రలోకూడా గాఢమైన నీచగుణం, నిర్మొహమాటంగా చిత్రించాలి. కులవృత్తుల ఆధారంగా నీచస్థితిలో ఉంటుందనే దాసిపాత్రలో ఉన్న హృదయ గాంభీర్యం నిష్కపటంగా చిత్రించాలి. పాత్ర విలువలు హృదయాంతర్భూతమైన భావాలమీద ఆధారపడి ఉండాలిగాని, పైకి చూపే నడతమీద ఆధారపడకూడదు.

కథా సాహిత్యం తెలుగులో కొత్త పోకడలు పోతోంది. కథారచనయొక్క పద్ధతులు మారుతున్నాయి. కథానికా ప్రవృత్తి ఆధారంగా, వివిధరకమైన పలవలు తెలుగు సాహిత్యంలో అడుగిడుతున్నాయి. గల్పికలు, పొట్టికథలు, కార్డుకథలు. మాటకథలు, చిత్రణకథలు, స్వగతంకథలు, స్వరూపాలబట్టి పేర్లతో వెలువడుతున్నాయి. పురాతనకాలంలో యితివృత్తం ప్రాధాన్యంగా కథల తరగతులు విభజింపబడితే, యిప్పుడు కథారచన రీతులు మారి, వాటి తరగతులు నిర్ణయింపబడుతున్నాయి.

నేటి నాగరిక సమాజం అనేక వ్యాపృత్తులతో తీరికలేక జీవితం గడుపుతోంది. అటువంటి సమాజంలోని వ్యక్తులకు ఆనందం కలిగించేది, క్షణికకాలం హాయిగా గడిపే శక్తి యిచ్చేది, కథ ఒక్కటే. కథల నామకరణం చాల ముఖ్యం. కథలోని ప్రతి అంశం ప్రతిబింబించేలా నామకరణం చెయ్యగల్గి నప్పుడే సమాజంలో తీరికలేక పేజీలు త్రిప్పే పాఠకులనుసైతం కథ ఆకర్షించగలదు.

తెలుగుకథ నాగరికత నాజూకులతో కొత్తచీరలు తొడిగి, వన్నెలు చిన్నెలుతో కనిపిస్తోంది. కాని అంగసౌష్ఠవం, అంతర్గత విలువ పెంచుకున్నప్పుడు తెలుగు కథ యింకా బాగా ప్రపంచ సాహిత్యంలో రాణిస్తుంది.






(మార్చి నెల)

దక్షిణాదిన నెలకొల్పాలనుకుంటున్న ద్వితీయ భారీ విద్యుత్పరికరాల కర్మాగారం స్థలం నిర్ణయం పరిస్థితిలో మార్పులేమీ లేవు. ఆంధ్రప్రదేశ్‌కే దక్కుతుందని ఆశించబడుతోంది. ప్రాజెక్టును రెండుభాగాలుగా విభజించి, ఒకభాగంమాత్రం ఆంధ్రప్రదేశ్‌కు ఇవ్వబడుతుందని పత్రికల్లో వచ్చిన వార్తలను అధికారులు ధృవపరచలేదు. రాష్ట్రంలో స్థాపించదలచిన ఇనుప, ఉక్కు కర్మాగారంకు ఉపయోగించే ముడిపదార్థాల మాదిరీలు విపులీకరణ నిమిత్తం జంషెడ్పూరు ప్రయోగశాలకు పంపబడుతున్నవి. హైదరాబాదులో నెలకొల్పే మందులఫ్యాక్టరీ విషయంలో మరికొంత ప్రాథమిక కార్యం యీ నెలలో అందుకై నియమింపబడిన ప్రత్యేకాధికారి, శ్రీ నకుల్‌సేన్, హైదరాబాదువచ్చి, పరిశ్రమల శాఖాధిపతులతో చర్చలు జరపటంతో, ముందుకు సాగింది. ప్రాజెక్టుకు సంబంధించిన కొన్ని అంశాలను గురించి కేంద్రపరిశ్రమల మంత్రి, శ్రీ మనూభాయిషా రాష్ట్ర ముఖ్యమంత్రితో సంప్రదించారు.

ఆంధ్రప్రదేశ్ చేతిపనుల అభివృద్ధి కార్పొరేషనును యేర్పాటు చేయాలని ప్రభుత్వం సంకల్పించింది. రాష్ట్రంలో తోళ్ళ పరిశ్రమాభివృద్ధికికూడా ఒకబోర్డును స్థాపించాలనే విషయం పరిశీలనలో వున్నది.

రేయాన్‌గ్రేడు గుజ్జు కర్మాగారాన్ని, కాగితపు గుజ్జు కర్మాగారాన్ని నెలకొల్పేవిషయంపై పారిశ్రామిక వేత్తలతో పరిశ్రమల శాఖ విపులంగా చర్చలను జరిపింది. సెల్యులూజ్ ఎసిటైట్ ఫ్లేక్ ప్రాజెక్టు స్థాపనగురించి కూడ అలాంటిచర్చలే జరిగాయి. బహుశా ఇది విశాఖపట్నంలో స్థాపించబడవచ్చు.

రసాయనిక పరిశ్రమలకు అవసరమయ్యే యంత్రాలను తయారుచేయడానికి ఒక కర్మాగారాన్ని నెలకొల్పే విషయంగురించి విదేశ పెట్టుబడిదార్లతో చర్చలు సాగుతున్నాయి. పండ్లు, కూరగాయలు నిలువచేసే పరిశ్రమను నెలకొల్పే ప్రతిపాదన గురించి ఒక విదేశీ కంపెనీతో సంప్రదించడమయింది. బాల్‌బేరింగుల కర్మాగారం స్థాపించే సమస్యపై ఒక జపానుసంస్థతో ప్రాథమిక సంప్రదింపులు కొనసాగుతున్నాయి.

కుట్టుమిషన్ల ప్రాజెక్టుకు సంబంధించిన ప్రాథమిక పని చేపట్టబడింది. పోలిస్టిరీన్ తయారుచేసే ప్రాజెక్టును నెలకొల్పే సంస్థ కూడ పని ప్రారంభించింది.

క్లోరోసిటిక్ ఆమ్లము తయారుచేసే ఫ్యాక్టరీని స్థాపించడానికి రాష్ట్రంలోని ఒకసంస్థకు లైసెన్సు ఇచ్చారు.

ప్రత్తినూలు ఉత్పత్తికి పెట్టుకున్న దరఖాస్తులు కేంద్రప్రభుత్వానికి సిఫార్సుచేసి పంపబడ్డాయి. ఐసో-నైకోటినిక్ ఆమ్లం, హైడ్రోజైడ్, టోల్బుటమైడ్‌ల తయారీకికూడ లైసెన్సు లివ్వవలసిందిగా సిఫార్సుచేయడం జరిగింగి.

*సింగరేణి గనులకంపెనీ లిమిటెడ్ :*

సింగరేణి గనులలో బొగ్గు ఉత్పత్తి పెరుగుతూవుంది. 1961 ఫిబ్రవరిలో ఉత్పత్తి 2.157 లక్షల టన్నులు. గత సంవత్సరం

ఆదేనెలలో ఉత్పత్తి 1.938 లక్షల టన్నులు.

*ప్రాగాటూల్స్ కార్పొరేషన్ :*

పోత యంత్రాల యూనిట్ కొత్తది ఒకటి ఫ్యాక్టరీలో తెరువబడింది. దీనితో ఇక నెలకు 1000 యంత్రాలు ఉత్పత్తి కాగలవు.

యంత్ర పరికరాల ఉత్పత్తినికూడ ప్రస్తుతం వున్న రు. 12 లక్షల స్థాయి నుంచి సంవత్సరానికి రు. 120 లక్షల స్థాయికి పెంచడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

సనత్‌నగర్ పారిశ్రామికవాడలో ప్రారంభంలో 40 మందికి అన్నిరకాల వృత్తులలో శిక్షణ నివ్వటానికి వీలుగా ఒక శిక్షణ కేంద్రాన్ని యీ కంపెనీ ఆరంభిస్తోంది.

*హైదరాబాదు ఆల్విన్ మెటల్ వర్క్స్ :*

ఈ ఫ్యాక్టరీలో స్టీల్-వైర్ త్రాళ్ళు తయారుచేయడానికై తగిన యంత్రాలను, సాంకేతిక విజ్ఞానాన్ని ఇతర దేశాలనుండి పొందడానికి కంపెనీ అవకాశాలను వెదుకుతున్నది.

*హైదరాబాదు ఆస్బెస్టస్ సిమెంట్ ప్రోడక్ట్స్ లిమిటెడ్ :*

ఈ కంపెనీకి జెందిన రెండవ కర్మాగారంకూడ పోయిన ఫిబ్రవరిలో పనిచేయ నారంభించింది. ఫలితంగా ఉత్పత్తి 2714 టన్నులకు పెరిగి ఒక ప్రమాణాన్ని నెలకొల్పింది.

బొగ్గు సరఫరాకు సంబంధించిన ఇబ్బందులు కొంతవరకు తొలగిపోయాయి. సింగరేణి గనుల కంపెనీ వద్ద పేరుకున్న నిల్వలు పంపిణీ అయ్యాయి. 

మహానాయకుడు మోతీలాల్ నెహ్రూ (47 వ పేజీ తరువాయి)

నప్పటికీ, మతాభిమానం ఆయనకంతగా వంటపట్టలేదు. కాని జీవితం చివరి క్షణాలలో పవిత్రమయిన గాయత్రీ జపం ఆచరించినట్లు చెప్పబడుతోంది. ప్రియతమ మాతృభూమికి స్వాతంత్ర్యం సమకూరాలన్న లక్ష్యం నెరవేరలేదే నన్న బెంగకు బహుశా గాయత్రీ జపం ఆయనకు ఉపశమనంగా పనిచేసివుండి వుంటుంది.

పండిత మోతీలాల్ నెహ్రూ శత జయంత్యుత్సవ సందర్భాన ప్రఖ్యాత దేశాభిమాని, సమర్థుడైన నిర్వాహకుడూ, ధైర్యశాలి, సంస్కర్త, అద్భుతమైన వ్యక్తి, ధనికుడైనప్పటికీ ప్రజాస్వామ్యవాదియైన యీ మహానాయకునికి జోహారు లర్పిస్తున్నాము.

మోతీలాల్ నెహ్రూ కూడా గురుదేవుడు రవీంద్రనాథ ఠాగూరు జన్మించిన తేదీనే మే 6 న పుట్టడం ఎంతో హర్షదాయకం. ఒకరు రసవిహీనమయిన ప్రపంచానికి "గీతాంజలి"ని సమర్పించి దాని పరిమళంతో మధువును వెదజల్లితే, మరొకరు గాఢాంధకారం అలుముకున్న ప్రపంచానికి జ్యోతిని వెలిగించడానికై జవాహర్‌ను అర్పించారు

(ఆంగ్లవ్యాసం నుండి అనువాదం.)



# ? ? ?
# ప్రశ్నోత్తరావళి

ప్రశ్న : 152 శ్రీ యస్. వి. నరసింహారావు, గూడూరు.

ఆంధ్రప్రదేశ్‌లో నేత్రదానానికి నిధిని ఎప్పుడు ఏర్పాటు జేస్తారో తెలియజేస్తారా ? జీవించివుండగానే నా కంటిని ఒక దాన్ని దానం చేయవచ్చా ? నా వయస్సు 55 సంవత్సరాలు. అవసరమున్న సోదరికి లేక సోదరునికి ఎవరికైనా నా కండ్లు ఉపయోగిస్తాయా ?

సమా : జీవించివుండగానే నేత్ర దానం చేయరాదు. అయితే. చనిపోయాక తీసుకోడానికి, బ్రతికి వుండగానే లిఖితపూర్వక మయిన వీలునామా ద్వారా దానం చేయవచ్చు. మరణించిన తరువాత కనుగ్రుడ్లు తీసివేయటాన్ని "1960 ఆంధ్రప్రదేశ్ కార్నిల్ గ్రాఫ్టింగ్ చట్టం" ఆమోదించి, అమలులోకి తేవడంతో శాసనబద్ధం చేయబడుతుంది. ఈ చట్టం శాసన రూపం ధరించే స్థితిలో వున్నది.

ఆంధ్రప్రదేశ్ గజెటులో ప్రకటించడం ద్వారా ఈ చట్టం అమలుకు వచ్చిన తర్వాతనే నేత్ర నిధులను యేర్పాటుచేసే ప్రసక్తి వస్తుంది.

ప్రశ్న : 153 శ్రీ బి. మల్లయ్య, అడ్లూరు, యెల్లారెడ్డి, కామారెడ్డి తాలూకా, నిజామాబాదు జిల్లా.

మా పెరటిలో వున్న యాలకిచెట్టు ప్రతిసంవత్సరం కాయలు కాస్తూనేవుంది, కాని వాటిలో విత్తులు వుండటం లేదు. సాధ్యమయిన చర్యలన్నీ తీసుకున్నాం గాని ఫలితం లేదు. కారణం ఏమిటి ? దాన్ని పెంచే సక్రమపద్ధతి ఏమిటో వివరించండి.

సమా : ఎక్కువ తేమగావుండి, ఎండా నీడలు సమంగా పడుతుంటే యాలకి చెట్టు బాగాకాస్తుంది. అలా లేనిచోట్ల సంతృప్తి కరంగా పండదు. మీరు పేర్కొన్న ప్రాంతంలో ఎటువంటి వాతావరణంలో పండుతుందో చెప్పటం కష్టం. సామాన్యంగా దక్షిణ భారతదేశంలో యాలకులు తగినంత తేమగావున్న 1500 మొదలు 3000 అడుగుల ఎత్తు ప్రదేశాలలో పండిస్తారు. ఇతరచోట్ల అంతబాగా పండకపోవచ్చు. చెట్టు బాగా ఎదిగి, పూత వేసినప్పటికి విత్తులు లేకపోవటానికి కారణం అనుకూల వాతావరణం కొరవడటమే అయివుంటుంది.

ప్రశ్న : 154 స్వర్ణ నాయుడమ్మ, కొండపాతూరు, గుంటూరుజిల్లా.

ప్రభుత్వం దగ్గుపాడు తూము నిర్మాణం ఆమోదించిందని పత్రికలలో చదివి సంతోషించాం. ఈ పథకానికి ఎంత కేటాయించారు ? అందులో రైతులు భరించవలసింది ఎంత ? నిర్మాణం ఎప్పుడు ప్రారంభమవుతుంది ? దీనిక్రింద ఎంత వరకు భూమి సాగుకు వస్తుంది ?

సమా : పథకం మొత్తం అంచనా షుమారుగా రు. 4 కోట్లు. ఈ పథకం క్రింద సాగయ్యే ఆయకట్టు దాదాపు 1,24,600 ఎకరాలు. పథకం పరిశీలనలో వుంది. దీనికి తృతీయ ప్రణాళికలో రు. 20 లక్షలు కేటాయించారు.

---

అందర్నిగురించి పొగిడి చెప్పేవాణ్ణి కొద్దిగా నమ్ము, అందర్ని గురించి దుర్భాష లాడేవాణ్ణి తక్కువగా నమ్ము, ఎవర్నిగురించి ఏమీ అననివాణ్ణి అసలే నమ్మకు.

—లావటెర్

# జఫర్ గఢ ఖిల్లా

టి. రాజేశ్వరరావు

తెలంగాణ ప్రాంతంలో చరిత్రాత్మకమైన ఖిల్లా లెన్నో కలవు. కొన్ని కాకతీయ ప్రభువులు నిర్మించినవి. మరికొన్ని యాదవ రాజులు నిర్మించినవి. ఇంకా కొన్ని తురక పాదుషాలు నిర్మించినవి నేటికిని కానవచ్చు చున్నవి. ముఖ్యంగా వరంగల్లు జిల్లాలో వరంగల్లు (కోట) ఖిల్లా తర్వాత పేర్కొనదగినది జఫర్‌గఢ ఖిల్లా యనుటలో సందేహ మేమాత్రం లేదు.

జఫర్‌గఢజిల్లా వరంగల్లు - ఖమ్మం రహదారిపై నున్న వర్దన్న పేట గ్రామానికి ఐదు మైళ్ల దూరంలో యున్నది. ఒకప్పుడు ఇది అరణ్యప్రాంతమై యుండవచ్చునేమో కాని ఇప్పుడు మాత్రం ఏమీ చెట్లు, చేమలు కానరావు. ఈ కోట ముక్కోణాకారంగా రెండు పెద్దపెద్ద కొండలను కలుపుకొని నిర్మించబడింది. దీనికి రెండు, మూడు ద్వారాలు కలవు. అవి ఒకటి పట్నంద్వారమని రెండవది వరంగల్లు ద్వారమని, మూడవది ఖమ్మం ద్వారమని ఇప్పటికీ పిలువబడుతున్నవి. కోట ఆవరణ మొత్తం దరిదాపు నాలుగు మైళ్లు యుండవచ్చును. ఈ మూడు ద్వారాలు చాలా వెడల్పు గలిగి విశాలంగా యుండటమేకాక ఖిల్లాలోకి శత్రువులు ప్రవేశించకుండా చాలా కట్టుదిట్టములతో నిర్మించబడినవి.

ఈ ఖిల్లాను జాఫరోద్దౌలా ఉరఫ్ ధ్వంసా అనే స్వతంత్ర ముసల్మాను సర్దారు నిర్మించినట్లు కొన్ని చారిత్రిక ఆధారములు కలవు. పురాతన కాంస్యతోపులపైన ఉన్న అరబ్బీ అక్షరాల ప్రకారం ఈ ఖిల్లా 1162 ఫసలీ అనగా 17వ శతాబ్దం కంటే పూర్వం నిర్మించినట్లు కానవచ్చు చున్నది. ఈ కోటలో రాజ మహిళల అంతఃపురము, బోగందాని గది (రాజ నర్తకి మందిరం) అన్నియు గలవు తానీషా రాజ్యపరిపాలనా కాలంలో ధ్వంసా అనే దూదేకుల పళువులకాపరి సైన్యంలోచేరి క్రమంగా సైనికాధికారియై యీ ప్రాంతానికి పాలకుడుగా నియమించబడినాడట. తదారభ్యత ధ్వంసా జాఫరోద్దౌలా అనే బిరుదుతో యీ ప్రాంతాలను పరిపాలించుతూ నిజాం రాజులను వ్యతిరేకించి స్వతంత్రం ప్రకటించెను. అదే సమయంలో కల్లూరు ప్రాంతాల్ని (ఇప్పుడు ఖమ్మం జిల్లాలోని కల్లూరు) పాలించుచున్న హిందూ రాజులు ధ్వంసాను వ్యతిరేకించి స్వతంత్రం ప్రకటించుకొనిరి. వారిని అణచుటకు జాఫరోద్దౌలా ఖమ్మం ఖిల్లా నిర్మించి అచ్చట కొంతకాల ముండవలసి వచ్చెను. జాఫరోద్దౌలా ఖమ్మంమెట్టులో ఉండగా జఫర్‌గడ్‌లోని హిందూ (సామంతులు) మంత్రులు తురక రాజ్యమును తుదముట్టించుటకు పాటుపడిరి. కాని అది పూర్తికాక ముందే వారందరూ బంధించబడిరి. కొంతమంది చంపివేయబడిరి.

జాఫరోద్దౌలా వరంగల్లు, ఖమ్మం జిల్లాలు మరియు కరీంనగర్ జిల్లాలు సుమారు 30 సంవత్సరాలు పాలించినట్లు తెలుస్తున్నది.

రెండు కొండలను గోడలుగా చేసి నిర్మించిన ఈ ఖిల్లా పశ్చిమ కొండపై దివ్యమైన మహాక్షేత్ర మొకటి కలదు. దీనిని లక్ష్మీ నృసింహ క్షేత్రమని, పంచనారసింహ క్షేత్రమని వాడుకుంటున్నారు.

ఈ క్షేత్రమును గురించి ఈ విధముగా తెల్పబడుతూంది. ఇది భరద్వాజ ఋషుల ఆశ్రమమని భరద్వాజులు ఇచ్చట తపస్సు చేసారనీ కొన్ని కావ్యాలలో వ్రాయబడి యున్నది. కొండపైనున్న లక్ష్మీనృసింహ స్వామివారి విగ్రహం దరిదాపు నిలువెత్తు ఉన్నది. వారికి ఎదురుగా ఓ పెద్ద కోనేరు యున్నది. ప్రతి నిత్యం స్వామి ఈ కోనేరులో స్నానం చేయటం కలదట. ఇంతకు పూర్వం స్వామి స్నానం చేసిపోయినట్లు అడుగుల గుర్తులు ప్రజలకు కానవచ్చేదట కాని ఇప్పుడు మాత్రం కానవచ్చుటలేదు. ప్రతి సంవత్సరం నృసింహ జయంతికి ఉత్సవములు బహుళంగా జరుపబడును.

జాఫరోద్దౌలా పేరుతో నిర్మించిన ఈ ఖిల్లాలో పెద్ద గ్రామం యున్నది. దీనిలో దరిదాపు పదివేల మంది ప్రజలు నివసించుచున్నారు.

అటు చరిత్రాత్మకమైనదీ ఇటు పుణ్యక్షేత్రమైనదీ ఈ ఖిల్లా. తెలంగాణ ప్రాంతంలో అటువంటి ఖిల్లా ఇదొక్కటే. ఈ చరిత్రాత్మకమైన స్థలమును దర్శించుటకు రహదారి సౌకర్యం కొరతగా యున్నది. ఈ మధ్యనే వరంగల్లు జిల్లా పరిషత్తువారు రహదారి నిర్మాణమునకు పూనుకొన్నారు. రహదారి సౌకర్యము సమకూరినచో ఇదికూడా ఒక పెద్ద యాత్రాస్థలముగా పేరు పొందగలదు. ★

# విశ్వకవి

అన్నాప్రగడ శ్రీరామమూర్తి

ఓఋషివర్య! నీసుకవితోత్తమవాఙ్మయపుణ్యతీర్థ సే
వారభసాంకమే శతజయంతి మహోత్సవమయ్యె నీ మహా
భారతమందు తైర్థికులు పౌరులు నీస్మరణంబు నీ ప్రశం
సారుతి మా మనస్సరసిజమ్ముల మా రసనాల కార్యముల్.

భారతవేదసంస్కృతియు పశ్చిమదేశపు టాంగ్లసంస్కృతుల్
వారిధులైన వానికొక వారధివై మహనీయ సాహితీ
పారము ముట్టినావు, నిను బట్టిగదా రసచర్వణమ్ముతో
తీరము చేరుకొందురు స్వదేశ విదేశ సమస్తదేశికుల్.

శాంతినికేతనంబు రణశంక కలంచిన యీజగత్తులో
శాంతికికేతనంబు నవసంస్కృతి సంస్కృత బుద్ధిమంతులా
శాంతములందు వెల్వడగ స్థాపితమైన కళానికేతనం
బెంతయు నీదు కీర్తిరమకే నిలయంబగు నీరజం బహో!

శ్రీవాణీద్వయ సంతత సేవా విభవమ్ములందు జెల్లెను నీకుఁ,
జీవితయాత్రాకాలము, భావము త్యాగాది ధర్మ పరిసంగతమై.

ప్రకృతియె గురువై నైసర్గికవిధముల చికిలిచేయు కేవలబుద్ధి,
ప్రకృతిని నీకును నీ శిష్యకోటికిది సంప్రదాయమభ్యుదయంబున్.

పద్యము సంగ్రహకళగా, గద్యము విస్తారకళయుగా భావములో నాన్.
వేద్యము పరస్పర విరుద్ధోద్యమముల రెంట సిద్ధులుండరు నీవే.

జోహారునీకు కవనపు బేహారమునందు నీది పృథు విపణియ నా
యీహారతిగైకొనుమా ఓహరిచందనము సుకవియూధాటవిలో!



# దేశంతోపాటు మీరుకూడా అభ్యుదయం పొందండి!

మీరు మిగుల్చుకున్న డబ్బును

భారత ప్రభుత్వ చిన్న మొత్తాల పొదుపు పథకమునకు పెట్టుబడి పెట్టండి!

**భారత దేశం యొక్క**

సమాజాభివృద్ధి కార్యక్రమమునకు, గొప్ప నదీలోయ ప్రాజెక్టులకు,

రైలుమార్గములు, రోడ్ల అభివృద్ధికి తోడ్పడండి!

**మీ డబ్బును ఈ క్రింది ఆకర్షణీయమైన గ్యారంటీడ్ సెక్యూరిటీలలో దేనిలోనైనా పెట్టుబడి పెట్టండి!**

***12 సంవత్సరముల జాతీయ ప్రణాళికా పొదుపు పత్రాలు***

పరిణతి పొందిన పిమ్మట నూటికి సంవత్సరానికి 5.41 వంతుల చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది. ఇవి రూ. 5 లవి మొదలు రూ. 25,000 లవి వరకూ లభిస్తాయి. వ్యక్తిగతంగా ఒక్కొక్కరు రూ 25,000 ల వరకూ కొనవచ్చు. రు. 25,000 ల విలువ పత్రాలు ప్రావిడెంటు ఫండ్ పెట్టుబడులకు మాత్రమే.

***10 సంవత్సరముల ట్రెజరీ సేవింగ్సు డిపాజిట్ సర్టిఫికెట్లు***

ఏటా నూటికి 4 వంతులు వడ్డీ చెల్లించబడుతుంది. ఒక్కొక్కరు రూ. 50 లవి మొదలు రూ. 25,000 ల వరకూ కొనవచ్చు.

***15 సంవత్సరాల యాన్యుయిటీ సర్టిఫికెట్లు***

జారీ చేయబడు ధరలు: రు. 1,330, రు. 3,325, రు. 6,650, రు. 13,300, రు. 26,600. ఈ సొమ్ము నూటికి యేడాదికి 4.25 వంతున కొంచె మెక్కువగా యిచ్చే చక్రవడ్డీతోసహా నెలసరి వాయిదాలలో 15 సంవత్సరాలలో తిరిగి చెల్లించబడుతుంది. ఒక్కొక్కరు రు. 26,600 ల వరకూ కొనవచ్చు.

***పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకు అక్కౌంట్లు***

25 నుంచి 10,000 ల వరకు గల నిల్వలపై నూటికి $2\frac{1}{2}$ చొప్పున, రు. 10,000 లకు మించిన నిల్వలపై నూటికి 2 చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది.

***క్యుములేటివ్ టైమ్ డిపాజిట్ పథకం***

నెలనెలా రు. 5, 10, 20, 50, 100 లేక 200 వంతున 5 లేక 10 సంవత్సరాలపాటు డిపాజిటు చేస్తే, వడ్డీతోసహా మొత్తం అంతా ఒక్కసారే చేతికి వస్తుంది.

***ఐదేండ్ల వడ్డీలేని బహుమతి బాండ్లు***

1965 ఏప్రిల్ 1 న ఎంత విలువ బాండ్లు కొన్నారో అంతమాత్రమే తిరిగి ఇవ్వబడుతుంది.

బాండ్లు రు. 100, రు. 5 ల విలువగలవి వరుసగా జారీచేయబడుతాయి. లాట్లు మూడు నెలల కొక సారి అంటే ప్రతి సంవత్సరం జూన్ 1 న, సెప్టెంబరు 1 న, డిసెంబరు 1 న, మార్చి 1 న డ్రావేయబడుతాయి డ్రానిబట్టి ప్రతిసారి రు. 100 లు విలువజేసే 1 లక్ష బాండ్లకు 40 బహుమతులు. రు 5 లు విలువజేసే 10 లక్షల బాండ్లకు 278 బహుమతులు ఇవ్వబడుతాయి.

ఆదాయంపన్ను లేకుండా మీకు మంచి ఆదాయం లభిస్తుంది!

భావిభారతసౌభాగ్యానికై పెట్టుబడి పెట్టండి!

**ఇతర వివరములకు ఈ పెట్టుబడులకు సంబంధించిన నిబంధనావళి కొరకు —**

| నేషనల్ సేవింగ్సు కమీషనర్, | | రీజనల్ నేషనల్ సేవింగ్సు ఆఫీసర్, |
|---|---|---|
| పోస్టుబాక్సు నెం. 96 | లేదా | 10-2-2, ఎ. సి. గార్డ్సు రోడ్డు, |
| నాగపూర్ | | హైద్రాబాద్-4 |
| చిరునామాకు | | చిరునామాకు వ్రాయండి. |

# శ్రీమద్రామాయణము - ఉత్తరకాండము

ఆత్మకూరి గోవిందాచార్యులు

( గత సంచిక తరువాయి )

*విషాదాంతమా ? పరమార్థమేమి ?*

సీతామహాలక్ష్మి భూగర్భమున జొచ్చి. పరమపదమున కింతకు ముందే చేరినది. తదుపరి లక్ష్మణుడు రాముని శిక్ష రూపమున, సరయూనదిని జేరి, దివంగతుడైనాడు. మిగిలిన దాశరథు లొకరి వెంటనొకరు సరయూనదీజలంబుల మునిగి పరలోకవాసులైరి. ఉత్తరరామ చరితము, కాదు రామాయణ కావ్యమిట్లు విషాదాంతమైనది. రామాయణ మాదినుండి అంత్యము వఱకు విషాదమే.

క్రౌంచమిథున సంయోగవియోగ కారణముగ నుత్పన్నమైన రామాయణము, సీతారామ సంయోగవియోగమునం దంతరించినది. రామాయణ కావ్యాదిని ఆడజీవి మగజీవికై విలపించినది. అంత్యమున మగజీవి ఆడజీవికై విలపించినది. ఈ సుఖ, విషాదాంతములే, వేదాంతుల కాధారము. వేదాంతార్థమునకు మూలము. దీనిని వేదాంతులు జీవాత్మ పరమాత్మల సంయోగ వియోగముగ నిరూపించుచున్నారు. పక్షి మొదలు - మానవోత్తమునివఱకు ప్రకృతిని సంయోగ వియోగములు నిసర్గములే యని దోచుచున్నను, సేవయగు జీవాత్మ దుఃఖభాజనముకాగా, పరమాత్మయగు రాముడా జీవాత్మ నవ్యాజప్రేమతో సముద్ధరించుటయే, రామాయణ వేదాంతార్థమని వేదాంతుల నిరూపణము. అది యెట్లున్నను, కావ్యస్వరూపమున, రామాయణము, విషాదాంతముగ గ్రహింపబడుచున్నది. ఇట్లు గ్రహించుటయే సమంజసమా ?

సీతారాముల కలయిక యే కావ్యమున కాదికాదు ? అందువలన సీతారాములు విడివడుట, అంత్యముగా పరిగ్రహించుట యేల ? విషాదాంత మననేల ? శ్రీ లక్ష్మీనారాయణులు, లోకకళ్యాణార్థమై భూలోకమునకు బయలువెడలుట యీ కావ్యమున కాది. మరల సీతారాములు, ప్రపంచమునువీడి. వైకుంఠధామమున కలియుటయే అంత్యమగును. రామచంద్రుడు వైష్ణవాంశమున ప్రవేశించుటతో రామాయణగాథ ముగిసినది. ఇది శుభాంతము కదా ? ఎన్నడో విడివడిన లక్ష్మీనారాయణ దంపతులు, మరల వైకుంఠ ధామమున కలియుట శుభాంతమే. ఈ విధముగ వాల్మీకి తన కావ్యమును శుభాంతమే జేసినాడన దగునా : ఏక-కలమున-ఏక రసప్రవాహమున, ఏక-గాథ-ఏకసమాధిలో సప్తకాండములు రచియింపబడినవి. సప్తకాండములు, వాల్మీకమే. ఏకోరసః కరుణాఏవ అనునదియే రామాయణ మాదినుండి, అంత్యము వఱకుగల రసము.

*సంస్కృత కవులు*

కాని మన పూర్వ సంస్కృతకవులు, రామాయణ తదనంతరపు ప్రముఖ కవులు-కథావస్తువుగ రామాయణము స్వీకరించిరి. అయినను—ఉత్తర రామచరిత విషాదాంతమని తలచి యేమో చాలమంది ప్రాచీన సంస్కృతకవులు, ఉత్తరరామ చరితను, స్వీకరింపరైరి. పూర్వరామాయణమునే తమతమ ప్రజ్ఞావిశేషముల ననుసరించి వ్రాసిరి. భోజరాజు - శంభుదాసు, జయదేవుడు-మురారిభట్టు పట్టాభిరామకవి — రాజశేఖరుడు — మొదలగువారందరు పూర్వచరితమునే వ్రాసిరి. కాళిదాసు మాత్రము రఘువంశమునం దుత్తరచరిత్ర కూడ చవులూర వ్రాసినాడు. భవభూతియో నాటకరూపమున వ్రాసెను. కాని కథనుమార్చి శుభాంతముగావించెను.

*భవభూతి మాతృక*

ఉత్తర రామచరిత్రవల్లనే భవభూతి సుప్రసిద్ధుడైనాడు. చిరంజీవియైనాడు. భవభూతి వాల్మీకి మాతృకను గొంతవర కనుసరించినాడు.

కథాసరళినే మార్చినాడు. భవభూతి నాటకమునందలి కళ యీ ఉత్తరచరిత్రను వాల్మీకి రామాయణోత్తర కాండమునుంచి గ్రహింపబడినదని స్థూలదృష్టితో చెప్పనగును. వివరములు పరీక్షించుచో, భవభూతి కాళిదాసునకు ఋణపడియున్నాడు. కాళిదాసునకేకాక భాణునకుకూడ ఋణపడినాడు. ప్రథమరంగమునందలి,

అలేఖ్యదర్శనము, కాళిదాసుని భావసందోహదమే.... కాళిదాసుని శకుంతలయు, భవభూతి సీతయుగూడ పతులచే, గర్భవతులుగ విడువబడినవారే. వారి సంతానములన్ననో, తండ్రుల నకస్మాత్తుగ గలిసినవారే. పోలికల ననుసరించియే, హృదయ స్పందనమున, దుష్యంతుడు-రాముడు-నిరువురును, తమ పుత్రులనుగుర్తించినవారు. ఈ కథా భావైక్యతలకు, శాకుంతలము VII అంకమును, ఉత్తర చరితయందలి VI అంకమును, సరిచూచుకొనదగును. ఇట్లే భాసుని స్వప్న వాసవదత్త నాటకమందలి V అంకమును, భవభూతి ఉత్తర రామచరితమందలి III అంకమును, సరి పోల్చదగును. రాజు, అగ్నిహోత్రుని పాల్పడినదని తలంపబడే తన రాణి వాసవదత్తను కలయందు గాంచి మాట్లాడసాగినాడు. ఇంతలో యౌగంధరాయణునకు మాత్రమే సజీవిని యని తెలిసిన వాసవదత్త నిద్రావస్థయందున్న తనభర్త చెంత నిలిచినది. భర్తతో ప్రసంగించినది. భర్తృకరగ్రహణ మొనరించినది. ఈ కరగ్రహణముననే, రాజు నిద్రనుండి మేల్కొనినాడు. వాసవదత్త తత్తరపాటుపడి యదృశ్యయైనది.

ఈ భావబీజమే తన మూడవయంకమున, భవభూతి, మహావృక్షముగ బెంచినాడు. ఉదయనుడు నిద్రావస్థానంతరం విదూషకునితో గావించిన సంభాషణము. భవభూతి రాముడు; వాసంతితో గావించిన ప్రసంగమును జ్ఞప్తికి తేగలదు. (మూడవ అంకము) ఈసాదృశ్యము లెట్లున్నను-సంస్కృత నాటకములలో భవభూతి ఉత్తర రామచరితయే ప్రతిభావంతమైనది. మూలమువలె విషాదాంతము చేయ నొల్లక, శుభాంతముగ మార్చినాడు.

ఈ సంస్కృత కవులందరు, మూలమగు వాల్మీకమునకు-మెరుగులుపెట్టుటకు యత్నించిరా యను అపోహ జనింపకమానదు. ఈ అపోహ కాధారములు స్థిరమేయగుచో, వాల్మీకి తదుపరి రామాయణ కావ్యకవులు, తమ విశేషప్రయత్నమున, వాల్మీకిముందల, కుప్పిగంతులు వేసినారని మాత్రమే యనదగును. వాల్మీకమునకు-వన్నె బెట్టగలవారెవరు ? తపోనిష్ఠాగరిష్ఠాత్ముడు సిద్ధుడై కవియైనవాడు వాల్మీకి. సమాధినియతుడై - భగవత్ప్రేరణమున వ్రాసినవాడు వాల్మీకి. సమకాలికుడై, మాంసపు గండ్లను, సీతారాములసేవించి, స్వానుభవానుభవములతో, సత్యమును వ్రాసినవాడు వాల్మీకి. ఈయన కతీతులెవరు కాగలరు ?

## *II ఉత్తరరామాయణం - ఆంధ్ర ప్రాచీనకవులు*

తిక్కన తొలుదొల్త నిర్వచనోత్తర రామాయణమునువ్రాసెను. కాని పూర్వ రామచరితనే వ్రాసిన సంస్కృతకవుల భయమే మన తిక్కనకుగూడ నావహించినదేమో ! పట్టాభిషేకానంతరము రామరాజు కొలువుదీర్చిన దాది, సీతానిర్గమనానంతరము కుశలవుల దోడ్కొని నిజనగర ప్రవేశమగునంతవరకే తిక్కనవ్రాసెను. మూలమునందుగల రాముని మహాప్రస్థానము విసర్జించి తన కావ్యమును శుభాంతముగ మార్చెను. అంతవరకుగల కథా సంవిధానమున గమనింపదగిన మార్పులులేవు. మూలమునందు గల రావణ జన్మాది కథావృత్తాంత మంతయు క్లుప్తముగ వ్రాయబడినది.

"అమలోదాత్తమనీష నే నుభయకావ్యప్రౌఢి పాటించు శిల్పము నంబారగుడన్ కళావిదుడ।" అను గర్వోక్తితో, తిక్కన, నిర్వచనోత్తరరామాయణము వ్రాసినాడు. మీసముల వడివేయు కాలమున యౌవ్వనోద్రిక్తుడై పల్కిన మాటయిది. "నా నేర్చినభంగి చెప్పి పరసీయుడనయ్యెద భక్తకోటికిన్" అని భారతము వ్రాయగలిగినాడు. నిర్వచనోత్తర రామాయణము తిక్కన వ్రాసెను. భారతమో, తిక్కన సోమయాజి వ్రాసెను. ఈ మానసిక పరివర్తనమే, యుభయకావ్యములలో విస్పష్టముగ ద్యోతకమగుచున్నది. "నా నేర్చిన భంగి"యను విమలత్వమే భారతమం దెల్లెడల గోచరించుచున్నది.

సప్తమాశ్వాసాంతమున రసల్లలితము కావలసినగాథ ప్రారంభమైనది. అష్టమ నవమ దశమాశ్వాసములలో శ్రీరామ వనవిహారము మొదలు, కుశలవ స్వీకరణము వరకు వ్రాయబడినది. ఏలనో, తిక్కన, సీతావియోగ విలాస నిర్గమణ సమయముల యందుగూడ వనవిహారమువలె నంతగా మహోదాత్త కరుణారస తరంగములలో విజృంభించి యుయ్యాలలూగలేదు. మహాభారత కవిత్వమున కీ నిర్వచనోత్తర రామాయణ మక్షరాభ్యాసమేమొ ! అయినను సీతాసందేశమున, తిక్కన విశృంఖలుడైనాడు.

"తన మది నొక్కయుమ్మలిక। దక్షిన మంచిది దాని బాపగా।" నని తలపోసి చేయు పని కక్కట యేనును లోనుగానె? నా। కు నెఱుగజెప్పి పొమ్మనుటకుం దగనే మొగమోటు లేక మ। న్నన యెడనైన రాజుల మనంబులు ద్రిప్పగ। బల్మి గల్గునే.'' అను భావము మూలమునందు లేదు. దెప్పిపొడుపులుగాని, వెనుకమాటలు గాని, పతిభక్తురాలగు వాల్మీకి సీతనోటినుండి వెలువడి యుండ లేదు. ఈ భాగమున, తిక్కన సీత తా రాచహుందా మరువలేదు. పూర్వ రామాయణమునందు ''స్త్రియం పురుష విగ్రహ''మ్మని

రాముని పేర్కొనిన సీతయే, తిక్కన కిటగూడ ప్రత్యక్షమైనది. మూలమున జానకి, తన గర్భమునుగురించి, యపరోక్షముగగూడ, నే విధముగను, లక్ష్మణునకు తెలియజెప్పలేదు. తన మరణము రాజవంశమున కపకీర్తికర మనియే, ఆ పని మానినది. (సర్గ 48 శ్లో 8) "సంపుల్ల యశోభిరామ మగు భూపతి వంశము నిల్చునంతలో," గంగలో పడరాదని, విరమించలేదు. సీతచే చూలు దాల్పును లక్ష్మణునకు చెప్పించినది. కాళిదాస మహాకవి (శ్వశ్రూజనం సర్వమనుక్రమేణ విజ్ఞాపయ ప్రాపిత మత్ప్రణామః॥ ప్రజానిషేకం మయికర్తమానం। సుదూర మద్వాయిత చేతసేతి॥ రఘువంశం. చతుర్థాశ్వాసము. శ్లో. 60) ఈ భావమునే తిక్కన స్వీకరించినాడు. ఇట్లే సీతారాముల విహారమునగూడ మూల వ్యతిరేకములగు వివిధ విహారగతులు వర్ణింపబడినవి. జలక్రీడ గూడ సాగినది..ఏకపత్నీవ్రతుడగు రాముడు ; పరదారాపహరణ నేర మాపాదించి వాలిని వధించిన రాముడు-తన్ను వరించివచ్చిన శూర్పణఖను వికారిగా జేయించిన రాముడు. పరస్త్రీ సంయితుడై-జలక్రీడ లాడినాడు. "క్రీడల యనంతరము....తలిరుగతి కాంతి మేనుల...కొలనువెలి నింతులు నిలిచిరి ; తీర లతలతో దడబడు చున్", ఇక సీతారాములో ; "బహుళకేళిక వృత్తి రమించి రెల్లెడన్...."

"....అంగము లభిరామరేఖ నవకాంతి విలాసముఁ బొంది క్రాలగన్"

"....రతి కోర్కులు కొమ్మలువోవ"

"....ఆనంద మఖండము గావించు రతము గైకొంద్రు తగన్...."

—అష్టమాశ్వాసము

ఆ రామచంద్రుడు ధర్మమూర్తి. పగలు రాజ్యధర్మ నిర్వహణ మొనరించుచు, దినార్ధమగు రాత్రికాలముననే, సీతా సమేతుడగు వాడని వాల్మీకి వచనము-దీనివలన. రాముడు సేవాలోలుడుగూడ కాడనుటయు-ధర్మ తత్పరత్వమున పవలంతయు రాజ్య కార్యధర్మ నిర్వహణాతత్పరుడనియు ద్యోతకము— ("పూర్వాహ్ణే ధర్మ కార్యాణి కృర్వా ధర్మేణ ధర్మవిత్ శేషం దివస భాగార్ధ మంతఃపుర గతోనయత్।" స. 42 శ్లో. 27) జలక్రీడా సమయము పవలు. ఈ వర్ణనవలన, తన కావ్యనాయకు డగు, రామరాజు పాత్రౌచిత్య మునుగూడ, తిక్కన భంగపరచుకొనలేదా ? సత్యవ్రతుడు పరస్త్రీ సంయముడై రాజ్యధర్మ నిర్వహణగూడ పరిత్యజించి—జలక్రీడా లోలుడైనాడు. ఇది తిక్కనగారి రామరాజ్య స్వరూపము।

పాత్ర ఔచిత్యమును మరపొందుచో, నిర్వచనోత్తర రామాయణము, తియ్యని మాటల మూట యనక తప్పదు—

*కంకంటి పాపరాజు*

శ్రీ పాపరాజ విరచిత శ్రీ మదుత్తరరామాయణ మొక మహా ప్రబంధము. 8 ఆశ్వాసముల గ్రంథము. తిక్కన, తన నిర్వచనోత్తరరామాయణమున షష్ఠ్యంతములను వ్రాయలేదు. పాపరాజు షష్ఠ్యంతములను వ్రాసినవాడు. అష్టాదశ వర్ణనములను గూడ విజృంభించి వ్రాసినవాడు. ఆ కాలము శృంగారరససిద్ధియే కావ్యసిద్ధియను కాలమా ? శ్రీ సీతారాముల విహారము తిక్కనయు, పాపరాజునుగూడ సామాన్య రాజదంపతుల విహారమువలెనే వర్ణించిరి. తిక్కన దృక్పథమునందున్న సీతారాములు రాజదంపతులు మాత్రమే.

"ఎత్తటినైనను ధీరోదాత్త నృపోత్తముడు, రామధరణీపతి సద్వృత్తము సంభావ్యమగుట, నుత్తరరామాయణోక్తి యుక్తుడ నైతిన్," అని తిక్కన, తన కథానాయక స్వరూపము నిర్ణయించుకొనియెను. వాల్మీకికి సీతారామదంపతుల విహారము రాజదంపతుల విహారము మాత్రమేకాదు. దైవదంపతుల విహారము.

"ఏవంరామో ముదాయుక్త
స్సీతాంసు రసతోపమామ్
రమయా మాస వైదేహి
మహన్యహని దేవవత్" (ఉ. స. 42 శ్లో 24.)

వాల్మీకి రామరాజునే చిత్రించియుండినను, రామదైవతమును మరచియుండలేదు. రాజ్యపరిపాలనతో ప్రారంభించిన యుత్తర. కాండ (ప్రాప్తరాజ్యస్య రామస్య) శ్రీరామ మహాప్రస్థానముతో ముగింపబడినది. రాజ్యాధికారియై ప్రారంభమున, రామరాజు, కావ్యాంతమున వైకుంఠధాముడై. యయోధ్యయందలి చరాచరము లన్నింటికి మోక్షప్రదాతయై భక్తావనుడయ్యెను.

("తత స్సమాగతాన్ సర్వాన్ స్థాప్యలోక గురుర్దివిహృష్టైః ప్రముదితో దేవైర్జగామ త్రిదివం మహతీ") రాజ్యధర్మ-దైవ ధర్మ, సమన్వయమే, మానవోత్తమ స్వరూపముగ వాల్మీకి చిత్రించియున్నాడు. తిక్కన శ్రీరాముని, రాజుగమాత్రమే పరిగ్రహించుటచే నేమొ, వైకుంఠయాత్ర గాథను వర్జించినాడు. నరాధిపతిగ మాత్రమే, తన కావ్యనాయకుని చిత్రించికొనినపుడు

తిక్కన, సీతారామ విహారమున, ఉద్యానవన విహారము, వినోద విహారము, జలవిహారముల సృష్టించి విజృంభించి వారిని నగ్నులుగ నొనరించి వ్రాయుటలో పాత్రపోషణమున, దోషమంతగ జనింపలేదేమో! (మూలాతీతమైనను). ఆ పాత్ర ఔచిత్యము పాటింపకున్నను మూలమును జవదాటినను అంతగ శృతిమించలేదు. గుప్పిడి విప్పలేదు. "బహుళ కౌతుకవృత్తి రమంచిరెల్లడన్" అను గంభీరమును, సంపూర్ణముగ విసర్జింపలేదు.

"ప్రమదము మూర్తమైనటుల రాగము, రూపు వహించినట్లు వి
భ్రమ మొడమెత్తినట్లు రతిరాజ విహార కుతూహలంబు దే
హము దగ దాల్చినట్లు హృదయంగమమై విలసిల్లు చున్న ఆ
రమణిఁ బ్రమోద రూఢి మదరంజితజేయు విభుండు ధీరుడై"

అని తన శృంగార రస స్వరూపమునకు సర్వాంగముల దీర్చినాడు. అంతటితో తృప్తి పడినాడు. పాపరాజు కరుణరసప్రధానమగు నుత్తరకాండమును, శృంగారరసప్రధాన ప్రబంధముగ మార్చినాడు. గుప్పిడిగూడ విప్పినాడు. కాని, పాపరాజ మంత్రి దృష్టి నధిష్ఠించిన సీతారాముడు, రాజమాత్రుడే కాడు. సాక్షాత్ దైవము.

"మానవ కర్మభూమిపయి మానుష దేహముతో, హితాహిత
జ్ఞాన మెరుంగు బ్రాహ్మణుడు చారుకవిత్వము నేర్చి జానకీ
జానికథల్ రచింపకయ సత్కథలెన్ని రచించె నేనియున్
వాని వివేక మేటికిని, వాని కవిత్వ మహత్వ మేటికిన్."

"శ్రీకర రామమంత్ర జపసిద్ధి ప్రసిద్ధి వహించి వెన్క వా
ల్మీకి రఘుప్రవీరు కథలే, రచియించికదా చెలంగె, ము
ల్లోకములందు నెల్ల మునులుం గొనియాడగ; నట్టి దౌట పు
ణ్యాకరమైన రాముకథ హైన్యము మాన్పదె యెట్టి వారికిన్."

"ఆ వాల్మీకి మనీషివర్య మతిమంథాహార్య సంశోభితం
బై విఖ్యాతిగ కామితార్థ ఫలదంబై శ్రీపదంబై సుశ
బ్దావాసంబయి, మాధురిం దనరు, రామాంచత్కథా క్షీర పా
రావారంబు సమాశ్ర యింతు గవితా ప్రఖ్యాతి కర్హంబుగన్."

ఇట్లు శ్రీరామదైవ పరతంత్రుడగు పాపరాజు, సీతారామ విహార మెల్లెల్లో శృంగార రసమయముగ వివిధ ఘట్టములలో చిత్రించినాడు. సీతాదేవితో నర్మోక్తులు, సీతా కుసుమాపచయము, సీతారాముల జలక్రీడ, వారు మేడపై కొలువుండుట మొదలగు సన్నివేశముల సృష్టించి శృంగార లహరిలో విహరించినాడు. దైవదంపతులను విహరింప జేసినాడు. తన కావ్యనాయకుడు లక్ష్మీనారాయణు డన్నమాట.

రాఘవు డేక పత్నీ వ్రతుడు. తత్కారణమున దిగంత విశ్రాంత శాశ్వత కీర్తిమంతుడైనవాడు. ధీరోదాత్తుడు. అయోధ్యా వాసుల కెల్ల పితృ సమానుడు. కాని, సీతా సమేతుడై రాముడు వన విహారమునకు బోవునపుడు పాపరాజుగారి యయోధ్యా "పుర కాంతామణు లాత్మరూప విభవంబుల్ చూచి కందర్ప గోచరతం దత్తర మంద": సాగిరి.

"కలికి జక్కవలు నీవలి గుబ్బలకు నుబ్బి పఱతెంచె బాఱవ పట్టెనేమొ" అని శ్రీరాముడు జలక్రీడా సమయంబునం దయోనిజ నుపొ్పంగించెను. విగత వస్త్రలైన స్త్రీలతోగూడ కలిసి జానకీ రాములు జలక్రీడ లాడిరి. అంతతో ఆగలేదు.

"*అంగములు కానరా*, కాంచనాంగులీద సారసాకరమెల్ల బంగారమయ్యె." తడిసినఁ జిలుగుతో, దళుకుతళ్కను మేని మించు, లక్కొలనెల్ల ముంచుకొనగ, కౌను గడగడ వడంక, వేకపు పిఱుందుభారమున పెన్దొడలు తొట్రుపడ తటాక మవని కన్యక వెలువడి యధిపుగూడి" నది. తక్కంగల మగువలో;

"చెలువలు ముందుగ వెల్వడి చలువలు చెలువలర గట్టి"రి. ఇట్లు నగ్నలగువారితో రాముడు జలక్రీడలాడెను. ఆకృష్ణభగవానుడు పాపరాజుగారి యాత్మదైవతము. తన శ్రీమదుత్తరరామాయణము మురళీధవున కంకిత మొసంగినాడు. బర్హి పింఛావతంసుని యెడ గల మోహ పారవశ్యముననో, పురుషులనే మోహింపజేయగల, రామచంద్రమూర్తి సుందరతరతనూ విలాస తన్మయత్వముననో, పాపయమంత్రి రఘురామునిగూడ పలువిధ క్రీడా విలాసములలో దలమున్కలుగ ముంచినాడు. పరదైవతముగ దానును, భావించు కొనియు సీతారాములను, శృంగార రస తరంగములలో నగ్నుల జేసి విలోలుర జేసినాడు. ఈ శృంగారము శృతిమించినది. ఇదియే పాపరాజుగారి ప్రౌఢప్రబంధమందలి ప్రత్యేకత్వము: అనర్గళధార, కథాపరిపూర్ణత, పాండిత్య ప్రతిభ, యీ కావ్య ముఖ్యలక్షణములు. అయినను పాత్ర ఔచిత్య మనే మాటయే పాపరాజుగారు విస్మరించిరి. శృంగార రససిద్ధికే యత్నించిరి. తిక్కన్నను మించవలెననే వీరి సంకల్పమేమో. అయితే మించిరి. సేవాసందేశమున తిక్కనవలెనే

"ఎఱుగని మూఢు లాడుకొను నెగ్గులకుం భయమంది యప్పుడే
కలుషమనంబుతో విభుడు కాననసీమకు బంచెగాక య
త్తెఱి గొకసారి నన్ బిలిచి, తెల్పి, మనోవ్యథ తీర్చి నిన్ను నే
మఱనని పంపదయ్యె నభిమానము గూర్మియు నెందు బోయెనో"

అను దెప్పుడుమాటల సీతచే బలికించినాడు.

"భార్య లెల్లచోట్ల లభింతురు. తమ్ములమున బంధువులును లభ్యమగుదురు. కాని సోదరులట్లు లభించరు"గదా యని వాపోయిన రాముడే (లక్ష్మణ మూర్ఛ సందర్భమున) సీతకు, సందేశ మంపుతరి, తన కష్టైదుట నిల్చియుండెనేమొ. సోదరాభిమానము రామునకు మెండగుటచే సోదరులవలె పౌరుల జూడమని జానకి సందేశ మంపెను. "సోదరుల నెన్నడు నీవు వర్జింపవు. పౌరులను వర్జింపవు. నేనే వర్జింప వీలైనదాన" నని నా నాథుడు తలపోసి యుండెనా?" అను భావము, "సోదరులవలె జూడు" మనుటలో గర్భితమై యున్నదాయని స్ఫురించక మానదు. పాపరాయమంత్రి కట్టి విశేషమేమియు నిందు గోచరింపదు. మూలమునందున్న దానిని కూడ వదలి "భూజనుల బాంధవుల లెస్సబ్రోవుమనుము" అనిమాత్రము సీతచే చెప్పించినాడు. రామాజ్ఞ నెఱింగినపుడును పాపరాజుగారి సేవ, తొల్లింటి శృంగార రసానుభూతినే స్మరించి శోకింపసాగినది.

"వనవిహారమున భూవరుడాడు నర్మముల్
మమతదలంచి కంపము వహించు
జలకేళి దేలుచో, జెలువుండు గావించు
పరిహాసకములెంచు బరితపించు
.... .... .... .... .... .... .... ....
.... .... .... .... .... .... .... ....
ఏకశయ్యా విహారంబు లెంచియెంచి
ప్రణయ కలహాంతముల వగన్ వలికి వలికి,
వలపు ముచ్చట లెదజేర్చి వనరి వనరి
యింతి విలపించె కలకంఠు లెల్లగదియ"

ఇది వాల్మీకి సీతావిలాపముగాదు. పాపరాజు సృష్టించిన ప్రత్యేకవ్యక్తి. దైవదంపతులుగా సంభావించియు, సీతారాములను సామాన్యదంపతులుగా చిత్రించినారు. తిక్కనకంటెను, ఆకాలపు తదితర కవులకంటెను, శృంగార రసోత్పత్తి నధికముగా తలంపే, పాపరాజుగారి నాశ్రయించినదా యను సంశయ మొదవును. సీత సౌశీల్యముకంటెను, ద్రౌపది వాగ్ధోరణి ఈయన కభిమానమేమో! అవమూరునకై విసర్జింపబడిన, జానకినోట, మరలమరల, శృంగార రసానుభూతినే స్మరింపజేయుటయం దౌచితి-సంరక్షింపబడినదా? అడవులలో దిరుగాడు నప్పటి నీపాద సేవ నేడు లభించదేయని వాల్మీకి సీత వాపోయినది. కాళిదాసు మహాకవి, తన కుమారసంభవమున, వివిధ శృంగార గతులలో విహరింపజేసిన, పార్వతీపరమేశ్వరులే, పాపరాజుగారి దృక్పథమున తాండవమాడిరేమో! శృంగారమువంకకుబోక, వనవిహార భాగమునే త్యజించి, అతిపవిత్రముగ, మనోహరముగ, చిత్రింపబడిన కాళిదాసుని రఘువంశపు సీతారామదంపతులు, పాపరాజుగారి స్మృతిపథమునుండి తొలగిరేమో? కథ సాంతముగ వాల్మీకములోని గాథయే. వాల్మీకమువలె శుభాంతమైనది. శుభాంతమొనరించుటలో గల అనుపమాన ప్రతిభ మిరుమిట్లు గొల్పుచున్నది. ఆ సన్నివేశమును శృంగారభాగమే యగుట నేమో! వైకుంఠమున శ్రీదేవి గోవిందులకు, ప్రణయము కల్పించినాడు. ఆనాడు నిర్గమనసమయమున తన సభాంతరమునుండి, తన్నొంటి జేసి మాతృగర్భమున జొచ్చుటయే ప్రణయ కలహకారణము, ఈ కారణ నిరూపణ మత్యంత రమణీయము-అనుపమానము. అతిమనోహరము. ఇది మూలమునకుగూడ కావ్యస్వరూపమున వన్నె బెట్టినదేమో! అనుచితభావములైనను మెఱుగుపెట్టు యత్నమున పాపరాజు మూలమును జవదాటుటకు వెనుకాడలేదు. తిక్కన భావములమగూడ గ్రహించినాడు. కృతకృత్యుడైనాడు. మంగళప్రదముగ తన కావ్యమును ముగించి, ఆంధ్రలోకమున చిరంజీవియైనాడు.



బగ్గీవాడు గుఱ్ఱం కళ్లాలను గట్టిగా పట్టుకొని వెంట నడుస్తూ వాటికి మార్గాయాసం కలుగకుండా చూసుకునేలాగానే రాజకీయ నాయకుడు నిస్సందేహంగా ప్రజాభిప్రాయాన్ని ననుసరించి నడుచుకొని తీరాలన్న సంగతి మనకు తెలిసిందే.

—హేర్స్

# ప్రగతి పథంలో

(జిల్లాలనుంచి అందిన వివిధ అభివృద్ధి కార్యక్రమాలను గూర్చిన సంక్షిప్త వార్తలు)

## ఆదిలాబాదు

### పాఠశాల భవనానికి ప్రజల విరాళం

మాధ్యమిక పాఠశాల భవన నిర్మాణానికై జల్నాడ్ బ్లాకు ప్రజలు రు. 7000/-ల విరాళం ఇచ్చారు. ఈ భవన నిర్మాణ వ్యయం మొత్తం రు. 30,000/-లు కాగా ఇందులో గ్రామ స్థులు తమ వాటాక్రింద రు. 7000/-లు భరించారు.

## అనంతపురం

### మహిళల శిక్షణ శిబిరం

శింగనమల సమితి అధ్యక్షుడు శ్రీ పి. లక్ష్మన్న గతమార్చి 12వ తేదీన మహిళల శిక్షణ శిబిరాన్ని ప్రారంభించారు. మూడు రోజులపాటు ఇది నిర్వహింపబడినది.

## చిత్తూరు

### హరిజన దినోత్సవం

తిమ్మనాయనిపల్లెలో గత మార్చి 30వ తేదీన హరిజన దినోత్సవం జరిగింది. ఈ సందర్భంగా ఇండ్ల పరిశుభ్రత మొద లైన వాటిలో పోటీలూ, పిల్లల ప్రదర్శనం, సాంస్కృతిక కార్యక్రమాలు జరిగినవి. వివిధ పోటీలలో గెలుపొందిన వారికి పంచాయతీ అధ్యక్షుడు శ్రీ బి. రంగరాజు బహుమతులు పంచి పెట్టారు.

## క డ ప

### జిల్లాస్థాయి సమ్మేళనం

ప్రథమ జిల్లాస్థాయి సమ్మేళనం కడపలో గత ఫిబ్రవరిలో జరిగింది.

## తూర్పు గోదావరిజిల్లా

### స్వయం సహాయం

కొంతమంది హరిజనులు కరప రైలు స్టేషను సమీపంలో వున్న నాలుగు ఎకరాల భూమిలో చిన్న కాలనీని నిర్మించు కొనడం ద్వారా స్వయంకృషిలో ఇతరులకు ఆదర్శప్రాయు లైనారు. వారు తమ కాలనీకి సంజీవయ్య నగర్ అని నామ కరణం చేశారు.

### బహుమతి బాండ్లు అమ్మకం

కాకినాడలో స్త్రీల క్లబ్బుకు చెందిన సభ్యురాండ్రు గత మార్చి నెల ఆఖరు మూడురోజులలో ఇంటింటికీ వెళ్లి సుమారు రు. 23,000 ల మేరకు బహుమతి పత్రాలు విక్రయించారు.

### వైద్య కళాశాల విద్యార్థి వసతిగృహం

ఎస్. ఆర్. ఎం వైద్యకళాశాల విద్యార్థి వసతిగృహానికి గత ఏప్రిల్ 1వ తేదీన శంకుస్థాపన జరిగింది. దీనికి శ్రీ కె. వెంకన్న స్థలం బహూకరించారు.

## గుంటూరు

### సమితి మేలా

సంతమాగులూరు సమితిమేలా గత మార్చి 29 నుండి 31 వరకు జరిగింది. ఈ సందర్భంగా పశు ప్రదర్శనలు, సాంస్కృతిక కార్యక్రమాలు జరిగినవి.

### హరిజన కాలనీ

సినీనటుడు శ్రీ కె. జగ్గయ్య గత ఏప్రిల్ 5వ తేదీన దోనే పూడిలో ఆలపాటినగర్ హరిజన కాలనీకి ప్రారంభోత్సవం చేశారు.

### పంచాయతీ కార్యాలయ భవనం

చుండూరు పంచాయతీ కార్యాలయ భవనాన్ని, ఆర్థిక మంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి గత ఏప్రిల్ 5వ తేదీన ప్రారంభించారు.

### సహపంక్తి భోజనం

హరిజన దినోత్సవం (మార్చి 30) నాడు సహపంక్తిభోజనం

ఏర్పాటుచేయ బడింది. వివిధ కులాలకు చెందిన సుమారు 300 మంది దీనికి వచ్చారు.

*తెగుళ్ళ నిర్మూలనకు విమానంనుంచి మందుచల్లకం*

రెండవ వరిపంటను తొలుచుడు పురుగునుంచి కాపాడడానికై బుడ్డం గ్రామంలో పైర్లకు విమానంనుంచి మందు చల్ల బడింది. గత మార్చి 29వ తేదీన ఇది జరిగింది. స్థానిక రైతులకు ఇదొక కొత్త అనుభవం.

*నిడుబ్రోలు పంచాయతీ*

నిడుబ్రోలు పంచాయతీ, సంవత్సరపు బడ్జెటు గత మార్చి నెలలో జరిగిన ఒక సమావేశంలో 1961-62వ అంచనాలను ఆమోదించింది. హరిజన వార్డుకు రు. 13,000 ల అంచనా వ్యయంతో విద్యుచ్ఛక్తి, మంచినీటి సౌకర్యాలు కల్పించడానికి నిశ్చయించబడినది.

*ఏ. సి. సి. ఉపాధ్యాయుల శిబిరం*

గుంటూరు న్యాయవాదుల సంఘం అధ్యక్షుడు శ్రీ జె. వై. నారాయణ, కొత్త పట్టాభిపురం కాలనీలో గత మార్చిలో నిర్వహించబడిన ఎ. సి. సి. ఉపాధ్యాయుల పునశ్చరణ శిక్షణ శిబిరాన్ని ప్రారంభించారు. గుంటూరు, తిరుపతి, నెల్లూరు, అనంతపురం ఇంకా రాష్ట్రంలోని ఇతర ప్రాంతాలకు చెందిన సుమారు 120 మంది ఎ. సి. సి. అధికార్లు దీనిలో శిక్షణపొందారు.

*పిల్లల పార్కు ప్రారంభోత్సవం*

ఒంగోలు రెడ్ క్రాస్ సొసైటీ భవనం ఆవరణలో మార్చి 19వ తేదీన పిల్లల పార్కు ప్రారంభించబడింది. పార్కుకు అవసరమైన సుమారు రు. 1000 లు విలువచేసే పరికరాలను శ్రీ టి. లక్ష్మీనరసింహస్వామి బహూకరించారు.

*తుర్లపాడు కాలువ ప్రారంభోత్సవం*

నాగార్జునసాగర్ క్రింద ప్రధానమైన కాలువలలో ఒకటైన తుర్లపాడు కాలువ, సత్తెనపల్లి తాలూకా ముప్పాళ్ళలో గత మార్చి నెలలో ప్రారంభింప బడినది.

## హైదరాబాదు

*ప్రాథమిక ఆరోగ్య కేంద్రం*

యాచారంలో నూతనంగా నిర్మించిన ప్రాథమిక ఆరోగ్య కేంద్రభవనాన్ని రాష్ట్ర ప్రణాళికా సమాచారశాఖామంత్రి శ్రీ పిడతల రంగారెడ్డి ఏప్రెల్ నెలలో ప్రారంభించారు.

*ప్రణాళికా ప్రదర్శనం*

శ్రీరామనవమి ఉత్సవాల సందర్భంగా అల్వాలలో మార్చి 25, 26 వ తేదీలలో హైద్రాబాదుజిల్లా ప్రణాళికా ప్రదర్శనం జరిగింది.

*పంచాయతీరాజ్య సమ్మేళనం*

హైద్రాబాదుజిల్లా ప్రథమ పంచాయతీరాజ్య సమ్మేళనం మార్చి 21, 22 వ తేదీలలో హైద్రాబాదులో జరిగింది. ప్రణాళికా శాఖామంత్రి శ్రీ పిడతల రంగారెడ్డి సమ్మేళనాన్ని ప్రారంభించారు.

## కరీంనగరం

*బహుమతి బాండ్ల లాటరీలో ఉపాధ్యాయునికి రు. 1000/-ల బహుమానం*

గతమార్చి 1 వ తేదీన జరిగిన బహుమతి బాండ్ల లాటరీలో పెద్దపల్లి జూనియర్ పాఠశాల ఉపాధ్యాయుడు శ్రీ ఎం. రాజ్ రెడ్డికి రు. 1000/-ల తృతీయ బహుమతి వచ్చింది. ఈ మొత్తంలో నుంచి రు. 750/-లను వ్యవసాయావసరాలకు ఉపయోగించ దలచినట్లూ, మిగిలిన డబ్బుతో మరికొన్ని బహుమతి బాండ్లు కొన దలచినట్లు ఆయన సమాచారశాఖ ప్రతినిధితో మాట్లాడుతూ అన్నారు. శ్రీ రాజ్ రెడ్డి సుల్తానాబాదు తాలూకా సుర్దల్ వాస్తవ్యుడు.

*నమూనా గ్రామాలలో ఇండ్ల నిర్మాణానికి రు. 1 లక్ష*

సుల్తానాబాదు సమితిబ్లాకులోని అయిదు నమూనా గ్రామాలలో 250 ఇండ్లు నిర్మించడానికి రు. 1 లక్ష మంజూరు చేయ బడినవి.

## ఖమ్మం

*కొత్తగూడెంలో ఆరోగ్య వారోత్సవం*

కొత్తగూడెంలో గత ఏప్రిల్ లో జరిగిన ఆరోగ్య వారోత్సవం సందర్భంలో 300 మంది బాలబాలికల ఆరోగ్య పరీక్షజరుపబడి ఆరోగ్యవంతులైన 98 మంది పిల్లలకు బహుమతులు ఇవ్వబడినవి. అదేవారంలో 1000 మంది వర్కర్ల ఇండ్లను తనిఖీచేసి పరిశుభ్రంగా వుంచిన ఇండ్లయజమానులకు కూడా బహుమతులు అందజేయబడినవి.

*భద్రతావారం*

సింగరేణి కాలరీస్ లోని రుద్రంపూరు డివిజనులో మార్చి 4 వ తేదీనుంచి భద్రతావారం జరుపబడినది.

*బ్లాకు మేలా*

వెంకటాపురం మొదటిదశ బ్లాకులో గత మార్చి నెలలో బ్లాక్ మేలా జరిగింది. మొదటి రోజు జరిగిన బహిరంగ సభకు జిల్లా పరిషత్తు అధ్యక్షుడు శ్రీ జలగం వెంగళరావు అధ్యక్షత

వహించి వివిధ ఆటల పోటీలలో గెలుపొందిన వారికి బహుమతులు పంచిపెట్టారు.

## కృష్ణా

*ప్రణాళికా ప్రదర్శనం*

పంచవర్ష ప్రణాళికా లక్ష్యాలను, ప్రగతిని వివరించే ప్రదర్శనం ఒకటి గత మార్చి 25వ తేదీనుంచి వారం రోజుల పాటు గుడివాడలో జరిగింది. యూనియన్ సమాచార, ప్రసార మంత్రిత్వ శాఖవారు ఈ ప్రదర్శనకు ఏర్పాటు చేశారు.

*యువజన శిక్షణశిబిరం*

బంటుమిల్లిలో గత మార్చి 8వ తేదీన యువజన సంక్షేమ శిబిరం నిర్వహింపబడినది.

*మచిలీపట్నంలో కొత్తకాలనీ*

మచిలీపట్నంలో అచ్యుతరామనగరం కాలనీకి గత మార్చి నెలలో శంకుస్థాపన జరిగింది. ఎరుకల, యానాదులకు చెందిన సుమారు 90 కుటుంబాలకు ఈ కాలనీలో వసతి కల్పించబడుతుంది.

*ప్రణాళికా ప్రదర్శనం*

గడిచిన రెండు ప్రణాళికల క్రింద సాధించబడిన అభివృద్ధిని వివరించే చిత్ర పటాల ప్రదర్శనను మార్చి 15వ తేదీన మచిలీపట్నంలో కేంద్ర ప్రణాళికా శాఖ ప్రచార విభాగం వారు ఏర్పాటు చేశారు.

*విమానాల ద్వారా పైర్లకు మందుచల్లకం*

పెయ్యేరు గ్రామంలో వరిపంటకు విమానం ద్వారా ఇటీవల మందుచల్లబడింది. తెగుళ్ళ నిర్మూలనకై వ్యవసాయ శాఖ ఈ చర్య తీసుకున్నది.

*వార్షిక మేలా*

నూజివీడు బ్లాకులోని ఈదరలో గత మార్చి 17 నుంచి 19 వ తేదీవరకు వార్షిక మేలా జరిగింది.

*పుత్రేలలో మేలా*

విస్సన్నపేట పంచాయతీ సమితి ఆధ్వర్యాన గత మార్చి 21 నుంచి 23 వరకు మూడు రోజులుపాటు జరిగిన మేలాను సమితి అధ్యక్షుడు ప్రారంభించారు. మేలా సందర్భంలో ఆటల పోటీలు, సంగీత, నాటక, నృత్య కార్యక్రమాలు, బుర్రకథలు, కోలాటాలు జరిగినవి. మొదటి రోజున జరిగిన పశు ప్రదర్శనం చాలా ఆకర్షణీయంగా వుంది.

## కర్నూలు

*మంచినీటి సరఫరా*

నంద్యాల మంచినీటి సరఫరా పథకానికి ముఖ్యమంత్రి గత ఏప్రిల్‌లో ప్రారంభోత్సవం చేశారు.

*పొదుపు పథకానికి రు. 15 లక్షల వసూలు*

ఈ జిల్లాలో గత మార్చి మొదటి వారంలో చేపట్టబడిన పొదుపు ఉద్యమం సందర్భంలో రు. 15.5 లక్షల మొత్తం వసూలైంది.

*ఆదోనివద్ద పారిశ్రామిక ఎస్టేటు*

ఆదోని సమీపంలో వైశ్రీవేటు పారిశ్రామిక ఎస్టేటును నెలకొల్పడానికై ప్రభుత్వం రు. 2 లక్షలు మంజూరు చేసింది.

## మహబూబ్‌నగరం

*గ్రామ నాయకుల శిబిరం*

జడ్చర్ల పంచాయతీ సమితిలోని పోలేపల్లిలో గత మార్చి 26వ తేదీన గ్రామ నాయకుల శిక్షణ శిబిరం ప్రారంభించబడినది. ఇది మూడు రోజులపాటు నిర్వహించ బడినది.

*బహుమతి బాండ్లు*

జిల్లా పరిషత్తు అధ్యక్షుడు, జిల్లా పౌరసంబంధముల శాఖాధికారి మార్చి 27న నూరు రు. 5ల బహుమతి బాండ్లను విక్రయించారు.

## మెదక్

*ఉత్తమ గ్రామసేవకుడు*

నర్సాపూర్ పంచాయతీ సమితి బ్లాకుకు చెందిన శ్రీ గురుమూర్తి, ఆంధ్రప్రదేశ్‌లో కెల్లా ఉత్తమ గ్రామసేవకుడుగా ఎన్నిక చేయబడినాడు. ప్రత్యేక నిర్ణాయక సంఘం ఈయనను ఎన్నిక చేసింది.

*యువజనోత్సవం*

గత ఏప్రిల్ మొదటి వారంలో నర్సాపూర్‌లో మెదక్ జిల్లా యువజనోత్సవం, శిబిరం జరుపబడినవి. నారాయణఖేడ్, జోగిపేట, సదాశివపేట, నర్సాపూర్ బ్లాకులకు చెందిన జట్టులు ఈ ఉత్సవాల సందర్భంలో జరిగిన ఆటల పోటీలలో పాల్గొన్నాయి.

## నల్గొండ

*బహుమతి బాండ్ల అమ్మకం ద్వారా రు. 40000 లభ్యం*

జాతీయ పొదుపు పథకానికి ఇతోధికంగా పెట్టుబడులను సేకరించే ఉద్దేశంతో నల్గొండ జిల్లాలోని కొన్ని ప్రధానమైన పట్టణాలలో గతమార్చి 22 నుంచి 31 వరకు బహుమతి బాండ్ల అమ్మకానికి ఒక ప్రత్యేక ఉద్యమం చేపట్టబడినది. అధికార్లు, అనధికార్లతో కూడుకున్న జట్టులు ఇంటింటికీ తిరిగి బహుమతి

శాండ్ల అమ్మకం ద్వారా రు. 40,000 లు సేకరించారు.

*సి. డి బ్లాకులకు ప్రత్యేక గ్రాంటులు*

హుజూర్ నగరం, దేవరకొండ సమాజాభివృద్ధి బ్లాకులకు ఒక్కొక్క దానికి రు. 10,000 ల ప్రత్యేక గ్రాంటును ప్రభుత్వం మంజూరు చేసింది. ఈ బ్లాకులో ఒక్కొక్క దానిలో 30,000 జనాభావుంది. వీటికంటే తక్కువ జనాభావున్న బ్లాకుల స్థాయిలో ఇవి అభివృద్ధిని సాధించడానికి వీలుగా వీటికి ఈ అదనపు గ్రాంటులు మంజూరు చేయబడినవి.

*శిక్షణ శిబిరం*

హుజూర్ నగరంలో ఇటీవల లోక సహాయక సేవ శిక్షణ శిబిరం నిర్వహింపబడినది. సుమారు 500 మంది శిక్షణకు చేర్చుకోబడ్డారు.

*సర్వేల్ లో వ్యవసాయ పారిశ్రామిక కాలనీ*

సర్వేల్‌లో గత మార్చి 12 వ తేదీన రాష్ట్ర గవర్నరు వ్యవసాయ-పారిశ్రామిక కాలనీని ప్రారంభించారు. సర్వేల్ సర్వోదయాశ్రమం దీనిని నెలకొల్పింది.

*పంచాయతీ గృహం*

ప్రణాళికా శాఖామంత్రి శ్రీ పిడతల రంగారెడ్డి గత మార్చి 19 వ తేదీన పంచాయతీ గృహానికి శంకుస్థాపన చేశారు. రు. 10,000 ల వ్యయంతో ఇది నిర్మితమవుతున్నది.

## నెల్లూరు

*పొదుపు ఉద్యమం*

ప్రఖ్యాత నర్తకి కుమారి పద్మిని నాట్యప్రదర్శనం ద్వారా నెల్లూరుజిల్లాలో జాతీయ పొదుపు పథకానికి రు. 15 లక్షలు సేకరించబడినవి. గత మార్చి 17 వ తేదీన నాట్యప్రదర్శనం జరిగింది. రెవెన్యూబోర్డు ప్రథమ సభ్యుడు, జాతీయ పొదుపు ఉద్యమసంస్థ డైరెక్టరు అయిన శ్రీ కె. ఎం. ఉన్నితన్ ప్రదర్శన నిర్వాహకులను అభినందిస్తూ ఇంత పెద్ద మొత్తాన్ని సమర్పించడం నిజంగా ఈ జిల్లాకు గర్వకారణమని అన్నారు.

## నిజామాబాదు

*లఘుపరిశ్రమల అభివృద్ధి*

తీవ్రతరంగా లఘుపరిశ్రమలను అభివృద్ధి పరచడానికి తల పెట్టిన ఉద్యమాన్ని రాష్ట్ర ఎక్సైజు, లఘుపరిశ్రమల శాఖా మంత్రి కొండా లక్ష్మణ్ బాపూజీ గత మార్చి 28 వ తేదీన నిజామాబాదులో ప్రారంభించారు. కేంద్ర లఘుపరిశ్రమలసంస్థ అధికార్లు సంచారవర్క్‌షాపులతో జిల్లాలోని వివిధ ప్రదేశాలకు వెళ్లి స్థానికంగా పరిశ్రమలు నడుపువారికి ఆధునిక ఉత్పత్తి విధానాల ప్రయోజనాన్నిగూర్చి వివరించి చెప్పారు.

## శ్రీకాకుళం

*సోంపేటలో టెలిఫోను ఎక్స్చేంజి*

గత ఏప్రిల్ 4 వ తేదీన సోంపేటలో టెలిఫోను ఎక్స్చేంజికి ప్రారంభోత్సవం జరిగింది. సోంపేట, ఈ జిల్లాలోని ప్రధాన వ్యాపార కేంద్రం.

*చెరకు క్షేత్రం వార్షికోత్సవం*

బొబ్బిలి చెరకుక్షేత్రం చతుర్థ వార్షికోత్సవానికి అధ్యక్షత వహిస్తూ బొబ్బిలి కుమారరాజా ఆధునిక సేద్యవిధానాలను అవలంబించి చెరకు ఉత్పత్తిని పెంపొందించవలసిందిగా ఉత్పత్తిదార్లకు విజ్ఞప్తి చేశారు.

*పనసనందివాడవద్ద ఆనకట్ట*

నాగావళికి అడ్డంగా పనసనందివాడవద్ద నిర్మించనున్న ఆనకట్టకు గత ఏప్రెల్ 5 వ తేదీన ముఖ్యమంత్రి శంకుస్థాపన చేశారు.

## విశాఖపట్నం

*గ్రామరాజ్య వారోత్సవం*

విశాఖపట్నంలో గత ఏప్రిల్ 6 వ తేదీ నుంచి "గ్రామ రాజ్య సప్తాహం" జరిగింది.

*పంజాబు సాంస్కృతిక బృందం రాక*

పంజాబు రాష్ట్రానికి చెందిన ఒక సాంస్కృతిక బృందం గత ఏప్రెల్ 6 వ తేదీన వాల్తేరులో ఆంధ్ర విశ్వవిద్యాలయం ఆరు బయలు థియేటరులో సంగీత, నృత్యప్రదర్శనలిచ్చింది. యూనియన్ సాంస్కృతిక వ్యవహారాల మంత్రిత్వశాఖ, అంతరరాష్ట్ర సాంస్కృతిక బృందాల పర్యటన పథకం క్రింద ఈ జట్టు పర్యటనను ఏర్పాటుచేసింది. ఈ బృందంలో వివిధవృత్తుల వారున్నారు. నేపథ్యసంగీతం కూర్చినవారిలో ఒక రిక్షాడ్రైవరుకూడా వుండటం గమనార్హం.

*అనకాపల్లిలో టెలిఫోను ఎక్స్చేంజి*

పార్లమెంటు సభ్యుడు శ్రీ వి. వి. రమణ గత మార్చి 17 వ తేదీన అనకాపల్లిలో 'టెలిఫోను ఎక్స్చేంజి' ని ప్రారంభించారు

*నీటి సరఫరా పథకం*

రు. 4 కోట్లు ఖర్చు అయ్యే విశాఖపట్నం విస్తృత నీటి సరఫరా అభివృద్ధి పథకాన్ని గత మార్చి 21 వ తేదీన రాష్ట్ర ప్రభుత్వం మంజూరుచేసింది.

*పొదుపు ఉద్యమం*

అనకాపల్లిలో గత మార్చిలో పొదుపు ఉద్యమం ప్రారం

ఖింపబడిన రెండు గంటలలోపుగా రు. 64000 ల మేరకు పెట్టు బడులు లభించాయి.

## వరంగల్లు

*నూత్నంగా సేద్యపు బావుల త్రవ్వకానికి సబ్సిడీ*

కొత్తగా సేద్యపు బావులను త్రవ్వుకోవడానికై మహబూబాబాద్ తాలూకాలో గత ఏప్రిల్ మొదటివారంలో 100 మంది రైతులకు ఒక్కొక్కరికి రు. 750 ల చొప్పున ఇవ్వబడినది.

*చిన్న మొత్తాల పొదుపు*

గత మార్చి 31 తో అంతమైన ఆర్థిక సంవత్సరంలో మహబూబాబాదు తాలూకాలో చిన్న మొత్తాల పొదుపు పథకానికి పెట్టుబడిగా రు. 2 లక్షలకు పైగా వసూలైంది.

*కుట్టుపని శిక్షణ కేంద్రం*

అశ్వాయపాలెం పంచాయతీ సమితి అధ్వర్యాన మహిళల కొరకు కసీదాపని, దర్జీపనుల శిక్షణకేంద్రం గత మార్చి 28 న మరిపెడలో తెరవబడింది. అదే రోజున ఒక చిన్న చికిత్సాలయం కూడా ప్రారంభించ బడినది.

*చిన్నరకం నీటి వనరులు*

ఈ జిల్లాలోని 3566 చిన్నరకం నీటి వనరుల (చెరువులు) నిర్వహణ మరమ్మతు పనులను, గత ఏప్రిల్ 1వ తేదీన వివిధ సమితుల ద్వారా జిల్లా పరిషత్తు చేపట్టింది.

*నేతపని శిక్షణ కేంద్రం*

జిల్లా పరిషత్తుకు చెందిన ఆర్థిక వ్యవహారాల స్థాయీ సంఘం గత మార్చి 24 వ తేదీన సమావేశమైనప్పుడు రఘునాథపల్లిలో నేతపని శిక్షణ, ఉత్పత్తి కేంద్రాన్ని స్థాపించే నిమిత్తం రు. 15,000 లు మంజూరు చేసింది.

*అశ్వాయపాలెం సమితి బడ్జెటు*

గత మార్చి 15వ తేదీన జరిగిన అశ్వాయిపాలెం పంచాయతీ సమితి సర్వసభ్య సమావేశంలో వర్తమాన ఆర్థిక సంవత్సరానికి రు. 7,58,180 ల బడ్జెటు ఆమోదించ బడినది. తొలుత ఆర్థిక వ్యవహారాల స్థాయి సంఘం బడ్జెటు అంచనాలను పరిశీలించి ఆమోదించింది. మహిళలు, శిశుసంక్షేమ వ్యవహారాల ఉపసంఘానికి ఈ సమావేశంలో సభ్యులను ఎన్నుకున్నారు.

*చిన్న మొత్తాల పొదుపు ఉద్యమం*

గత మార్చి నెల మొదటి వారంలో రెవెన్యూ, పంచాయతీ సమితి అధికార్లు, అనధికార ప్రతినిధుల సహకారంతో చిన్న మొత్తాల పొదుపు పథకానికి రు. 50,000 ల మొత్తం పెట్టుబడిగా సేకరించగలిగారు.

*విద్యుచ్ఛక్తి సౌకర్యాల విస్తరణ*

**హుజూరాబాదు** వరంగల్ తాలూకాలలోని కొత్తకొండ, పాలేరు గ్రామాలకు విద్యుచ్ఛక్తి సౌకర్యాలను విస్తరించడానికై రాష్ట్ర విద్యుచ్ఛక్తి బోర్డు రు. 3,10,100 లు మంజూరు చేసింది.

## పశ్చిమగోదావరి

*కళా వెంకటరావు పంపింగ్ పథకం*

నిడదవోలు సమీపంలో విజయేశ్వరం బ్లాకు వద్ద రాష్ట్ర పబ్లిక్ వర్క్సు శాఖామంత్రి శ్రీ అల్లూరి సత్యనారాయణ రాజు గత మార్చి 4వ తేదీన కళావెంకట్రావు పంపింగ్ పథకానికి శంకుస్థాపన చేశారు. ఈ పథకానికి ఒక కోటిరూపాయలు ఖర్చు కావచ్చని అంచనా.

*పాఠశాల భవనం ప్రారంభం*

ఎలమంచిలిలో రు. 130,000 ల వ్యయంతో నిర్మించబడిన పాఠశాల భవనానికి ఇటీవల ప్రారంభోత్సవం జరిగింది.

*నేత పనివారల కాలనీకి శంకుస్థాపన*

లఘు పరిశ్రమల శాఖామంత్రి శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ గత మార్చి 17వ తేదీన పాలకొల్లులో నేత పనివారల కాలనీకి శంకుస్థాపన చేశారు. ఇండ్ల నిర్మాణానికై ఋణంగా రు. 1,10,400 లనూ, సబ్సిడీగా రు. 55.200 లనూ, రోడ్డులు, పార్కుల నిర్మాణానికై రు. 8,700 లను ప్రభుత్వం మంజూరు చేసింది.

*చెరకు, వరిసాగు*

ఏలూరులో గత మార్చి నెలలో జరిగిన తీవ్రతర వ్యవసాయ కార్యక్రమ సమన్వయ సమావేశంలో పశ్చిమగోదావరి జిల్లాలో ఖరీఫ్ ఋతువులో వరివేసే విస్తీర్ణంలో 40 శాతం వరకూ, చెఱకు పండించే విస్తీర్ణంలో 30 శాతంవరకు ఈ పథకాన్ని అమలుపరచడానికి నిశ్చయించ బడినది.

# అసారే సంసారే!

కల్లూరి భోగేశ్వర సోమయాజులు

"అమ్మా! పాలు పట్టండి." అన్న పాలవాని పిలుపు విన్న పార్వతి "ఏమండోయ్! కాస్త పాలు పోయించుకుంటారా?" అని, రెండుమూడుసార్లు పిలవగా కళ్లు తెరిచాను.

అంతచీకటితో నిద్ర లేవడమనేది నా జన్మలో నే నెరుగను కదా—అట్లాంటి మహాపాతకానికి గురి కాలేదనికూడా గర్వ పడుతూ వుంటాను. నా గర్వం పట్టి నిరాధారమైన దనుకుంటారేమో! ఆధారా లనేకమున్నాయి.

ముఖ్యంగా, పొద్దు పైకెక్కినా నిద్రలేవనివారు రామ కృష్ణాద్యవతార తుల్యులని నా దృఢనిశ్చయము.

వారిని ఋషులు, మునులు, యతులు, కిన్నరులు, నారద తుంబురులు ఆదిగాగల వారందరు ఉదయాన్నే గొల్లుమని అల్లరిచేస్తూ లేపేవారని, "మీరు లేవమంటున్నారు కనుక లేస్తున్నాము కాని, లేకపోతే అసలు లేవకనేపోదు" మన్నట్లు కళ్లు నలుపుకుంటూ లేచేవారని, ఆబాలగోపాలానికి తెలిసిన విషయమే.

ఇక మనను—ఇంట్లోవున్న ముసలమ్మ, ఏదో పనిమైన పొద్దున్నే వచ్చిన స్నేహితుడు, ఆఫీసరు వెంటనే రమ్మంటున్నారంటూ వచ్చిన బంట్రోతు, అల్లరిచేసే పిల్లలు. విసుగెత్తిన భార్యామణి లేపుతూ వుండడం సహజం.

వారిని దుష్టశిక్షణ చేయాలని, శిష్టరక్షణ మొనరించాలని, లోకాలను పాలించాలని, పాపాలను పారద్రోలాలని లేపుతూ వుంటే—మనలను ఆఫీసుకు వేళ మించిపోతోందని, కూరలు తేవాలని, కాచిన కాఫీ చల్లారిపోతోందని, పంపులో నీళ్ళు పోతే స్నానానికి నీళ్లుండవనీ లేపుతూ వుంటారు.

కనుక లేచి చేయవలసిన కార్యక్రమాలు వేరయినా, లేవడమనే విషయంలో రామకృష్ణాదులకు మనకు తేడాలేదని నా యూహ.

మా ఆవిడ నన్ను పాలుపోయించుకోమని ఆదేశించి నేటికొక నెలరోజులయింది. మళ్ళీ యీ రోజు అదే ఆదేశాన్నందుకున్న నాకు ఒక్కసారి ఆగ్రహం, ఆవేశం, అభిమానము పొంగిపోయాయి. నెలరోజులక్రిందటి సంఘటనలెంత రావద్దన్నా గుర్తుకొచ్చి మనసును కలవరపరిచాయి. అన్నం గిన్ని దింపడంలో చూపిన ఆతురతవలన చేతులుకాలగా ఏర్పడినమచ్చలు మళ్ళీ బాధపెట్టడం మొదలుపెట్టాయి.

బ్రహ్మప్రయత్నం చేసయినా, పెద్దలను దేవతలను ప్రార్థించయినా, బియ్యాన్ని పరబ్రహ్మస్వరూపమైన అన్నం రూపం లోకిమార్చి ఆమెగారి కింతపెట్టి నేను తినవలసిన గతిని తప్పించగల దయామయు లెవ్వరూ కనుపించలేదు. ఏ పూటకూళ్ళ ఇంటి యజమానికైనా ఆ గౌరవం దక్కిద్దామంటే ఆ చుట్టు ప్రక్కల తుపాకిగుండుకుకూడా ఎవ్వరూ దొరకరు. పక్కింటి వాళ్ళ పాదాల నాశ్రయిద్దామంటే గృహిణుల పరస్పర విలోకన సుముహూర్త ఫలితమేమోగాని, మరుక్షణంనుంచి రామరావణులను, సుందోపసుందులను చుట్టుప్రక్కలవారికి గుర్తుకొచ్చేటట్లు చేశారు.

"మిమ్మల్నేనండి! పాలు."

"ఆ! వస్తున్నాను. మనలో మనమాట. నువ్వేం చేస్తున్నావేం?" అనుమాన నివృత్తికోసం ఆరాటపడుతూ అన్నాను. తీరా పనితొందరలో వుండి అర్ధశరీరమైన నన్నీ చిన్ని సహాయ మర్థించింది కాబోలన్న ఆశాలేశంకూడా మనసులో తళుక్కుమనక పోలేదనుకోండి.

"సరిపోయింది. ఏమిటి చేసేది? ఈ మూడు రోజులు తిండి తిప్పలు ఎల్లాగా అని ఆలోచించడమేగా?"

"అయిందీ! అనుకున్నది నిజమేనన్నమాట."

"మళ్ళీ వస్తానులెండి" అని లోలోపల గొణుక్కుంటూ విసిగి వేసారి వెళ్లిపోతున్న పాలవానిని చూచిన పార్వతి, "ఉండవయ్యా! పోతావేమిటి? ఏమండి. గిన్ని." అంది.

వంటింట్లోని పాలగిన్ని పట్టుకొచ్చి పాలు పోయించుకుని లోపల పెట్టాను. వాటిపైన మూత పెట్టాలనే పరిజ్ఞానం లేని నాకు పార్వతి పాఠంచెప్పి ఆ పని చేయించింది.

ఇక నిప్పంటించటం దగ్గరకొచ్చేసరికి అసలైనబాధ అవతరిస్తుంది. అది మినహా సంతర్పణ వంటలైనా క్షణంలో చేయవచ్చునని నా యూహ. (వంటవారికి మినహాయింపుసుమా!) ఎంతటి ఆచారవంతుడయినా ఆపనిదగ్గర కొచ్చేసరికి వీధుల్లోని

అప్పలమ్మనుకూడా చాటుగానో మాటుగానో అభ్యర్థిస్తాడు.

అట్లాంటి నారీజనైక సాధ్యమైన అగ్నికల్పనా క్రియ నా చేతుల్లోపడింది. నేను నిప్పంటించాలి అంటే అత్యవసర సాధనాలుగా రెండు నిండు అగ్గిపెట్టెలు, మూడు సీసాల కిరసనాయిలు, ఒకవీశెడు చిత్తుకాగితాలు, రెండు క్రొత్త విసినికర్రలు కావాలి. ఇవన్నీ వాటి కడసారి ఊపిరిపీల్చేసరికి, "నీ శ్రమ వృథా కాలేదు. నేనంటుకున్నాను భయపడకు. ఇంకా విశ్రమించు." అన్నట్లు అంత కుంపటిలోను, అన్ని బొగ్గుల్లోను ఒక నల్లబొగ్గు ఎఱ్ఱపడుతుంది. శ్రమ ఫలించిందికదా అన్న ఆనందంలోపడి ఒకసారి విసరడమో ఊదడమో ఊరుకుంటే ఐహికవిషయ అశాశ్వతత్వాన్ని మెదడుకు, శరీరానికికూడా పట్టేటట్లు ఆ నిప్పురవ్వకాస్తా నిశ్చలంగా కళ్ళు మూస్తుంది. మళ్లీ మన వ్యవసాయానికి నాందీగీతం పాడవలసినదే. అంతం లేని యీ అనంతకృషి చర్వితచర్వణంగా చేస్తే ఎప్పటికో ఫలించి అగ్నిదేవతా సాక్షాత్కారం సూక్ష్మాతి సూక్ష్మంగా, లీలగా జరుగుతుంది. పట్టుదల, కార్యదీక్ష వృద్ధిచేసుకోవాలనే పెద్దలు పట్టుమని పదిరోజు లీయోగం చేస్తే తప్పకుండా కృతకృత్యులౌతారు.

కాఫీపానీయంతో ప్రారంభమయ్యే నవ్యమానవ దినచర్యకు నేడు మా ఇంట్లో నేను ప్రారంభకుడనయాను.

ప్రత్యూషపవనాంకురములు పైకొనువేళ నిద్రలేచేవారు పూర్వులు. పాలవాని పిలుపులు కర్ణపుటాల్లో గింగురుమంటూ వుంటే నిద్రలేస్తున్నాము మనము.

కాలకృత్య నిర్వహణానంతరము భగవదనుగ్రహ ప్రాప్తి కొరకు గడచిన రాత్రి భద్రంగావుంచిన హోమాగ్నిని అనేక కష్టపరంపరలకోర్చి ప్రజ్వలింపచేసి అగ్నిదేవతోపాసన చేసెడివారు ప్రాచీనులు. కాఫీదేవతానుగ్రహ ప్రాప్తికొరకు ప్రయత్న పరంపర ప్రసాదితమైన అగ్నిజ్వాలాకల్పనం చేస్తున్నాము మనము.

చివరకు నా శ్రమ ఫలించి అగ్ని ప్రతిష్ఠాపనం జరిగింది. కొలత తెలియని నేను పావుపౌను కాఫీపొడి ఒక శేరు నీళ్లల్లో కలిపి సుమారు పాతికమంది లేదనుకోకుండా రెండు మూడు కోటాలు పుచ్చుకోవటానికి వీలయినంత కాఫ్యాంగాన్ని తయారుచేసి ఫిల్టరులో పోయబోతే అది "నా కంత భరించగల తాహతులేదో "అని అఘోరిస్తూవుంటే అనుగ్రహం కలిగి పట్టినంతేపోసి మిగిలింది ప్రక్కగా పెట్టాను.

ఎక్కడైనా లోపంవస్తుందేమో ఎగతాళి చేద్దామనే మా ఆవిడ యీ సదవకాశాన్ని జారవిడుచు కోలేక పోయింది.

ఇక పాలు వేడిచెయ్యడం, మొదలుపెట్టాను. త్వర త్వరగా కాఫీ తయారుచేసి త్రాగాలనే తహ తహలో పొయ్యిమీదిపాలు పొంగటానికి తగిన వ్యవధివుందా? లేదా? అని ఆలోచించము. ఎంతటికీ పొంగని ఆ పాలు చూసి పాలా? కావా? అన్న చిన్న శంకకూడా కలుగక పోలేదు. దేవుడు వరమిచ్చినా తాను వప్పుకోని పూజారికి తమ్ముడుగా నున్న పాలపైన ఆగ్రహం పెచ్చుపెరిగింది. అసమర్థునికి అన్నిటపైన కోపమే అంటారేమో! కావాలనుకున్న పని సక్రమంగా సమకూరనప్పుడు కలిగే ఆవేశం కాస్త కవిత్వపు పిచ్చిగల నాబోటిగానికి పాటో, పద్యమో వ్రాయటానికి సదవకాశమే కాగలదుగా! "పాలా! నీ పాలన్ బడితిని. పొంగవదేలనే? కోపాలా? తాపాలా? పెద్దల శాపాలా?" అన్నంతదాకా వచ్చిన కవితా ప్రవాహానికి అమాంతంగా అడ్డుతగిలి పైవేమీకావని మనసా వాచా కర్మణా ఋజువుచేయటానికో అన్నట్లు ఆపాలు కాసినీ గిన్ని అంచులు దాటి అగ్ని ప్రవేశంచేసి తమపై నేను వేసిన నీలాపనిందను బాపు కున్నాయి.

అపనింద బాపుకునే ఆవేశంలో అన్నీ నిప్పులో కురికి ప్రాణాలర్పిస్తే మన ప్రాణం కడముట్టి మంచితీర్థంకూడా అడక్కుండానే కన్ను మూస్తామన్న భయంతో వాటిని రెండు చేతులూ జాపి బుజ్జగించబోతే నాలుగు వేళ్లు భగ్గుమన్నాయి.

కిటికీ చాటునుంచి చూస్తున్న అర్ధాంగి కిలకిలా నవ్వుతూ కాసిని నీళ్లు చిలకరించండని సలహా చెప్పింది.

భర్తచేత బడితపూజ చేయించుకున్నందుకు కాక, తోటి కోడలు నవ్విందనే రోషంతో రోదనోపక్రమణం చేసిన యిల్లాలికి నాకు కించుత్తుకూడా తేడాతోచలేదు. ఇంటిమీద, ఇల్లాలిమీద, ఈ లోకంమీద అసహ్యము, ఏవగింపు, అదేక్షణంలో అవతరించాయి. కామ, క్రోధ, లోభాల పర్యవసానమే యీ సంసారమనే పరమ సత్యం అవగతమయింది. తుచ్ఛశరీరసౌఖ్యాల కోసం పడ్డశ్రమ అనవసర మనిపించింది.

మిగిలిన రెండు రోజుల్లోను వేదాంత భావం అంతై, ఇంతై కడకు కార్య రూపంలోకూడా ఆచరించటానికి తగినంతయింది.

మూడవరోజు ఉదయాన్నే లేచాను. ఇల్లు సర్వ సౌఖ్యాలు వదలి వెళ్లిపోతున్న బుద్ధదేవుడు గుర్తుకొచ్చాడు. ఇల్లాలు నీళ్ళగదిలోవుంది. ఇదే మంచితరుణం. ఆలసిస్తే మళ్లీ మాయ ఆక్రమించ వచ్చును. గుమ్మం ఆఖరి మెట్టుమీద కుడికాలు మోపాను.

"అమ్మయ్య! స్నానమయి పోయింది. పాపం చాలా కష్టపడ్డారు. కాఫీ రెండు నిమిషాల్లో తయారుచేస్తాను."

పురోగమించబోయిన కాళ్లు తిరోగమనంలో పురోగమించాయి.



# విశేషాలు

### *అమెరికా విద్యార్థులచే తెలుగు అభ్యాసం*

తెలుగు, తమిళం ఇతర పరదేశభాషలపట్ల అమెరికా విద్యార్థుల ఆసక్తికి ఆ దేశ ప్రభుత్వంనుంచి మంచి ప్రోత్సాహం లభిస్తోంది. దినపత్రికలలో వెలువడిన వాషింగ్టన్ వార్త ప్రకారం, అమెరికాలో ఎక్కువగా బోధించని భాషల అభ్యాసానికై విద్యార్థులకు ఆధునిక భాషా ఉపకార వేతనాలు 695 అమెరికా ప్రభుత్వం మంజూరు చేసింది.

జాతీయ విద్యాచట్టంక్రింద అనుమతించబడిన కార్యక్రమంలో భారతీయ భాషలు నాలుగు-మరాఠీ, తెలుగు, తమిళం, బెంగాలీ-చేర్చబడినవి.

### *ఆగ్నేయాసియాలో పెద్ద టెలిస్కోప్*

ఆగ్నేయాసియాలోకెల్లా పెద్దదయిన టెలిస్కోప్ ఒకటి యీ సంవత్సరం ఉస్మానియా విశ్వవిద్యాలయంలో అమర్చబడుతుందని పత్రికావార్త.

48 అంగుళాల రిఫ్లెక్టర్‌తో రు. 6 లక్షల వ్యయమయ్యే యీ టెలిస్కోప్ అమెరికానుంచి జులై ఆఖరుకల్లా హైదరాబాదుకు వస్తుంది.

నిజామియా పరిశోధక పథకం అభివృద్ధికి తీసుకునే చర్యలలో ఇదొకటి.

ఉస్మానియా విశ్వవిద్యాలయం కొత్తగా ఖగోళశాస్త్రంలో ఒక శాఖను తెరిచింది. ఈ కోర్సులో సైన్సుగ్రాడ్యుయేట్లు పదిమంది చేర్చుకోబడినారు. వచ్చే సంవత్సరం వీరికి యం. యస్‌సి. డిగ్రీ ఇస్తారు. ఈ కోర్సులో ఉత్తీర్ణులయిన వారితో పోస్టుగ్రాడ్యుయేటు కోర్సు ప్రారంభిస్తారు.

### *ఢిల్లీలో కూచిపూడి నృత్యప్రదర్శన*

కేంద్ర సమాచార, ప్రసార మంత్రిత్వశాఖలోని సంగీత, నాటక విభాగం ఆధ్వర్యాన కొత్తఢిల్లీలో జరిగిన ఐదవ వేసవి నాటకోత్సవాలలో విజయవాడకుచెందిన శ్రీ చింతా కృష్ణమూర్తి నాయకత్వాన కూచిపూడి నృత్యబృందంకూడా పాల్గొన్నది. ఈ ప్రదర్శన ఏప్రిల్ 8న జరిగింది.



ఉత్తముండు హితముచేసి యూరకుండు, మధ్యముండు హితముచేసి మాఱువెదకు
నధముఁడొరుచేయు హితమైన నణఁచిపుచ్చు, హితమునకు నెగ్గు చేయువాఁడెవ్వఁడగును ?

—నాచనసోమన.

# "ఆంధ్రప్రదేశ్" ప్రకటన రేట్లు

'ఆంధ్రప్రదేశ్' పత్రికలో ఈ దిగువ రేట్లప్రకారం ప్రకటనలు స్వీకరించబడగలవు

| వివరాలు | మూడు భాషల పత్రికలకు | | | ఒక భాష పత్రికకు | | |
|---|---|---|---|---|---|---|
| | పూర్తి పేజీ రూ | సగం పేజీ రూ | పావు పేజీ రూ | పూర్తి పేజీ రూ | సగం పేజీ రూ | పావు పేజీ రూ |
| లోపలి పేజీ | 200 | 125 | 75 | 100 | 55 | 30 |
| వెనుకవైపు కవరుపేజీ | 350 | — | — | 150 | — | — |
| 2, 3 కవరు పేజీలు | 250 | — | — | 125 | — | — |

ఒక సంవత్సరం కొరకు స్థలమును కంట్రాక్టు తీసుకొన్నవారికి 20 శతి రిబేటు ఇవ్వబడుతుంది.

## షరతులు

1. సాంకేతిక వివరాలు: 10¾ × 8½" డెమ్మి.
2. ముందరి టైటిల్ పేజీపై ప్రకటనలు వేయబడవు.
3. పావుపేజీకంటే తక్కువ ప్రకటనలు స్వీకరించబడవు.
4. ప్రకటించవలసిన విషయము, అది వేయబడవలసిన స్థలము మొదలగు వివరాలూ, దానికయే మొత్తమూ ప్రతినెల 8 వ తేదీలోపుగా ఈ కార్యాలయానికి చేరినట్లయితే, ఆ ప్రకటన మరుసటి నెల పత్రికలో ప్రచురింపబడుతుంది. ప్రకటనకయ్యే మొత్తమును మనియార్డరు ద్వారాగాని, లేక క్రాస్ చేసిన డిమాండు డ్రాఫ్ట్‌ద్వారాగాని పంపవలెను. డిమాండు డ్రాఫ్ట్ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార, పౌరసంబంధముల శాఖ డైరెక్టర్, హైదరాబాదు-దక్కన్ పేరిట వ్రాయబడవలెను.
5. ప్రకటన నిమిత్తమై పంపబడు బ్లాకుల విషయంలో తగుజాగ్రత్త వహింపబడుతుంది. అయితే మిషను మీద బ్లాకులు గనుక పగిలిపోయినట్లయితే అందుకు ఈ శాఖ బాధ్యత వహించదు.
6. ప్రకటన ఎంతస్థలంలో ఏ వైనం ప్రకారం వేయవలసిందీ, ఒక భాష పత్రికలో వేయవలెనా, లేక మూడుభాషల పత్రికలలో వేయవలెనా అనే వివరాలను స్పష్టంగా తెలియపరచాలి. ఉత్తర ప్రత్యుత్తరాలను, పైకమును ఈ దిగువ చిరునామాకు పంపవలెను.

డైరెక్టర్
సమాచార పౌరసంబంధముల శాఖ
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
హైదరాబాద్—1

*కథానిక:*

# తాను వెలిగించిన దీపాలు

మధురాంతకం రాజారాం

"చూడు బాబూ! ఓపినంత దూరం ప్రయాణంచేసి వచ్చాను. నరాలు గుంజుతున్నాయి. తల భారంగా వుంది. ముక్త సరిగా ఒకటి రెండు మాటలే! అంతకంటే కాలహరణం జరగదు. ఎలాగైనా నువ్వు హెడ్మాష్టరుగారికి నచ్చచెప్పాలి...." దీనంగా అర్థిస్తున్నారు శర్మగారు.

సమయం సరిగ్గా మిట్ట మధ్యాహ్నం. స్థలం - బాపూజీ ఉన్నత పాఠశాలలో ఆఫీసు రూము ఎదుటనున్న వసారా. శర్మగారు అరగంట సేపటినుంచీ వేచిచూస్తున్నారు. రెండుసార్లు లోపలికి చెప్పిపంపారు. కబురు తీసుకుని లోపలికివెళ్ళి తిరిగి వచ్చిన జవాను హెడ్మాష్టరుగారు వూపిరి త్రిప్పుకోడానికి వీల్లేనంత తొందరపనిలో నిమగ్నులై వున్నారనీ, మధ్యాహ్నానంతరమైతే తీరికచేసుకొని మాట్లాడడానికి ప్రయత్నించగలరనీ తెలియబరిచాడు.

శర్మగారు హతాశులైపోలేదు. ఆయన మూడోసారి మళ్ళీ జవాను పుల్లయ్యను కదిపి చూశాడు.

ఒక చెవిని కాలింగ్‌బెల్ మ్రోత కోసం ప్రత్యేకించి మరొకచెవితో ఆగంతకుడి దీనాలాపాలు వింటున్నాడు పుల్లయ్య. అతడి వూహ ప్రసరించినంత మేరలో శర్మగారిలాంటి ముక్కాలి ముదుసలికి, హెడ్మాష్టరుగారితో మాట్లాడవలసిన అగత్యమేమిటో స్ఫురించడం లేదు. రంగసముద్రంలో యిలాంటి వ్యక్తిని చూచినట్టు గుర్తులేదు. చాలాదూరం ప్రయాణంచేసి వచ్చినట్టు చెబుతున్నాడు. బహుశా హెడ్మాష్టరుగారి బంధువేమో! అబ్బే అయివుండడు. బంధువైతే అనుమతికోసం పడిగాపులు పడకుండా నేరుగా లోపలికి వెళ్ళగలిగి వుండేవాడు. ఐతే యిత డెవరు? ఎందుకోసం వచ్చాడు?

కాలం దొర్లిపోతోంది. నాలుగో పీరియడ్ యింక అయిదు నిమిషాలలో పూర్తికానున్న దనగా కాలింగ్‌బెల్ మ్రోగింది. పుల్లయ్య లోపలికి పరతెంచాడు. ఫైళ్ల చిట్టడవిలో, పుస్తకాల కాంతారంలో గొంతుకదాకా మునిగిపోయిన నరహరిరావుగారు కాస్తా తెరపిచేసుకుని చేతులు పైకెత్తి ఒళ్ళు విరుచుకుంటూ "యింటి దగ్గరనుంచీ భోజనం వచ్చిందా పుల్లయ్యా?" అన్నారు.

"వచ్చింది బాబూ! గదిలో వుంచాను" అన్నాడు పుల్లయ్య. అన్నతరవాత ఒకటి రెండు క్షణాలు తటపటాయించి" అన్నట్టు ఎవరో ముసలాయన కాచుకుని కూచున్నాడు బాబూ!" అన్నాడు.

"ఓహో, అవునుగదూ! ఆయఖింకా యిక్కడే వున్నాడన్న మాట! ఎవరో చూచి పంపేద్దాంగానీ లోపలికి రమ్మంటావా పుల్లయ్యా!"

పుల్లయ్య బయటికి వెళ్ళిన కాసేపటికి వడగాడ్పుల తాకిడికి ముఖంపైన పొటమరించిన స్వేదబిందువుల్ని ఉత్తరీయంతో తుడుచుకుంటూ శాస్త్రిగారు లోపలికి వచ్చారు.

నరహరిరావుగారు శర్మగారి వైపోసారి ఎగాదిగా చూచారు. టేబిలు పైకి వంగి కళ్ళజోడు సవరించుకుంటూ ఎదుటి వ్యక్తి ముఖంలోకి సూటిగా చూచారు. "ఎవరండీ! ఏ వూరు? ఏం పనిమీద వచ్చారు?" అంటూ పరామర్శించి, ఆ పరామర్శలో అమూల్యమైన కాలాన్ని అప్రస్తుత విషయాలపైన ఖర్చుపెట్టడం పట్ల తమ కిష్టం లేదన్న భావాన్ని స్పష్టంగా ధ్వనించారు.

శర్మగారు తాను చెప్పదలచుకున్న విషయాన్ని బాగా మననం చేసుకుని వచ్చినమాట నిజమే! కానీ తీరా చెప్పవలసి వచ్చేసరికి ఎలా ప్రారంభించాలో తోచక ఆయన తడబడిపోయారు. అవతల హెడ్మాష్టరు గారేమో 'చెప్పండి, చెప్పండి' అన్నట్టు చూపులతోనే వేగిరిస్తున్నారు. చివరి కెలాగైతేనేం, శర్మగారి పెదవులు కదిలాయి....

"మీకు తెలియకపోవచ్చు! పదిహేనేళ్ళ క్రిందటిమాట. అప్పుడిది హైస్కూలు కాదు. మిడిల్ స్కూలు. శేషాద్రిగారని ఓ హెడ్మాష్టరు గారుండేవారు. ఆయనకు మునుపు శ్రీకంఠంగారు హెడ్మాష్టరు. అంతకు మునుపు ఆనందరావుగారు..."

'ఇంతకు నువ్వెవరి వయ్యా మహానుభావా!' అన్న ప్రశ్న

నరహరిరావుగారి కళ్ళల్లో ప్రతిబింబిస్తోంది. ఒకటి రెండేళ్ళకు మునుపు స్వర్ణోత్సవ సందర్భంలో పాఠశాల పూర్వ చరిత్రకు సంబంధించిన వివరాలు సమగ్రంగా లభించక ఆయన కెంతైనా ఆశాభంగం కలిగింది. ఈనాడు బయట ఎండ నిప్పులు చెరిగి పోస్తున్న మధ్యాహ్న సమయాన ఓ వ్యక్తి అకస్మాత్తుగా గదిలోకి వూడిపడి పాఠశాల తాలూకు పూర్వచరిత్రను ముదలంకించుకునే సరికి, ఆయన తమ తొందర పను లన్నింటినీ తాత్కాలికంగా వాయిదావేసి శర్మగారి మాటల్ని సావధానంగా వినసాగారు.

"ఆ విధంగా నేను పది పన్నెండుగురు హెడ్మాస్టర్ల పేర్లు చెప్పగలుగుతున్నా ననుకుంటున్నారేమో ! ఇదే పాఠశాలలో ఎక్కడా బ్రేక్ అన్నది లేకుండా నేను ముప్పై అయిదేళ్ళు పని చేశాను. మీ రెప్పుడైనా కానగనూతల కృష్ణశర్మ అన్న పేరు విన్నారటండీ !"

లేదన్నట్టుగా నరహరిరావుగారు తల పంకించారు.

"ఆ కృష్ణశర్మనే నేను ! తెలుగు పండితుణ్ణి. ఇరవయ్యో సంవత్సరం జరుగుతుండగా వుద్యోగంలో చేరాను. యాభైఅయిదేళ్ళ దాకా సర్వీసు చేశాను. భ్రమ అనుకోండి, లేదా అనుబంధ మనుకోండి ఈ పాఠశాలకు నేను, నాకీ పాఠశాల స్థిరమనుకునే వాణ్ణి. ఇక్కడ వుద్యోగం చేస్తుండగానే భార్య పోయింది. ఒక్కగానొక్క కూతురు నాకు. అల్లుడు తమిళదేశంలో కేంద్ర ప్రభుత్వం క్రింద పనిచేస్తుండేవాడు. ఉద్యోగకాలం పూర్తికాగానే నాకక్కడికి వెళ్ళక తప్పలేదు. కానీ ఈ పదిహేనేళ్ళ పొడుగునా ఈ పాఠశాలా భవనం, యిందులోని తరగతి గదులు, యిక్కడ జరిగిన సంఘటనలు యివన్నీ తెరపైన బొమ్మలకుమల్లే మనసులో మెదలుతుండేవి. మనసు సముద్రం లాంటిదైతే పూర్వస్మృతులు అలల్లాంటివి. అలల్లాంటి ఆ పూర్వస్మృతులు కలల్లోకిగూడా వచ్చేవి. బొందిలో వూపిరుండగా మళ్ళీ ఎప్పుడైనా యిక్కడికి వచ్చి పోవాలని కలలుగనే వాణ్ణి. నా కల యీ నాటికి ఫలించింది...."

నరహరిరావుగారు డబ్బీతీసి ఓ చిటికెడు నశ్యాన్ని నాసికా రంధ్రాల్లోకి దట్టించారు. ఓ క్షణంపాటు అరమోడ్పు కళ్ళతో పైకప్పుకేసి చూస్తుండిపోయిన తర్వాత హఠాత్తుగా అసలు విషయంలోకి వచ్చేస్తూ "అలాగా ! అందుకోసం వచ్చారా ?" అని ప్రశ్నిస్తూ కుర్చీలో సర్దుకుని కూర్చున్నారు. ఆ ప్రశ్నలో ఏదో అనుమానం దాగుడుమూత లాడుతోంది....'తొట్టిమరులు' అన్నమాట లోకంలో అప్పుడప్పుడూ వినిపిస్తుంది. అది యిదే కాబోలు ! ఐనా ఏనాడో పనిచేసిన సంస్థను చూచిపోవడానికని ఈయన పనిగట్టుకుని యింతదూరం వచ్చాడంటే నమ్మడం కష్టం. వచ్చినవాడు కళ్ళ ఎదుట కనిపిస్తుండగా నమ్మకపోవడంలో సబబులేదు ! ఐతే ఏ మాట కామాటే చెప్పుకోవాలి. ఈయన కేవలం చూచిపోవడానికే వచ్చివుండడు. అంతకంటే ముఖ్య కారణం వేరొకటి వుండి తీరుతుంది....

ఏమిటది ?

పాఠశాల పూర్వ చరిత్రను తెలుసుకోవాలన్న కోరికకంటే ఆ ముఖ్యమైన కారణమేమిటో తెలుసుకోవాలన్న కుతూహలమే నరహరిరావుగారిలో ఎక్కువైపోతోంది.

శర్మగారు చెప్పుకపోతున్నారు. "ఆశా పాశము తా గడున్ నిడుపు...."అన్నారు కవి. నిజమే. ఆత్మ ప్రశంస అనీ మీ రనుకోక పోతే నే నొకమాట చెబుతాను. జీవనయాత్రకు మేష్టరీ వృత్తిని స్వీకరించిన వారిపట్ల లోకుల కెందుకో చిన్నచూపు వుండేది. ఇప్పుడుందో లేదో నాకు సరిగ్గా తెలియదు ! మరెందుకూ లాయక్ కానివాళ్ళు మాత్రమే యిందుకు పూనుకుంటారన్నది వాళ్ళ వుద్దేశమైతే గావచ్చు. వాళ్ళ సంగతి అలా వుండగా బడిపంతుళ్ళకు సైతం వాళ్ళు స్వీకరించిన వృత్తిపట్ల ఏవో అసంతృప్తు లుండేవి. వాళ్ళనుచూచి నే నాశ్చర్యపడే వాణ్ణి. నా మట్టుకు నాకు యింతకంటే మనసుకు శాంతినిచ్చే వృత్తి వేరొకటి లేదనిపించేది. పాఠశాల ఉదయం పది గంటలకు ప్రారంభ మౌతుందంటే నేను ఎనిమిది గంటలకల్లా హాజరయ్యే వాణ్ణి. రాత్రి ఏ ఏడుకో, ఎనిమిదికో తిరిగి వెళ్ళడం జరిగేది. ఎడతెగని కార్యక్రమాలు. నిత్యనూతనమైన ఉత్సాహం. వందలాది విద్యార్థుల మధ్య తిరుగుతుంటే పెళ్ళి పందిరి క్రింద తిరిగినట్టుండేది. కాలం కొండవాగులాగా పరుగులు తీసేది. జూన్‌లో స్కూలు తెరిచిన కొంతకాలానికి దసరా వచ్చేసేది. అంతలో క్రిస్‌మస్ కనిపించేది. అదలా వెళ్ళగానే మార్చి ఏప్రిల్ నెలల్లో పరీక్షలు. ఆ పైన వేసంగి సెలవులు. ఉండమని ప్రాధేయపడినప్పటికీ తమకు బోలెడన్ని పనులున్నాయని చెప్పి సెలవు తీసుకునే ఆత్మీయులైన బంధువులకుమల్లే క్యాలెండర్లు ఎగిరిపోయేవి. హేమంతం ఆఖరుగాక మునుపే వసంతశోభతో తొలుకాడే పూలతోటలకు మల్లే కొత్త సంవత్సరాలు వచ్చేసేవి. ముప్పైఅయిదేళ్ళ నా ఉద్యోగ జీవితం అలాగే గడచి పోయింది...."

అస్తిపంజరం పైన చర్మపు తొడుగులాంటి శరీరం. గత

జీవితానికి సంబంధించిన మధురస్మృతులు మాటల్లోని ఆర్ద్రిత— యివన్నీ నరహరిరావుగారిని శర్మగారివైపుకు ఆకట్టుకోలేక పోయాయి. నరహరిరావుగారి అతివాస్తవిక దృష్టి శర్మగారి ఉపోద్ఘాతానికి వెనుక ఏదో బలమైన ప్రయోజనాన్ని శంకిస్తోంది.

శర్మగారు కొనసాగిస్తున్నారు — "వచ్చుకాలముకంటే గత కాలమే మేలన్నారు పెద్దలు. ఆ ఆర్యోక్తి నాపట్ల అక్షరాలా సార్థకమైంది. నా జీవితంలో పూర్వార్ధానికీ, ఉత్తరార్ధానికి పోలి కంటూ కనిపించదు. అక్కడ ఆనందాన్ని, యిక్కడ విషాదాన్ని వ్రాసిపెట్టాడు భగవంతుడు. నా అన్నవాళ్ల లేనిచోట ఉద్యోగం చేస్తూవచ్చిన అల్లుడు ఉన్నట్టుండి మూడేళ్ళక్రిందట కళ్ళుమూసుక పోయాడు. అతగాడు మిగిల్చిపోయిన ఆస్తిపాస్తులు తక్కువ. అమ్మాయి పాలిటికి నలుగురు ఆడబిడ్డలు, యిద్దరు మగబిడ్డలు మిగిలారు. కష్టనష్టాలను ఏకరువుపెడుతూ మిమ్మల్ని విసిగించడం నా వుద్దేశంకాదు. పరుగెడుతున్న రైల్లోనుంచి డ్రయివరు క్రిందికి దూకేస్తే ఏమౌతుందో మీరూహించుకోగలరు. ఈ మూడేళ్ళుగా సంసారం చేతులపట్ల బలవంతాన సాగింది. ఉన్న చిక్కులన్నీ చాలవన్నట్టుగా యిప్పుడు గోరుచుట్టుపైన రోకటి పోటులాగా మరొక క్లిష్టసమస్య ఎదురైంది..."

"చెప్పండి...." అన్నారు నరహరిరావుగారు. శర్మగారి ఆత్మకథయొక్క పర్యవసానమేమిటో ఆయనకింకా స్ఫురించటం లేదు అందువల్ల ఎంతసేపు పరీక్షించినా రోగనిదానానికి రాలేక పోతున్న డాక్టరుకుమల్లే ఆయన యిబ్బంది పడిపోతున్నారు.

"పెద్దమ్మాయి పెళ్ళికెదిగింది. పెళ్ళికీ లేమికీ సంబంధం లేదు. మర్యాదలూ, లాంఛనాలు యధావిధిగా జరగనిపక్షంలో పెళ్ళి కొప్పుకునే మగపెళ్లివారులేరు. ఎంతో కాలంనుంచీ నేనొక ప్రేక్షకమాత్రుణ్ణిగా అక్కడ ఏర్పడుతూవచ్చిన విషాద సన్నివేశా లను చూస్తూకూర్చున్నాను. ఇటీవల పరిణామాలవల్ల అలా కూర్చోడం సాధ్యమైందిగాదు. ఎంతటి నిస్సహాయకరమైన పరిస్థితిలో వున్నప్పటికీ మనిషిలో ఆలోచనలు తీగలుసాగి ఆశా కుసుమాలు పూచి పందిళ్ళువేస్తాయి. చల్లకువచ్చి ముంత దాచు కోడం అనవసరమేగాదు. హాస్యాస్పదంగూడా. నా ఆలోచన లన్నింటికీ ఫలితమే ఈ ప్రయాణం. ఎలా లభ్యమౌతుందన్న ప్రశ్నకు సూటిగా సమాధానం చెప్పలేనుగానీ, యిక్కడేదైనా సహాయం దొరకవచ్చునన్నదే నా నమ్మకం..."

నరహరిరావుగారు శర్మగారివైపు చూడటంలేదు. ముఖభంగి మనుబట్టి శర్మగారెక్కడ తమ మనోగత భావాల్ని పసిగట్టేస్తా రేమోనన్న అనుమానంచేతనే గావచ్చు, ఆయన తలవంచుకుని మేజావైపు చూస్తున్నారు. ఈ మధ్య యాచన రకరకాలుగా ముస్తా బవుతోంది. ఇది సరిక్రొత్త వేషమేమో! ఈ ముసలాయనకు తనేమని సమాధానం చెప్పడం? ఏవిధంగా చెప్పినా తన సమా ధానం ఈయనకు తృప్తికరంగా మాత్రం వుండబోదు...."

కానీ నరహరిరావుగారు లోకజ్ఞులు. ఎలాంటి సునిశిత విష యంలోనైనా ఎదుటివారిని నొప్పించకుండా, తాము నొవ్వకుండా మెలకువగా వ్యవహరించగలగడం ఆయనలోని సుగుణం. "మీరు బాగా అలిసిపోయినట్టున్నారు. దగ్గర్లోనే హోటలుంది. భోజనం తెప్పిస్తాను. మొదట భోజనంచేయండి. ఎండ తగ్గేదాకా గదిలో విశ్రమించండి. ఆ లోపల ఏవిషయాన్నిగురించి నేనూ నింపాదిగా ఆలోచించుకోడానికి వీలుంటుంది అంటూ నరహరిరావుగారు కాలింగ్‌బెల్‌పైన చేయి వేశారు.

* * *

శర్మగారు నిద్రలేచి ఈవలికి వచ్చేసరికి హెడ్మాష్టరుగారు కుర్చీలోలేరు. గోడగడియారంలో గంట నాలుగు కావస్తోంది. ఉదయం జరుగుతున్నట్టే తరగతి గదుల్లో పాఠాలు జరుగు తున్నాయి. శర్మగారు ద్వారందాటి వసారాలోకివచ్చి గన్నేరు చెట్టుచాటున స్తంభానికానుకొని నిల్చున్నారు. పదిహేనేళ్ళ మును పటికీ యిప్పటికీ పాఠశాల బాహ్యస్వరూపంలోగూడా ఎన్నో మార్పులొచ్చినట్టున్నాయి. మునుపిన్ని గదులులేవు. ఇన్ని చెట్లు లేవు. ఇందరు విద్యార్థులులేరు. ఇంతకాలంగా తన స్మృతి పథంలో మెదులుతూవుండిన పాఠశాలయొక్క ప్రతిబింబం వేరు. ఇప్పుడు కనిపిస్తున్న పాఠశాలవేరు. ఇప్పుడిక్కడ తననుగుర్తింప గలిగినవారులేరు. ఒకవేళ ఈ స్తంభం మాట్లాడగలిగితే, ఆరాతికి నోరుంటే, ఆచెట్టు భాషిస్తే అవి 'శర్మగారూ! రండి, రండి' అని తనకు సుస్వాగతమిచ్చివుండేవి. ఒకటికాదు, రెండుకాదు మూడున్నర దశాబ్దాల జీవితాన్ని ఈ పాఠశాల ప్రాకారంలో ధార బోసుకున్న ఈ మానవుడు నేడిక్కడ కేవలం ఒక నూతన వ్యక్తిగా భావింపబడుతున్నాడు. ఆమాటకొస్తే నూతనవ్యక్తి మాత్రమేగాదు. యాచకుడు గూడా!

ఈ ఊహ తాకిడికి శర్మగారు కంపించిపోయారు. ఆ క్షణాన— యింత అవివేకంగా ప్రవర్తించిన వ్యక్తి తనేనా అన్న సందేహం కూడా కలిగిం దాయనకు! అవివేకం కాకపోతే యిదేమిటి?

ఇప్పటికి తన దీనగాథను ఒక్కరితో చెప్పుకోవడమైంది. వీధివెంట బయల్దేరితే పదిమందితో గాదు, వందమందితో చెప్పుకోవలసి వస్తుంది. వాళ్లల్లో కొందరు ఆశ్చర్యపడతారు. కొందరు నవ్వుకుంటారు. కొందరు బాహాటంగా రిక్తహస్తాలు చూపిస్తారు. ఇది తాను పువ్వులమ్మిన వూరు. ఇంతకాలం తర్వాత కట్టెలమ్ముకుంటే తననుచూచి జాలిపడేవాళ్లుగూడా వుండకపోరు. ఒక్కొక్కప్పుడు ఎదుటివాడి జాలిసైతం మనిషికి దుస్సహమైన బాధను కలిగిస్తుంది. ఇంత చేసినా తనకిక్కడ ఏమాత్రపు సహాయం లభ్యం కాగలదన్న విషయం సందేహాస్పదం!

యాచనకు పూనుకోడంవల్ల శర్మగారికి గలిగిన సద్యఃఫలితం దైన్యం. దైన్యంతో ఆయన కృంగిపోయారు. సహజమే! యాచకత్వానికి తెగబడేసరికి ముజ్జగాలకు మూలపురుషుడే వామనుడు కావలసివచ్చింది. ఇక అడిగి లేదనిపించుకొని వుంటే అతడు అంగుష్ఠమాత్ర శరీరుడై వుండేవాడు!

పాఠశాలనేగాదు, ఈ వూరినిగూడా వదిలిపెట్టి వెనుదిరిగి చూడకుండా వచ్చిన దారివెంట తిరిగి వెళ్ళిపోతే బాగుండు ననుకున్నారు శర్మగారు. కానీ మంచికో చెడ్డకో ఈ ఆలోచన ఒకటి పొడసూపిన తర్వాత పొడసూపిన ఆలోచన కార్యరూపంలోకి వచ్చిన తర్వాత యిక్కడ వెనుదీయడం కంటే వేచి చూడడమే సమంజసమనిపించింది. వసారాలో పచార్లు ప్రారంభించిన శర్మగారి మనసులో అలనాటి జ్ఞాపకాలు చెరువునీటిపైన అంతలో పైకిలేచి, యింతలో చిటిలిపోయే బుడగల్లా మెరిసిపోసాగాయి. ఇప్పుడు హెడ్మాస్టరుగారు కూర్చునేగదే ఆరోజుల్లో టీచర్సురూము. ఈ గదిలో ద్వారానికి కుడివైపున తనకోసం ప్రత్యేకింపబడిన స్థానం వుండేది. సహోపాధ్యాయులు తనను గురుతుల్యుణ్ణిగా చూచుకునేవారు. హెడ్మాస్టర్లకు అడుగడుగునా తన సలహా కావలసివచ్చేది. బడి ఆవరణలో తన నీడ పడని తావు లేదు. అదిగో, ఆ గదిలో అదేచోట నిలబడి తనెన్ని పీరియడ్లు పాఠాలు బోధించలేదు! ఈ వేదికపైన నిల్చుని ఎన్ని మార్లు క్లాసుల్లో ఉపన్యసించలేదు! తనకోసం వీడ్కోలు సమావేశం జరిగిందిగూడా యిక్కడే! ఆనాడు ఈ పాఠశాలలో ఎవరి ముఖాన చూచినా విషాదమే తాండవించింది. ఈ సమావేశ స్థలమంతా పురజనులతో కిటకిట లాడిపోయింది. ఈ విద్యాసంస్థకు తాను చేసిన సేవనుగురించి ఉగ్గడిస్తూ పలువురు ప్రసంగించారు. అందుకోసమని ఆహ్వానింపబడిన జిల్లా విద్యాశాఖాధికారిగారు తన ఛాయాచిత్రాన్ని ఆవిష్కరించారు....

శర్మగారి పాదాలు ఆయన్ని అప్రయత్నంగా హాల్లోకి తీసుకెళ్లాయి.

ఇందుకు శర్మగారిని తప్పుపట్టడం న్యాయం కాదు. ఒకవ్యక్తి ఛాయాచిత్రాన్ని ఒకసంస్థకు సంబంధించిన భవనంలో నెలకొల్పడమంటే ఏమిటి? అది అతడా సంస్థకు చేసిన సేవకు గుర్తింపు. కవి కావ్యం వ్రాస్తాడు. విశ్వానికి శ్రేయస్సును ఆపాదించడం కోసం వ్రాశానని చెబుతాడు. చెబుతూ అది ఆచంద్ర తారార్కంగా నిలిచివుండాలని ఆశిస్తాడు. అలా ఆశించడంలో—కావ్యంతోబాటు తనపేరుగూడా నిలిచివుంటుందిగనుక స్వార్థం లేకపోలేదు.

హాల్లోనుంచీ శర్మగారు ఖిన్నవదనంతో తిరిగివచ్చారు. ఆయన కక్కడ తన ఛాయాచిత్రం కనిపించలేదు!

హెడ్మాస్టరుగారు వసారాలో ఎదురయ్యారు. "అప్పుడే లేచేశారా! క్లాసుకు వెళ్ళబోతూ చూచాను. గాఢంగా నిద్రపోతున్నారు. ఇప్పుడిప్పుడే లేవరమకున్నాను. ఉండండి. కాఫీ తెప్పిస్తాను." కుర్చీలో కూర్చుంటూ ఆయన కాలింగ్‌బెల్‌ను పరామర్శించబోయారు.

అంతలో పుల్లయ్యే ప్రత్యక్ష మయ్యాడు. ''కాఫీ తెచ్చేశాను బాబూ! ఫ్లాస్కులో పోసి వుంచాను...'' అంటూ గోడకు తగిలించిన ఫ్లాస్కు తీసుకుని కాఫీని గ్లాసుల్లోకి వంచాడు.

హెడ్మాస్టరుగారు కాఫీ సేవించారు.

శర్మగారు సేవిస్తున్నారు.

''ఈ సంవత్సరం ఎండలు మరీ పట్టపగ్గాలు లేకుండా కాస్తున్నాయండీ! మధ్యాహ్న మయ్యేసరికి ఊపిరాడటంలేదంటే నమ్మండి." యథాలాపంగా ప్రారంభించారు నరహరిరావుగారు. ఎప్పుడో యాభై యేళ్ళక్రిందట ఆనాటి అవసరాలకు తగినట్టుగా నిర్మింపబడిన పాఠశాలా భవనాలు మూడింతలు నాలిగింతలుగా పెరిగిపోయిన విద్యార్థుల సంఖ్యదృష్ట్యా చాలడంలేదని చెబుతూ ప్రసంగాన్ని గ్రీష్మతాపంలోనుంచీ విషయాంతరంలోకి మార్చారు. కొత్త భవనాల నిర్మాణ ప్రయత్నంలో విరాళాలకోసం వూళ్లోకి వెళ్ళగా తమ కెదురైన అనుభవాలను వివరింపసాగారు "ఏమిటోనండీ మరి! వీళ్ళ మనస్తత్వం నా కర్థం గావడంలేదు. వీళ్ళు యిస్తారా, యివ్వరా? ఇవ్వదలుచుకుంటే ఎప్పుడిస్తారు? ఎంత యిస్తారు? గంటల తరబడీ వింటూ కూర్చున్నా సారాంశ మేమిటో బోధపడదు. ఫలిత మేమిటంటారా? ఎలా వెళ్ళినవాణ్ణి అలాగే తిరిగి వచ్చేశాను....'' కాసేపు తటపటాయించి ముందుకు వంగి అదొక

.రహస్యంలాగా చెప్పసాగారు నరహరిరావుగారు. "మీరెంతో ఆశతో యింతదూరం వచ్చారు. మీ ఆశ అడియాస కావడం నా కిష్టంలేదు. కానీ మీది ఒకటి రెండు రోజుల్లో ఒక కొలిక్కి వచ్చే పనిగాదు. వీళ్ళ చెవుల్లో యిల్లు గట్టుకుని పోరు పెట్టుకోవాలి. జోరీగలా ఎడతెగకుండా గీపెట్టాలి. అన్నట్టు మీరీవూళ్లో ఎక్కడ బసచేస్తున్నారో చెప్పారుకాదు..."

ఇంచుమించు నిర్విణ్ణులైపోయి నరహరిరావుగారికేసి చూస్తున్న శర్మగారు ఒకటిరెండు క్షణాలకుగానీ తేరుకోలేక పోయారు. తేరుకున్నతర్వాత "నేనా! ఎక్కడ బసచేస్తున్నానని అడుగుతున్నారా! ఉన్నానులెండి. ఎవరో తెలిసినవాళ్ళున్నారు" అన్నారు.

"మాటిమాటికీ మిమ్మల్ని యిక్కడికి త్రిప్పుకుంటూ శ్రమ కలిగించలేను. మీరు చిరునామా చెప్పి వెళ్ళండి. అవసరమైతే నేనే కలుసుకోగలను...."

ప్రపంచం సూర్యభగవానుడికి వీడ్కోలిస్తున్న సంధ్యా సమయం. బరువెక్కిన గుండెతో శర్మగారు గేటుదాటి రోడ్డుపైకి వచ్చారు. ఇప్పుడు తనెక్కడికి వెళ్ళాలి? ఇదీ అసలు సమస్య! ఓవైపున ఊరు. మరోవైపున ఫర్లాంగుదూరంలో రైల్వేస్టేషను. శర్మగారొకసారి వూరివైపు చూచారు. వెనుదిరిగి పాఠశాలవైపు చూచారు. కన్నీళ్ళతో తటాకాలైన కళ్ళను ఉత్తరీయంతో ఒత్తుకుంటూ మెల్లగా స్టేషనువైపు నడవసాగారు.

* * *

అంధకారాన్ని చీల్చుకుంటూ పరుగెడుతున్న రైలుకుమల్లే శర్మగారి ఆలోచనలు గతంలోకి చొచ్చుకపోతున్నాయి.

...తననిగురించి తనెంతో గొప్పగా తలపోసుకున్న రోజులున్నాయి. తలపోసుకోవచ్చు. ఎందుకంటే ఎవడి మనోరాజ్యానికి వాడే అధిపతి. అక్కడ వారి కెదురుండదు. నీమట్టుకు నువ్వు నిన్ను రాజుగా భావిస్తే ఆ భావనవల్ల యితరులకు సెగ కలగనంత వరకూ చిక్కులేదు. కానీ బాహ్యప్రపంచం సంగతి వేరు. ఇక్కడ సునిర్దిష్టమైన విలువల త్రాసులో మానవుడి హోదా తూచబడుతుంది. ఎవడి హోదాకు తగ్గట్టుగా వాడికి గౌరవాదరణలు లభ్యమౌతాయి.

త్రోవప్రక్కన ఓ చెట్టు వుంది. అది తన వెయ్యి కొమ్మలతో నీడలు వెదజల్లి పాంథులకు శ్రమాపనయం చేస్తుంది. ఐతే నీడలు వెదజల్లినంతవరకే అది చెట్టు. ఆతరువాత వంటచెరకు!

శర్మగారి వేడి నిట్టూర్పులు రైలు పరుగిడుతున్న శబ్దంలో లీనమైపోతున్నాయి.

....గడచిన క్షణాన్నిగురించి తలపెట్టక, భవిష్యత్తును లెక్కపెట్టక కేవలం వర్తమానంలోనే బ్రతికిన తనబోటివాడికి ముదిమిప్రాయంలో కష్టాలు వచ్చాయంటే యిందులో ఆశ్చర్యపడవలసిందేమీ లేదు. ఆదర్శాల పేరుతో తనకుమాలిన ధర్మానికి పూనుకొమని తనకెవరు సలహా యిచ్చారు? అది తన స్వయంకృతాపరాధం! తన బాల్యమిత్రుల్లో నీలకంఠం ఒకడు. వా డేంచేశాడు? మెల్లగా వ్యాపారం మొదలెట్టాడు. లారీలు కొన్నాడు. ఈనాడు వాడికి ఏడు లారీ లున్నాయి. రెండు మేడ లున్నాయి. మేడపైన్నుంచీ క్రిందికి దిగవలసిన అవసరం లేకుండా, ఒకవేళ దిగితే గుమ్మంలోనే కారెక్కుతూ వాడు కడుపులోని చల్ల కదలకుండా బ్రతుకుతున్నాడు. నీలకంఠందాకా ఎందుకు? అయిదు గుంటల మడిలో కూరగాయలసేద్యంతో జీవనోపాధికి మార్గం చూచుకున్న చలమయ్యగూడా తనకంటే వందరెట్లు నయం! కూరగాయల బేరంలో లాభాలు గడించి వాడు అయిదెకరాల పొలం సంపాదించాడు. ఈనాడు వాడికో యిల్లుంది. వడ్డీలకు తిరుగుతున్న మూలధనం వుంది. శేషించిన జీవితం సాఫీగా సాగిపోగలదన్న 'గ్యారంటీ' వుంది. తన కేముంది?

ఆకాశంలో చుక్కలు మినుకు మినుకు మంటున్నాయి. చిట్టడివిపైన్నుంచీ చలిగాలి రివ్వు రివ్వున లోపలికి వీస్తోంది. శర్మగారు కిటికీ తలుపు వేసేశారు. చేసంచీలోనుంచీ దుప్పటి తీసి ఒంటి నిండుకూ కప్పుకున్నారు.

ఆవులింతల నీరాజనాలతో ప్రయాణీకు లందరూ నిద్రాదేవతకు స్వాగత మిస్తున్న ఆ రైలుపెట్టెలో శర్మగారు మాత్రం ఎంతసేపని మేలుకుని వుండగలరు? కూర్చునే ఓపిక హరించిపోతుండగా, కనురెప్పలు బరువెక్కి మూతలు పడిపోతుండగా శర్మగారుసైతం సీటు పైకి వ్రాలిపోయి నిద్రాదేవత కౌగిట్లోకి జారిపోయాడు.

"ఏమండీ! మిమ్మల్నే! టిక్కెట్టేదీ? టిక్కెట్టు?"

శర్మగారు ఉలికిపడి లేచి కూర్చున్నారు. ఎట్టఎదుట తెల్లటి దుస్తులపైన నల్లటి టోపీతో అగ్గిపుల్లలాంటి టికెట్ కలెక్టరు నిలబడి వున్నాడు.

శర్మగారి చేతులు చేతి సంచీకోసం సీటుపైన వెదికాయి. ఆయన కంగారుగా లేచి నిల్చున్నారు. సీటుక్రింద చూచారు. సామాను లుంచుకునే చెక్కపైన చూచారు. ఏదీ! సంచీ కనిపించ

ఠంలేదు. హఠాత్తుగా గుండె ఆగిపోయినట్లై శర్మగారు మ్రాన్పడి పోయారు.

"చెప్పండి. తటపటాయించడ మెందుకు? మీ సామాను లేవో పోయాయి గదూ?"

"నిజమే నాయనా! చేతిసంచీ పోయినట్టుంది...."

"నాకు తెలుసు. ఇలాంటి జవాబు వినవలసి రావడం నాకు మామూలే!"

శర్మగారు తెల్లబోయారు. "అదేమిటయ్యా! నేను టిక్కెట్టు కొనకుండా ప్రయాణంచేసే వాడిలా కనిస్తున్నానా నీకు?"

టికెట్ కలెక్టరు పక్కున నవ్వేశాడు. ఆ నవ్వులో జాలిలేదు. భాషలోకి అనువదిస్తే ఆ నవ్వులోని భావం యిది - చేతిలో టిక్కెట్టు లేకపోయిన తర్వాత ఎన్ని సంజాయిషీలైనా నిరుపయోగం!

"ఇప్పుడు రెండంటే రెండు పద్ధతులు మాత్రమే వున్నాయి. ఎక్సెస్ చెల్లిస్తే మీరిలాగే ప్రయాణం చేయవచ్చు. లేదా ప్రక్క స్టేషనులో దిగేయవలసి వుంటుంది...." టికెట్ కలెక్టరు తన నిర్ణయాన్ని కచ్చితంగా తెలియజేశాడు.

"రాబోతున్న స్టేషను ఏదండీ?" ఎవరోగానీ మిక్కిలి కుతూహలంతో ప్రశ్నించారు.

మరొక రెవరో జవాబుగూడా చెప్పేశారు. "రాబోతున్నది తుమ్మలకోన. నట్టడవిలో స్టేషను. చుట్టూరా మూడు నాలుగు మైళ్ళ దాకా నరమానవుడి కొంప కనిపించదు. ముసలాయన్ను అక్కడ దిగబెడితే కష్టమే! మంచినీళ్ళు దొరకవు. పైగా మళ్ళీ సాయంకాలం ఆరింటికిగానీ బండిగూడా లేదు!"

"నన్నేం చేయమంటారు! నా డ్యూటీ నేను నిర్వర్తించక తప్పదు" అన్నాడు టికెట్ కలెక్టరు.

ప్రాధేయపడి టికెట్ కలెక్టరు హృదయంలో నిద్రబోతున్న దయాదాక్షిణ్యాలను మేల్కొలుప దలచుకోలేదు శర్మగారు.

అందువల్ల తన దురవస్థను మరింత బాహాటంగా వెల్లడి చేసుకోవలసి వస్తుంది. మానవులందరూ దేశకాల పరిస్థితుల చేతుల్లో కీలుబొమ్మలు. ఎవడి ధోరణి వాడిది. ఎదుటివాడి పరిస్థితిని అర్థం చేసుకునే ఓపిక ఎవడికీ లేదు. ఎందుకూ! ఒకరి సానుభూతి తన కనవసరం! 'భగవంతుడు నుదుట ఎన్ని కష్టాలనైతే వ్రాసిపెట్టాడో, అన్నింటికీ నోరు మూసుకుని తల ఒగ్గడమే ఉత్తమం....

శర్మగారు మనసును రాయి చేసుకున్నారు.

స్టేషనులో రైలాగేసరికి తుమ్మలకోనలో యింకా తెల్లవారలేదు. గుట్టలూ మిట్టలూ చెట్టు చేమలూ అన్నీ చీకటి దుబ్బుల్లా కనిపిస్తున్నాయి. చల్లటి గాలి ఈతముల్లులా శరీరానికి గుచ్చుకుంటోంది. అలికిడిలేని అడివిలో గుడ్డిదీపం ఒకటి వెలుగుతున్న స్టేషను వసారాలో నిల్చున్నారు శర్మగారు.

"ఇదిగోనండీ! తెల్లవారకముందే ఈయన దొరికాడు నాకు! దొరకడం నాకైనా ఈయనగారితో వ్యవహరించే వంతు మీది!" అంటూ యింజను డ్రయివరుతో మాట్లాడి తిరిగి వస్తున్న స్టేషను మాష్టరుగారికి శర్మగారిని ఒప్పగించి టికెట్ కలెక్టరు కదులుతున్న రైల్లోకి దూసుకున్నాడు.

స్టేషనుమాష్టరు నడితరం మనిషి. కళ్ళజోడు సవరించుకుంటూ వసారాలో కాలుబెట్టాడు. శర్మగారిని ఆపాదమస్తకం పరీక్షిస్తున్నట్టుగా చూచాడు. "అదేమిటయ్యా! ఎన్నేళ్ళొచ్చాయి నీకు? టిక్కెట్టు లేకుండా రైలెక్కగూడదని తెలియదూ? అంటూ గాజుతలుపు తెరచి దీపాన్ని హెచ్చించాడు.

తొలగిపోతున్న చీకటిలో, వ్యాపిస్తున్న అరుణకాంతిలో, బాగా హెచ్చి వెలుగులు పుంజుకున్న దీపకాంతిలో కెరటాలు కెరటాలుగా వచ్చి తనను ముంచివేస్తున్న ఆశ్చర్యంలో దిగ్భ్రాంత చేతస్కుడై శర్మగారికేసి చూడసాగాడు స్టేషను మాష్టరు. ఆఖరుకు ఆశ్చర్యం వీగిపోయింది, ఆనందమే జయించింది. "మేష్టరుగారూ! మీరేనా మేష్టరుగారూ! ఎంత కాలానికి కనిపించారు! ఇక్కడ ఈ పరిస్థితిలోనా మీరు కనిపించడం! మన్నించండి మేష్టరుగారూ! చీకట్లో పోల్చుకోలేక పోయాను...."

"ఎవరు నాయనా నువ్వు?" శర్మగారు విస్మయంతో ప్రశ్నించారు.

"తెలియడం లేదా మేష్టారుగారూ! నేనే గోపాలాన్ని! జ్ఞప్తికి రావడంలేదూ మీకు? గేమ్సురూమ్ వెనుక నిల్చుని సిగరెట్టు కాల్చుతున్నాను.మీరు చూచారు. చెంపవాచిపోయేటట్టుగా కొట్టారు. రెండు రోజుల పొద్దుగునా బెంచీపైన నిల్చోబెట్టారు. ఇకపైన యిలాటి పని చేయనని పుస్తకం చేతిలోపెట్టి సరస్వతిపైన ప్రమాణం తీసుకున్నారు. మరచిపోయారా మేష్టరుగారూ! మీరు

నాటిన వృక్షాన్ని ! మీరు పెట్టిన దీపాన్ని ! మీ ప్రియశిష్యుణ్ణి !..."

"నువ్వుట్రా గోపాలం ! అంతా భగవంతుడి దయ. నేను చేసిందేముంది ?" అన్నారు శర్మగారు.

గోపాలం శర్మగారిని యింటికి తీసుకెళ్ళాడు. తలుపును అదరగొట్టి భార్యను నిద్రలేపాడు. "చూడు సావిత్రీ ! మా మేష్టరు గారొచ్చారు. పితృదేవతలు, పర్వదినాలు, శుభవార్తలు అన్నీ కలిసివచ్చినట్టుగా మా మేష్టరుగా రొచ్చేశారు" అన్నాడు.

రైల్వేక్వార్టర్స్‌లో పడకకుర్చీలో కూర్చుని సూర్యోదయాన్ని తిలకిస్తున్నారు శర్మగారు. రంగసముద్రంలో లభ్యంకాని ఆతిథ్యం తనకు తుమ్మలకోనలో లభ్యంకావడం ఎంత ఆశ్చర్యకరమైన విషయం ! కానైతే ఆశ్చర్యానికి మూలకారణం అజ్ఞానమే నేమో ! నిజానికిందులో ఆశ్చర్యపడవలసిన అవసరమేమీ లేదని పిస్తుంది: దేశమంటే మట్టికాదనీ, మానవులనీ వివరించాడు కవి. అలాగే పాఠశాల అనగా యిటుకలతోనూ, సిమెంటుతోనూ రూపొందిన భవనాల సమూహంకాదు. పాఠశాల అనగా విద్యార్థులు. సుక్షేత్రంలోపడిన బీజంలా, శుక్తిలోపడిన స్వాతిచినుకులా విద్యార్థులపైన వెచ్చించిన శ్రమ చరితార్థంకాక తప్పదు. కోట్ల కొలది మానవుల్లో ఉపాధ్యాయుడుగూడా ఒక్కడు. కానీ అతని దొక మహోద్యమం. లేలేత యెదదలలో విజ్ఞాన జ్యోత్స్నలను విరియించి భావికి బంగారుబాటలు తీర్చిదిద్దే ఉపాధ్యాయుడు తానొక అఖండజ్యోతి లాంటివాడు. ప్రకాశంలో తగ్గుదల ఏర్పడకుండా జ్యోతి తనలాంటి జ్యోతుల నెన్నింటినైనా సృష్టింపగలదు. మర్యాదలూ, సన్మానాలు, ఆర్థికవిజయాలు జీవిత సార్థక్యతను నిర్ణయించే కొలబద్దలు గావు. అవి పైపై మెరుగులు. ఛాయాచిత్రాల మాటకేమి ! అవి ఆవిష్కరింపబడవచ్చు. కాలక్రమాన బహిష్కరింపబడనూవచ్చు. కానీ మనోఫలకాలపైన గాఢంగా హత్తుకపోయిన ప్రతిబింబాన్ని మాత్రం ఎవ్వరూ చెరిపివేయలేరు....

* * *

శర్మగారు స్వస్థలానికి తిరిగివెళ్ళగానే మన వరాల్ని పిలిచాడు. దగ్గరగా కూర్చోబెట్టుకుని ముంగురుల్ని సవరిస్తూ "చూడుతల్లీ ! నీకిప్పుడు పదిహేడేళ్ళు. నీ పెళ్ళికిప్పుడు మించిపోయిందేమీ లేదు. ఇంత చిన్నవయస్సులో నువ్వు సంసారభారాన్ని మోయలేవు. ఈ రోజే నేను అప్లికేషనువ్రాసి పడేస్తున్నాను. నువ్వు ట్రెయినింగుస్కూల్లో చేరు. పిల్లలు భగవత్స్వరూపులు. వాళ్ళ మధ్యనవుండటమంటే భగవత్సన్నిధానంలో వున్నట్టు. అంతకంటే ఆనందకరమైన వ్యాసంగం మరొకటిలేదు" అన్నారు.

---

# కర్నూలు జిల్లాలో పొదుపు ఉద్యమ ప్రగతి

జాతీయ పొదుపు పథకానికి పెట్టుబడుల సహాయార్థం కర్నూలు జిల్లా ఆదోనిలో 1961 మార్చి నెల 27 వ తేదిన "కురుక్షేత్రం" నాటక ప్రదర్శం జరిగింది. శ్రీ కె. రఘురామయ్య తదితర ప్రఖ్యాత ఆంధ్ర నటీనటులు ప్రదర్శించిన యీ నాటకానికి ౧౫ వేలమందికి పైగా ప్రేక్షకులు హాజరైనారు. నాటక ప్రదర్శనకు ఇంతమంది ప్రేక్షకులు రావడం యీ ప్రాంతంలో మున్నెన్నడూ జరగలేదు. ఆంధ్రప్రదేశ్ జాతీయ పొదుపు ఉద్యమ సంస్థ డైరెక్టరు యీ కార్యక్రమానికి అధ్యక్షత వహించారు. కడచిన వారం రోజులలో 15.5 లక్షల మొత్తం డిపాజిటు చేయబడ్డట్లు ఈ సందర్భంలో వెల్లడించబడినది. కర్నూలు జిల్లా కలెక్టర్ మాట్లాడుతూ జిల్లాలో కొన్ని ప్రాంతాలలో క్షామ పరిస్థితి ఏర్పడినప్పటికి పంచాయతీ సమితుల అధ్యక్షులు. ఇంకా ఇతర స్థానిక నాయకులు పొదుపు పథకానికి పెట్టుబడులను అధికంగా సేకరించడంలో పూర్తిగా సహకరించారని అన్నారు. ఆదోని పురపాలక సంఘం అధ్యక్షుడు శ్రీ ఆర్. సుబ్బయ్య ఉపన్యసిస్తూ ప్రభుత్వంలో సహకరించడంతో తాము ఎంత మాత్రం వెనుదీయమని అన్నారు. తమ జిల్లాలో ఏదైన పరిశ్రమలను స్థాపించాలని ఆయన విజ్ఞప్తిచేశారు. పొదుపు ఉద్యమ సంస్థ డైరెక్టరు ప్రసంగిస్తూ పొదుపు పథకానికి వసూలయ్యే పెట్టుబడులన్నీ కూడా దేశంలో సంక్షేమ పథకాలను అమలు పరచడానికి వెచ్చించబడతాయనీ, కాబట్టి పెట్టుబడి దార్లు నిజంగా నవభారత నిర్మాణంలో భాగస్వాములని అన్నారు.

# ఆంధ్రప్రదేశ్ సంక్షేమనిధి

ఆంధ్రప్రదేశ్ సంక్షేమనిధి అనేది ఒక సాంఘిక సంస్థ. దీనికి కార్య నిర్వాహక సంఘం వుంది. నిర్మాణం క్రింది విధంగా వుంటుంది.

*ప్రధాన పోషకులు*

ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ భీమసేన్ సచార్.

*పోషకులు*

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి.

శాసనసభ ప్రతిపక్ష నాయకుడు.

భారత సాంఘిక సేవా సమ్మేళనం

ఆంధ్రప్రదేశ్ బ్రాంచి అధ్యక్షుడు, హైదరాబాదు.

*అధ్యక్షుడు*

రాష్ట్ర ఆరోగ్యమంత్రి.

*ఉపాధ్యక్షులు*

రాష్ట్ర విద్యాశాఖ మంత్రి

రాష్ట్ర సాంఘిక సంక్షేమ మంత్రి

రాష్ట్ర స్థానిక పరిపాలన మంత్రి

*ఆర్థిక ఉపసంఘం అధ్యక్షురాలు*

రాష్ట్ర సాంఘిక సంక్షేమశాఖా మంత్రిణి, శ్రీమతి మాసూమా బేగం.

*ప్రచార ఉపసంఘం అధ్యక్షుడు*

రాష్ట్ర ప్రణాళికలు, సమాచారశాఖామంత్రి శ్రీ పిడతల రంగారెడ్డి.

*అదనపు ఉపాధ్యక్షుడు*

శ్రీ బి. పి. శేషారెడ్డి, శాసన సభ్యుడు.

*ఆర్థిక ఉపసంఘం ఉపాధ్యక్షుడు*

రాష్ట్రవైద్యశాఖ డైరెక్టర్ డాక్టర్ కె. యస్. రావు.

*గౌరవ కార్యదర్శి*

శ్రీ జానకీ పర్షాద్

*గౌరవ కోశాధికారి*

శ్రీ డి. యస్. శర్మ.

దిగువ పేర్కొన్న ముగ్గురితోసహా గవర్నరు (ప్రధాన పోషకుడు) 20 మంది సభ్యులను నామినేటు చేస్తారు. వీరి పదవీకాల పరిమితి మూడు సంవత్సరాలు.

ప్రభుత్వ కార్యదర్శి, ఆరోగ్యశాఖ

ప్రభుత్వ కార్యదర్శి, స్థానిక పరిపాలనాశాఖ.

ప్రభుత్వ కార్యదర్శి, సాంఘిక సంక్షేమశాఖ.

*ఈనిధి ముఖ్యోద్దేశాలు*

1. సంక్షేమ పథకాలకు, సాంఘిక, సాంస్కృతిక, విద్యా పథకాలకు, వైద్య సౌకర్యాల కల్పనకు, ఆసుపత్రులకు, రక్షణ గృహాలకు, బాలల విహారాలకు, ఇంకా ఇలాంటి ప్రాజెక్టుల అమలుకు డబ్బు వసూళ్లు.

2. పైన చెప్పిన ప్రయోజనాలకు 'నిధి'ని వినియోగించడం.

ఇది రాష్ట్ర వ్యాప్తంగా యేర్పరచిన సంస్థ. జిల్లా స్థాయిలో జిల్లా సంఘాలు పనిచేస్తాయి. వాటికి కలెక్టర్లు ఎక్స్-అఫీషియో అధ్యక్షులుగానూ, జిల్లా వైద్యశాఖాధికారి ఎక్స్ – అఫీషియో కార్యదర్శి గానూ జిల్లాపరిషత్తు అధ్యక్షులు, పురపాలక సంఘాల అధ్యక్షులు, ఇతర స్థానిక ప్రముఖులు సభ్యులుగానూ వుంటారు.

ఈ సంస్థ సేవకు గుంటూరు జిల్లా మంగళగిరి క్షయ ఆసుపత్రి, కర్నూలు ప్రభుత్వ జనరల్ ఆసుపత్రిలోని ఒక క్షయ రోగుల వార్డు, తార్కాణాలు. ఈ రెంటికి ఒక్కొక్క దానికి ఒక లక్ష రూపాయలచొప్పున నిధినుండి విరాళం ఇవ్వటం జరిగింది. ఇదిగాక, పశ్చిమ గోదావరిజిల్లా తాడేపల్లి గూడెంలో ఇలాంటి ప్రాజెక్టుకి మరో లక్షరూపాయలు ఇవ్వబడినది.

సాంఘిక సేవ నిమిత్తం ఏటా ఒక రాఫిల్‌ను నడపటానికి ప్రభుత్వం అనుమతినిచ్చింది. రు. 6 లక్షలకు యీ రాఫిల్ ప్రస్తుతం యేర్పాటు జేయబడుతోంది. 1961 మే ఆఖరుకు రాఫిల్ అయిపోతుంది. రాఫిల్ వల్ల వచ్చిన లాభాలు గ్రామం మొదలుకుని పట్టణంవరకు, గ్రంథాలయం మొదలుకుని ఆసుపత్రి వరకు, అన్ని స్థలాలలో సంక్షేమ కార్య కలాపాలన్నింటికి వినియోగించ బడుతాయి.

అంతటి విశాలమయిన లక్ష్యాలతో, సాంఘిక, సాంస్కృతిక, వినోద కార్య కలాపాలన్నింటికీ వర్తించే యీనిధికి సువ్యవస్థిత మయిన ఒక నూతన యంత్రాంగం అమరివుంది. అనేక సాంఘిక సంక్షేమ సంస్థలను సృష్టించి, వివిధ రకాలుగా తోడ్పడుతుంది యీనిధి.



# సంగ్రహ ప్రకటనలు

## సెంట్రల్ బ్యాంకులకు పూర్తి గ్రాంట్లు

తెలంగాణా ప్రాంతంలోని పది సెంట్రల్ బ్యాంకులకూ, ఆంధ్రప్రాంతంలోని కడపజిల్లా సహకార సెంట్రల్ బ్యాంకుకు పూర్తి గ్రాంట్లుగా మొత్తం రు. 12.19 లక్షలను ప్రభుత్వం మంజూరు చేసింది. ఈ గ్రాంట్లు క్రింద పేర్కొన్న వాటికి కొన్ని షరతులపై వాటి అక్రమ రుణాలు తీర్చుకోటానికై మంజూరు చేయబడినాయి.

1959 ఏప్రిల్‌లో రిజర్వుబ్యాంక్ డిప్యూటీ గవర్నరు ఆంధ్ర ప్రదేశ్‌లో పర్యటించినపుడు ఇతర సూచనలతోపాటు యీ బ్యాంకులకు సంబంధించి కొన్ని సూచనలు చేశారు. తెలంగాణా లోని సెంట్రల్ బ్యాంకులు విపరీతమయిన అక్రమ రుణాలకు గురయివుండటంవల్ల రిజర్వుబ్యాంకు నుంచి అవి వాటా పెట్టు బడి ధనం, ఇతర నిధులు పొందలేకపోతున్నాయని, అందుచేత ఆరుణాలు తొలగిపోయి, అవి మరల సక్రమమయిన పద్ధతిలో పనిచేయడానికి అవసరమయిన కనీస సహాయం, పూర్తిగ్రాంట్ల రూపంలో రాష్ట్రప్రభుత్వం ఇవ్వాలని ఆయన సూచించారు. కడపజిల్లా సహకార సెంట్రల్‌బ్యాంక్ పరిస్థితికూడా అదే రకంగా వున్నందున దానికికూడా ఇవ్వవలసిందని సూచన చేయబడింది.

*గ్రాంట్లు క్రింది బ్యాంకులకు మంజూరు చేయబడినవి*

| | | |
|---|---|---|
| 1. | హైదరాబాదుజిల్లా సహకార సెంట్రల్ బ్యాంక్ లిమిటెడ్ | 1.48 లక్షలు |
| 2. | కరీంనగరంజిల్లా సహకార సెంట్రల్ ,, ,, | 1 95 ,, |
| 3. | నల్గొండ సహకార సెంట్రల్ ,, ,, | 0.75 ,, |
| 4. | మెదక్‌జిల్లా సహకార సెంట్రల్ ,, ,, | 2.04 ,, |
| 5. | ఆదిలాబాదుజిల్లా కేంద్ర సహకార బ్యాంకు ,, | 1.00 ,, |
| 6. | భువనగిరి సహకార సెంట్రల్ బ్యాంకు లిమిటెడ్ | 0.50 ,, |
| 7. | వరంగల్‌జిల్లా సహకార సెంట్రల్ ,, ,, | 1.39 ,, |
| 8. | ఖమ్మంజిల్లా సహకార సెంట్రల్ ,, ,, | 0.08 ,, |
| 9. | నిజామాబాదుజిల్లా సహకార సెంట్రల్ ,, ,, | 0.20 ,, |
| 10. | మహబూబ్‌నగరంజిల్లా సహకార సెంట్రల్ .. ,, | 1.55 ,, |
| 11. | కడపజిల్లా సహకార సెంట్రల్ ,, ,, (ఆంధ్ర ప్రాంతం) | 3.25 ,, |
| | మొత్తం | 12.19 |

## విశాఖపట్నం నీటి సరఫరా పథకం

విశాఖపట్నం విస్తృత నీటిసరఫరా అభివృద్ధి (తాటిపూడి రిజర్వాయరు) పథకానికి, రాష్ట్రప్రభుత్వం, పరిపాలనా సంబంధమైన మంజూరీ ఇచ్చింది. ఈ పథకం అంచనావ్యయం రు. 4 కోట్లు, ఈ వ్యయంలో రు. 2 కోట్లను, మునిసిపాలిటీకి ప్రభుత్వం ప్రణాళికా కేటాయింపులలో నుంచి ఋణంగా మంజూరు చేస్తుంది. మిగతా రు. 2 కోట్లను మునిసిపాలిటీ ప్రజలవద్దనుంచి అప్పులు తీసుకుంటుంది.

## ఆంధ్రప్రదేశ్ ప్రాంతీయ సంఘం సమావేశం

ఆంధ్రప్రదేశ్ ప్రాంతీయసంఘం సమావేశాలు గత నెల 4,5 వ తేదీలలో సంఘం అధ్యక్షుడు శ్రీ కె. అచ్యుతరెడ్డి అధ్యక్షతన జరిగినది. రాష్ట్ర శాసనసభచే యీ సంఘానికి నివేదింపబడిన దిగువ పేర్కొన్న బిల్లులను పరిశీలించి ఆరు వారాల లోపుగా వాటిపై నివేదికలను సిద్ధంచేసి సంఘానికి సమర్పించే నిమిత్తం ఆయాసంఘాలకు పంపించడానికి యీ సమావేశాలలో నిశ్చయించబడినది.

1. 1959 ఆంధ్ర సహకార కేంద్ర భూమి బ్యాంకు (పునర్వ్యవస్థీకరణ) బిల్లు.

2. 1960 ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితులు, జిల్లా పరిషత్తుల (సవరణ) బిల్లు.

3. 1960 ఆంధ్ర మురికిపేటల అభివృద్ధి (భూముల స్వాధీనం) ఆంధ్రప్రదేశ్ విస్తరణ బిల్లు.

రాష్ట్ర శాసన సభచే నివేదింపబడిన 1960 హైదరాబాదు మునిసిపల్ కార్పొరేషన్లు, హైదరాబాదు మునిసిపాలిటీ (ఆంధ్రప్రదేశ్ సవరణ) బిల్లును ప్రాంతీయ సంఘంవారు యీ సమావేశాలలో పరిశీలించి ఏకగ్రీవంగా ఆమోదించారు.

*వీరు దిగువ తెలిపిన నివేదికలనుకూడా పరిశీలించి యథాతథంగా అమోదించారు*

1. విద్యా విషయాలకు సంబంధించిన, "సాంకేతిక విద్యా సంస్థలలో సీట్ల కేటాయింపు" అనే అంశం పై సమర్పించిన ఆరవ నివేదిక.

2. పై ఉపసంఘం "విద్యా సంస్థలలో ప్రవేశ నిబంధనలు" అనే విషయం పై సమర్పించిన ఏడవ నివేదిక.

3. అభివృద్ధి విషయాలకు సంబంధించిన ఉపసంఘం నేటి వనరులు సౌకర్యాలు, తృతీయ ప్రణాళిక ముసాయిదాపై సమర్పించిన నాల్గవ నివేదిక.

4. ఇదే ఉపసంఘం, విద్యుచ్ఛక్తి సౌకర్యాలు తృతీయ ప్రణాళిక ముసాయిదా పై సమర్పించిన ఆరవ నివేదిక.

ప్రభుత్వం విడుదల చేసిన శ్వేతపత్రం పైనివేదికను సమర్పించడాని గాను ఈ సంఘంచే లోగడ నియమించబడిన ఉప సంఘం తన నివేదికను సమర్పించడానికి గడువును మరో 3 నెలల వరకు పొడిగిస్తూ ,యీ సమావేశాలలో తీర్మానించబడినది. సంఘం మరుసటి సమావేశం నాటికి నివేదికను సిద్ధం చేయ వలసిందిగా యీ ఉపసంఘాన్ని కోరడమైనది. వచ్చే సమావేశం బహుశా మే 15న జరుగుతుంది.

*1961–62 వ ఆర్థిక సంవత్సరానికై దిగువ ఉపసంఘాలు పునర్నిర్మించబడినాయి*

1. స్థానిక పరిపాలన, ప్రజారోగ్య విషయాలకు సంబంధించిన ఉప సంఘం.

2. విద్యా విషయాలకు సంబంధించిన ఉపసంఘం,

3. అభివృద్ధి విషయాలకు సంబంధించిన ఉప సంఘం.

## అడవులు కౌలుకివ్వకూడదని ప్రభుత్వం నిర్ణయం

జీడి, ఇతర తోటలు పెంచడానికి అడవి భూములను కౌలుకిమ్మని అనేక దరఖాస్తులు ప్రభుత్వానికి వస్తున్నాయి. ఈ విషయాన్ని ప్రభుత్వం పూర్తిగా పరిశీలించిన మీదట, అడవులను కౌలుకివ్వకుండా, అటవీశాఖ పరంగానే ఏవయినా చెట్లు పెంచాలని నిర్ణయించింది. అటవీ శాఖకు పనికిరాకుండా వుండే భూమికూడా కౌలుకిస్తే ముందుముందు ఏదో ఒక రకమయిన పేచీలు వస్తుంటాయనే తలంపుతో దాన్ని పూర్తిగా ఎవరికయినా వదిలివేయటమే మంచిదని నిశ్చయించింది.

*మహిళా సంక్షేమ పథకాలు*

తృతీయ ప్రణాళికా కాలంలో మహిళా సంక్షేమ శాఖ అమలుజరిపే పథకాలలో నూటికి 15 వంతుల పథకాలను హరిజన సంక్షేమానికి కేటాయించాలని 1960 ఆగష్టు నెలలో జారీ అయిన ఒక ప్రభుత్వ ఉత్తర్వులో పేర్కొనబడినది. తృతీయ ప్రణాళికా కాలంలో వెచ్చించ నుద్దేశించిన రు. 41.71 లక్షలలో రు. 6 లక్షలు కేవలం నిమ్నజాతుల ప్రయోజనార్థం తలపెట్టిన పథకాలకు ప్రత్యేకింప బడినవి. మిగిలిన మొత్తం ఇతర పథ

కాలకు ఖర్చు పెట్టబడుతుంది. ఈ రు. 6 లక్షలు, ప్రణాళికా కేటాయింపులో 6 శాతం అవుతుంది. కాబట్టి ఇప్పుడు హరిజనుల కొరకు ప్రణాళికా కేటాయింపులో 15 శాతం మొత్తాన్ని ప్రత్యేకించ నవసరంలేదని తలంచబడినది. కనుక 1960 ఆగస్టులో జారీ అయిన ఉత్తర్వులు రద్దు పరచబడినాయి.

## చిత్తూరు జిల్లాలో సహాయక చర్యలు

అననుకూల వాతావరణ పరిస్థితుల మూలంగా చిత్తూరు జిల్లా గ్రామాలలో దెబ్బతిన్న మెట్టభూములపై 1370 వ ఫసలీకి శిస్తు రెమిషను ఇస్తూ ప్రభుత్వం ఆదేశించింది.

నాలుగణాలు అంతకంటె తక్కువ వంతున పండిన పంటకు పూర్తి రెమిషనూ, నాలుగు అణాలకంటె ఎక్కువ. ఆరణాల కంటె తక్కువ వంతున పండిన పంటకు సగం రెమిషను వర్తిస్తుంది.

అంతేగాకుండా పరిస్థితినిబట్టి భూమిశిస్తు పాతబాకీలను, వాయిదాలమీద చెల్లించే ఋణాలను ఒక సంవత్సరం పాటు కలెక్టరు నిర్ణయంపై దెబ్బతిన్న ప్రాంతాలలో వాయిదా వేయమనికూడా ప్రభుత్వం ఆదేశించింది.

## వాణిజ్య పన్నుల నిబంధనావళి

వాణిజ్య పన్నుల చట్టాలు, నిబంధనావళి, ప్రకటనలు వాటి సవరణలు మొదలైనవాటి ప్రతులను వర్తకులకు సక్రీతధరకు సరఫరాచేసే పథకాన్ని ఏప్రిల్ 15 తేదీ లగాయతు మరో సంవత్సరంపాటు కొనసాగించడానికి ప్రభుత్వం నిశ్చయించింది. కాబట్టి వర్తకులు సచివాలయంలోని రెవెన్యూశాఖలో 1961-62వ సంవత్సరానికి తమ పేరును రిజిస్టరుచేయించుకోవాలి లేదా రెజిస్ట్రీషను సర్టిఫికెటు గడువును పొడిగింపజేసుకోవాలి. అందుకు వారు, హైద్రాబాదులోని . రెవెన్యూశాఖ కార్యదర్శికి ఒక దరఖాస్తునూ, దానివెంట దరఖాస్తు ఫీజు చెల్లించి తీసుకున్న చలానులను దాఖలుచేయాలి. దరఖాస్తు "XII-ఎ. సేల్సాటాక్స్ — జనరల్ సేల్స్‌టాక్స్ — మిసెలేనియస్" అనే పద్దుకు జమకట్టాలి.

## ఇంజనీరింగు డిప్లొమాలకు పరిగణన

రాష్ట్ర ప్రభుత్వపు ఉద్యోగాలలో నియామకం నిమిత్తమై, మైసూరు రాష్ట్రానికి చెందిన సాంకేతిక పరీక్షల కేంద్రబోర్డు, బెంగుళూరు ఇచ్చిన క్రింది డిప్లొమాలకు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సాంకేతిక విద్య, శిక్షణ బోర్డు ఇచ్చిన డిప్లొమాలతో సమానంగా పరిగణిస్తూ ప్రభుత్వ ఆదేశాలను జారీచేసింది :—

| బెంగుళూరులో మైసూరు సాంకేతిక పరీక్షల కేంద్రబోర్డు ఇచ్చిన డిప్లొమాలు | ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సాంకేతిక విద్య, శిక్షణ బోర్డు, హైద్రాబాదు ఇచ్చిన డిప్లొమాలు |
|---|---|
| 1. సివిల్ ఇంజనీరింగు - (జనరల్)లో డిప్లొమా | 1. సివిల్ ఇంజనీరింగులో డిప్లొమా (ఎల్. సి. ఇ) |
| 2. ఎలక్ట్రికల్ ఇంజనీరింగులో డిప్లొమా | 2. ఎలక్ట్రికల్ ఇంజనీరింగులో డిప్లొమా (ఎల్.ఇ.ఇ.) |
| 3. మెకానికల్ ఇంజనీరింగు (జనరల్)లో డిప్లొమా | 3. మెకానికల్ ఇంజనీరింగులో డిప్లొమా (ఎల్. ఎం. ఇ.) |
| 4. ఆటోమోబైల్ ఇంజనీరింగులో డిప్లొమా | 4. ఆటోమొబైల్ ఇంజనీరింగులో డిప్లొమా (ఎల్. ఎ. ఇ) |
| 5. రేడియో ఇంజనీరింగులో డిప్లొమా | 5. రేడియో ఇంజనీరింగులో డిప్లొమా (ఎల్.ఆర్.ఇ.) |
| 6, మైనింగ్ ఇంజనీరింగులో డిప్లొమా | 6. మైనింగ్ ఇంజనీరింగులో డిప్లొమా (ఎల్. మైనింగ్. ఇ) |
| 7. సెరమిక్స్‌లో డిప్లొమా | 7. సెరమిక్స్‌లో డిప్లొమా (పాటరీలు, రిఫ్రాక్టరీలు) |
|  | 8. సెరమిక్స్‌లో డిప్లొమా (గ్లాస్, ఇనామిక్.) |

## పాస్‌పోర్టు పొందే విధానంలో మరికొంత సడలింపు

ఇప్పుడున్న పద్ధతిప్రకార పాస్‌పోర్టులున్న వాళ్లు తమ పాస్‌పోర్టులను, వాటి కాలపరిమితి ఇంకా మూడు నెలలకు ముగుస్తుందన్న నాటి నుంచిగానీ, ముగిసిన తరువాత ఒక నెలలోగా గానీ మరల పొడిగింపు చేసుకోవచ్చు. ఈ పద్ధతి నివారించదగినటువంటి ఇబ్బందులనే కలుగజేస్తున్నదనే భావంతో, పాస్‌పోర్టుల కాల పరిమితి ముగిశాక వాటి చలామణి కాలంలో (అంటే 1-6-1961 తరువాత జారిచేసిన వాటికి ఆరేండ్లు ఆ తరువాత జారిచేసిన వాటికి ఎనిమిదేండ్లు) ఎప్పుడైనా నిర్ణీత రుసుము చెల్లించి పొడిగింప చేసుకోవచ్చని నిర్ణయం చైకొనబడింది.

పాసు పోర్టులున్న వారి ప్రయోజనం దృష్ట్యా నే, త్వరలో ఎక్కడయినా వెళ్లామని నిర్ణయించుకుంటే తప్ప వాటిని పొడిగింపు చేసుకోవలదని సూచించబడింది. ఈ ప్రకటన భారత దేశంలోని భారతీయ పాస్ పోర్టులున్న వారికే వర్తిస్తుంది.

కోరిన వారంలోగా వాటిని పునరుద్ధరించమనీ, మరీ అత్యవసర పరిస్థితులలో అయితే ఒక్క రోజులోనే పని పూర్తి చేయమని ప్రాంతీయ పాస్ పోర్టు అధికారులకు ఆదేశాలు ఇవ్వటం జరిగింది.

## 'కొత్త నందికొండ'

నాగార్జునసాగర్ రిజర్వాయరు క్రింద నందికొండ గ్రామం మునిగిపోతుంది కనుక ఆ గ్రామవాసులు నల్గొండ జిల్లా మిర్యాలగూడ తాలూకాలోని అడవిదేవలపల్లికి చేరువగా ఒక పునరావాస కేంద్రం ఏర్పరుచుకున్నారు. ఈ కేంద్రాన్ని ఇక నుంచి 'కొత్తనందికొండ' అని పిలువడానికి ప్రభుత్వం ఉత్తర్వు నిచ్చింది.

## కొత్త సంవత్సరానికి లైసెన్సులు

సైకిలు, రిక్షాలు, టాంగాలు, ఎద్దుబండ్లు మొదలయిన వాటికి, డ్రైవింగుకూ 1961-62 సంవత్సర్గం లైసెన్సులు ఏప్రిల్ నుంచి రిజిష్టరు చేసుకోబడుతాయి. ఆఫీసు రోజుల్లో పని సమయంలో హైదరాబాదులలోని గోషామహల్ బారక్స్ దగ్గర ఇది జరుగుతుంది. ప్రతిరోజు సాయంత్రం 3 గంటల వరకు రిజిస్ట్రేషను, లైసెన్సుల రుసుం తీసుకోబడుతుంది. వైబండ్ల యజమానులు, డ్రైవర్లు లైసెన్సులు మే 31 వ తేదీలోగా పొందవచ్చు. ఆ తరువాత లైసెన్సులు లేకపోతే చట్ట ధిక్కరణ నేరం క్రింద చర్య తీసుకోవటం జరుగుతుంది.

## రోడ్డు రవాణా జాతీయాకరణ

ఆంధ్రప్రాంతంలో రోడ్డు రవాణాను జాతీయంచేయడం వల్ల అక్కడ ఏర్పడిన బస్సుల కొరతను తీర్చడానికై తెలంగాణా ప్రాంతంలో నడుస్తున్న 70 బస్సులను ఆంధ్రప్రాంతానికి పంపించడం జరిగిందని కొన్ని స్థానిక దిన పత్రికలలో వెలువడిన వార్త పూర్తిగా నిరాధారమైనదని ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రోడ్డు రవాణా కార్పోరేషనువారు ఒక ప్రకటన ద్వారా తెలియజేశారు. క్రిందటి సంవత్సరం తెలంగాణా ప్రాంతంలో 115 బస్సులు కొత్తగా ఉపయోగంలోనికి తేబడినాయనీ, 100 పాత బస్సులకు బదులు కొత్త బస్సులు తెప్పించబడినాయని ఆ ప్రకటనలో వివరింపబడినది. తెలంగాణా ప్రాంతానికి చెందిన బస్సును దేనినీ ఆంధ్రప్రాంతానికి మార్చడం జరగలేదు. అవసరమైనన్ని బస్సులను సమకూర్చుకున్న తరువాతనే ఆంధ్రప్రాంతంలో జాతీయాకరణ పథకం అమలు పరచబడినది కాబట్టి అక్కడ పథకంవల్ల బస్సుల కొరత ఏర్పడినదనడం నిజంకాదని కూడా ఆ ప్రకటనలో స్పష్ట పరచబడినది.

## పిల్లల పుస్తకాలకు ప్రభుత్వ బహుమతులు

బాల సాహిత్యాన్ని ప్రోత్సహించే పథకం క్రింద కేంద్ర ప్రభుత్వం, వివిధ ప్రాంతీయ భాషలలోని ఉత్తమ పిల్లల గ్రంథాలకు బహుమతులిస్తున్నది. పిల్లల పుస్తకాలను వ్రాసే రచయితలను పోత్సహించి తద్వారా ఉత్తమ బాలసాహిత్యం వెలువడడానికి దోహదం చేసే నిమిత్తం, రాష్ట్రం ప్రభుత్వం, కేంద్రం బహుమతులు పొందిన రచయితల తరువాత శ్రేణిలోనున్న ఇద్దరు తెలుగు పుస్తక రచయితలకు ఒక్కొక్కరికి రు. 500 ల చొప్పున బహూకరించడానికి నిశ్చయించింది.

దీనిని అనుసరించి రాష్ట్రప్రభుత్వం, 1960వ సంవత్సరంలో జరిగిన ఆరవ పోటీలో దిగువ పేర్కొన్న గ్రంథ కర్తలకు ఒక్కొక్కరికి రు. 500 లు బహూకరించింది.

1. శ్రీ బుజ్జాయి—"డుంబు," 3,6 సంవత్సరాల మధ్య వయస్కులైన పిల్లల కొరకు వ్రాసినది.

2. శ్రీ జె. రామచంద్రరావు—"సెలవుల్లో రాము,'' 7-14

సంవత్సరాల మధ్య వయస్సులైన పిల్లల కొరకు వ్రాసినది.

## చేతిపరిశ్రమల విక్రయశాలకు సలహా సంఘం

హైదరాబాదులోని ప్రభుత్వ కుటీర పరిశ్రమలు, చేతి పరిశ్రమల విక్రయశాల నిర్వహణకుగాను 1961 మార్చి 18 నుండి రాష్ట్ర ప్రభుత్వం 16 మంది సభ్యులతో ఒక సలహా సంఘాన్ని యేర్పరచింది.

"వస్తువుల ప్రదర్శన, సేవా, విక్రయాల పద్ధతులను ఆధునికం చేయడంలోనూ, విక్రయశాలలో ప్రదర్శించవలసిన వస్తువుల రకాలను ఎప్పటికప్పుడు నిర్ణయించడంలోనూ, విక్రయశాలలో అమ్మకానికి సొసైటీలనుంచి ఇతరత్రా వస్తువులు ఎన్నికచేసి, కొనుగోలుచేయడంలోనూ, వివిధ రకాల వస్తువుల నాణ్యతకు, నమూనాకు ఒక ప్రమాణాన్ని నిశ్చయించడంలోనూ, తక్కువ నాణ్యతగల వస్తువులను ఆమోదయోగ్యమయిన ప్రమాణాలకు తేవడంలో పనితనానికి, నమూనాకు, మార్పులు సూచించడంలోనూ, చేతితో చేసిన వస్తువుల బహుజన ప్రచారానికి, నమూనా, పనితనాలను మెరుగుపరచడానికి పోటీలను, ప్రదర్శనలను నిర్వహించడంలోనూ, విక్రయశాల వార్షిక ఆయవ్యయాల అంచనాను తయారుచేయడంలోనూ, విక్రయశాల నడిపే తీరును అభివృద్ధిజేయదలచే ఇతర కార్యకలాపాలేవయినా నిర్వహించడంలోనూ మేనేజిమెంటుకు యీ సలహాసంఘంవారు సలహాలనిస్తూ తోడ్పడతారు.

విక్రయశాలకు సంబంధించిన వివిధ అంశాలను విడివిడిగా ఉపసంఘాలు యేర్పరచుకుని వాటిద్వారా పరిశీలనలు జరుపుతూ యీ సంఘం పనిచేస్తుంది. ఈసంఘం కాలపరిమితి రెండేండ్లు.

## జూబిలీ హాలు

ప్రైవేటు వ్యక్తులు, సంస్థలచే నిర్వహింపబడే కార్యక్రమాల నిమిత్తమై హైదరాబాదు, పబ్లిక్ గార్డెన్సులోని జూబిలీ హాలు ఉపయోగానికి సంబంధించిన, ప్రభుత్వం దిగువ ఉత్తర్వులు చేసింది. ఇవి తక్షణమే అమలులోకి వస్తాయి.

(అ) ప్రైవేటు వ్యక్తులు, లేదా సంస్థల ఉపయోగార్థం జూబిలీ హాలును సాధారణంగా ఇవ్వకూడదు.

(ఆ) అయితే ప్రత్యేక సందర్భాలలో యీ హాలులో గాని లేదా దీనికి సంబంధించిన భవనంలో గాని సభలు, సమావేశాలు జరుపుకోవడానికి ప్రైవేటు వ్యక్తులు, లేదా సంస్థలకు అనుమతి ఇచ్చినట్లయితే అందుకు రోజుకు లేక అంతకంటె తక్కువ కాలానికి రూ. 100 లు చొప్పున అద్దెను ముందుగానే వసూలు చేయాలి. అంతేగాకుండా నిర్ణీత రేట్ల ప్రకారం విదుచ్ఛక్తి, ఫర్నీచర్ ఉపయోగానికి వేరే ఛార్జీలు తీసుకోవాలి. ప్రభుత్వానికి ప్రత్యక్షంగా గాకున్న పరోక్షంగానైనా సంబంధమున్న కార్యక్రమాలను మాత్రమే ఈ హాలులో జరుపుకోవడానికి అనుమతి ఇవ్వబడుతుంది.

## రామచంద్రపురం పార్వతీపురం పురపాలక సంఘాలు

తూర్పుగోదావరి జిల్లా రామచంద్రపురం శ్రీకాకుళం జిల్లా పార్వతీపురం పురపాలక సంఘాల ప్రత్యేకాధికారుల ఉద్యోగ గడువును 1-4-61 నుంచి మరో ఆరునెలలు పాటుగాని లేక అధ్యక్షునితో సహా పురపాలక సంఘాల ఎన్నికలు పూర్తయేంతవరకుగాని ఏదిముందు జరిగితే అప్పటివరకు పొడిగిస్తూ ప్రభుత్వం ఉత్తర్వులు జారీచేసింది.



# గ్రంథ సమీక్ష

## శ్రీ విలాసము (పద్యకావ్యం)

కర్త: ఆకుండి వేంకటశాస్త్రి
ప్రభుత్వ మహారాజ సంస్కృత కళాశాలా విశ్రాంతాంధ్ర ప్రధానోపాధ్యాయులు, విజయనగరము.

*వెల రూ. 2-50 న. పై.*

ఇది మూఁడాశ్వాసముల పద్య ప్రబంధము. లక్ష్మీదేవి విలాస మిందు వర్ణింపఁబడుటచే దీనికి శ్రీవిలాస మను పేరు పెట్టబడినది. కావ్య నాయికయైన లక్ష్మి గుణగణ వివాహ విలాసాదులిందు వర్ణితములచేఁగూడ నీ నామ మిచట సార్థక్యము చెందుచున్నది. మార్గశిర లక్ష్మీ వాసర వ్రత కథ నించుక ఆధారముగాఁ జేసికొని, తూర్పు గోదావరీ మండల భాగములఁ గథాస్థానములఁగా నొనరించి కవిగా రీ కావ్యమును సంతరించిరి.

ఇందలి కథ మిక్కిలి అల్పము, తూర్పు గోదావరి మండల మందలి దేవపురమున నాగమా శేషావధాను లను పవిత్ర దంపతులకు లేకలేక లక్ష్మీదేవి దయవలన నొక కుమార్తె జనించెను. ఆమె పెరిగి పెద్దయై విద్యలెల్ల నభ్యసించెను. ఆమె నమలాపుర మందలి వేంకమాంబా నరసింహ పండితుల కుమారుఁడైన శ్రీనివాసుని కిచ్చి వివాహము కావించిరి. తరువాత లక్ష్మీదేవి వృద్ధవనితా వేషము వైచికొని దేవపుర గృహముల కడకేగి బుడ్లు బుడ్లో అని అమ్మఁజూపెను. గృహిణులందరు నామెను గసరి పంపివైచిరి. లక్ష్మి మాత్రము కొన్ని బుడ్లుకొని యింట నుంచుకొనెను. నాగమ పనితొందరలో బుడ్ల సంగతి వినిపించుకొననేలేదు. లక్ష్మి యత్తవారి యింటి కరిగెను. దేవపుర మందలి గృహిణులు లక్ష్మీదేవి నీసడించిన కతమున నట దుర్భిక్షము చెలరేగెను. క్రమముగాఁ దినుటకుఁ దిండిలేక యా యూరివారందఱు దానిని విడిచి పట్టణముల కరిగిరి. గ్రామము పాడుపడెను. నాగమా శేషావధానులుకూడ చేయునదిలేక దీనులై యూరు విడిచి యిమలాపురమున కరిగిరి. లక్ష్మియు నామె భర్తయు నత్త మామలును వారి నెంతయో యాదరించిరి. మార్గశిర మాసము వచ్చెను. లక్ష్మియు వేంకమాంబయు లక్ష్మీవ్రత మాచరించిరి. నాగమనుగూడఁ బూజ నాచరింప రమ్మనిరికాని యామె యుపేక్షించెను. రాత్రి కలలో లక్ష్మికి లక్ష్మీదేవి కన్పించెను. ఆమె తల్లిదండ్రుల దీనత నివేదించి వారిని గాపాడ వేడుకొనెను. దేవి నాగమ లక్ష్మీవాసర వ్రత మాచరించిన నన్నియుఁ జక్కపడునని తెల్పి యంతర్హితు రాలయ్యెను. మఱునటి లక్ష్మీవారము నాగమ కూఁతుతోడను ఆమె అత్తతోడనుగూడి తానును వ్రత మాచరించెను. దేవి ప్రసన్ను రాలయ్యెను. నాగమా శేషావధానులు తిరిగి యభిజనమున కరిగిరి. దేవి కటాక్షమువలన మరల గ్రామ మంతయు యథాపూర్వముగా సిరి సంపదలతోఁ దులతూగెను. గ్రామస్థు లందఱు తిరిగి యరుదెంచిరి. లక్ష్మి గర్భవతియై పుట్టింటి కరుదెంచెను. నవమాసములు నిండిన పిమ్మట లక్ష్మి చైత్రశుద్ధ పంచమీ లక్ష్మీవారమునాడు పునర్వసు నక్షత్రమున మగశిశువును బ్రవించెను. అందఱును ఆనందమున నోలలాడిరి.

కథా సంఘటనమునఁ జమత్కార మేమియును లేదు. అది సర్వసామాన్యముగా సాగినది. సరిగా లక్ష్మి యత్తవారింటి కరిగిన సమయముననే దేవపురమునుండి లక్ష్మీదేవి తొలఁగిపోవుటయు, లక్ష్మి గర్భవతియై పుట్టింటికి వచ్చుటకు ముందే దేవి మరల నా యూరు ప్రవేశించుటయుఁ జూడ నీ లక్ష్మియే లక్ష్మీదేవి యని పించును. లక్ష్మి గుణగణములు ప్రశంసనీయములు. ఆమె ఆదర్శ

స్నుష, గృహిణీ సమాజమున కలంకారము. దేవతల యెడను, పితరుల యెడను, అత్త మామల యెడను గడుంగడు భక్తురాలు.

కావ్యము దేవపుర వర్ణనముతో నారంభించు చున్నది. ఈ వర్ణనము ప్రబంధోచితమై తూర్పు గోదావరి మండలము నందలి కోనసీమ గ్రామ వాసములను గన్నులకుఁ గట్టుచున్నది. ప్రబంధ సామాన్యములైన యష్టాదశ వర్ణనము లన్నియు నిందు లేకపోయి నను సూర్యోదయాస్తమయ, రాత్రి, వివాహ పుత్త్రోదయాది వర్ణనములు కొన్ని యున్నవి. ఈ వర్ణనము లన్నియు నాతి దీర్ఘములై కథా సంబద్ధములై హృద్యములుగా నున్నవి. "గోరు మొదలు కురుల కొనదాఁకఁ గల దాని యొడలి సొబగులెల్ల నుడువనేల, యేవి యెట్టులున్న నింపగునో యవియెల్ల నట్టులుండె నింత నిజము" పుట 61. అని కవిగారు లక్ష్మి వర్ణనము చేయు విషయమునఁ బ్రబంధమార్గము ననుసరింపక యౌచిత్య మలరారు నట్లుగా సూచించి విడిచివైచిరి. కచకుచాది సర్వాంగవర్ణన మొనరించుట యాధునిక కాలపు టభిరుచి కాదుగదా! లక్ష్మికిఁ బదు నాఱేఁడుల ప్రాయమున వివాహ మొనరించు టాదిగాఁగల విషయములఁ బరికించినఁ గథ యచిరకాలము క్రిందనే జరిగినదని తోఁచును. కాని గంగాధరశాస్త్రి, నాగమా శేషావధానులు దేవపురమునుండి యమలాపురమున కతి శ్రమకోర్చి కాలినడక నరుగవలసిన యక్కఱ యేల కలిగినదో తెలియదు.

ఈ ప్రబంధమున నాంధ్రదేశ మందలి తూర్పు ప్రాంతముల యాచారములు కొన్ని వర్ణింపఁ బడినవి. దీనికిఁ గవిగారు విజయనగర వాస్తవ్యు లగుటయే కారణము. మేనకోడలిని పెండ్లియాడుట, పెండ్లికి ముందు మగ పెండ్లివారు తోఁటలో విడియుట, పునస్సంధాన మత్తవారి యింటనే జరుగుట మున్నగునవి యిందుకు నిదర్శనములు. ఇందెడనెడ సందర్భము ననుసరించి యాంధ్రదేశ గృహ జీవితము చక్కఁగా వర్ణింపఁ బడినది. గంగాధరశాస్త్రి పెండ్లి రాయబార మిందుకు దృష్టాంతము. నరసింహ పండితుఁ డల్లుండ్ర పరిస్థితులు వర్ణించి చెప్పుట యెంతయు సహజమై కవిగారి కా విషయమునఁగల యనుభవమును విశదము చేయుచున్నది. నరసింహ పండితుఁడు వివాహమునకుఁ గొంచెము వైముఖ్యము ప్రదర్శించినప్పుడు వేంకమాంబయు నామె యత్తయుఁ గలుగఁజేసికొని యాతని సుముఖునిఁ గావించుట, పిల్ల యుక్తవయస్కురాలైనను పెండ్లిమాటయే తలంపక శేషావధాని యూరకుండ నాగమాంబ కలుగఁ జేసికొని యాతనిఁ దత్కార్యోన్ముఖు నొనరించుట వివాహ విషయముల నిల్లాండ్రకుఁగల ప్రాధాన్యమును వ్యక్త మొనరించు చున్నది.

లక్ష్మి చైత్రశుద్ధమున పునర్వసు నక్షత్రమునఁ బ్రసవించుట శ్రీరాముని జననమును దలపించుచు శిశువుల నుత్తరోత్తరాభివృద్ధిని జెప్పక చెప్పుచున్నది.

కవిగా రుభయభాషలందు గొప్ప విద్వాంసులు పలువురు విద్వద్వతంసులకే గురువులు. వారి రచన ఆద్యంతము లాక్షణికమైచ్యుత సంస్కారములులేక యెడనెడ సులభజాతీయ పదములతోడను ఆంధ్ర సంస్కృత లోకోక్తులతోడను గూడి యింపు నింపుచున్నది. నాల్క యొకటియెగాఁగ" పుట 21, అను పద్యమందలి శ్లేషము, "నాఁడు సిరివేల్పుఁ గొల్వని నాఁటి" "సుకవి కవితా విలాసము చొప్పు గలుగ" పుట 108 అను పద్యము లందలి ఛందోవ్యాకరణాంశములును గవిగారి పాండితీ విశేషమును బ్రకటించు చున్నవి. "ఎడమ భుజము లక్ష్మి కెగురుట కనుఁగొని" పుట 102 యందలి ఎడమ పదముమీఁది చమత్కారము చేమకూరి కవి కవిత్వమును దలంపునకుఁ దెచ్చుచున్నది. "అటు వారయ్యమలాపురంబరుగు నా త్రోవన్" 89. అను పద్య మొక్కఁడే దీర్ఘ సమాసపూరితమై యున్నది. మిగిలిన పద్యములు జాతీయ పదశోభితములై, చక్కని సంభాషణలతోఁగూఁడి, సర్వజన సుబోధములై మనోహరములుగా నున్నవి. "ఆంధ్ర ధరణీ రమణీ రమణీయహారమై" 13. నాగాంబ నుద్దేశించిచేసిన "వెఱ్ఱినాగమ్మవు గాక" 31, అల్లురయంగణమ్ములు ప్రియమ్ముగ సాఁగుచు నుండెడిం గదా 57 సరిగంగ తానముల్, అంధకార విపణీ సామ్రాజ్యము 99 మున్నగు ప్రయోగములు రమ్యములుగా నున్నవి. "నకజలఁ దొట్రుపాటాదవ" 114 అను పద్యము నన్నయగారి నలోపాఖ్యానములోని "కలి దమయంతిఁ చాపసమకట్టు" అను పద్యమును బోలియున్నది. ఓవైపు, నమ్మిక యుంటిమి 114 సంచరియించె వంటి ప్రయోగములు ప్రౌఢములైనవి. పిల్లడు, చూచాయ, కాసు వంటివి మాండలికములు. కాల్వకు నీరుకిఁబోయె 56, సమము 107 అనునవి నీటికి, సమయ అని యుండుటయుక్తము. ఇట్టివొండు రెండున్నను గావ్యమంతయు లక్ష్మిశీలమువలె నిర్మలము నిర్దుష్టమునై యలరారు చున్నది. కవిగారు శ్రీరామ భక్తులు. శ్రీరాముని యనుమతి నీ కావ్యమును సుగృహీత నామధేయులు, ఆచార్య వతంసులునైన శ్రీ మామిడిపూడి వేంకట రంగయ్యాగారి కంకితముచేసి బంగార మునకుఁ బరిమళ మబ్బఁజేసిరి.

## నవ్యాంధ్ర పంచకావ్య పరిశీలనము

కర్త: శ్రీ నరసింహదేవర ఉమామహేశ్వరశాస్త్రి
పెదపళ్ల-ఆలమూరు పోస్టు, తూర్పుగోదావరి జిల్లా.
వెల రూ. 1—50 న. పై.

సంస్కృతమున రఘువంశాదుల వలెనే పూర్వాంధ్ర వాఙ్మయమున మను చరిత్రాదులు పంచకావ్యములుగాఁ బ్రసిద్ధికెక్కినవి. శ్రీ ఉమామహేశ్వరశాస్త్రిగారు ఆధునికాంధ్ర వాఙ్మయమునుండి పంచకావ్యము లనఁదగిన యైదుకావ్యముల నేరి యిందు వానిని గూర్చి పరిశీలనము కావించినారు, "ఇది మేలుకీళ్ళ విమర్శనము కాదు. గుణస్మరణము మాత్రమే" అని వారు వక్తవ్యమున సూచించినట్లిందు గుణపరిశీలనము మాత్రమే చేయఁబడినది. నిజమైన విమర్శలో గుణదోషములు రెంటిని నిష్పక్షపాతముగా నిరూపింపవలసిన యావశ్యకముండును. ఇందందలి యేకదేశమే నిర్వహింపఁబడుటచే నిది ప్రశంసయేకాని విమర్శకాదు.

పింగళి కాటూరుల సౌందరనందము, దుర్భాక శతావధానిగారి రాణాప్రతాపసింహ చరిత్రము, గడియారము శేషశాస్త్రిగారి శివభారతము, మధునాపంతులవారి ఆంధ్రపురాణము, తుమ్మలవారి బాపూజీ ఆత్మకథ — ఇందు పరిశీలనకు పాత్రములైన పంచకావ్యములు. ఈ యైదు కావ్యములును బరిమాణముచేత నే కాక ప్రశస్త గుణసంపదచేఁ గూడ నాంధ్రజనుల యాదరము చూఱగొన్న యుత్తమకావ్యములు. ఐదును గొంచె మించుమించుగా, జారిత్ర వస్తుకములైనట్టివే. విషయ ప్రధానములైన చారిత్రకాంశముల లోనే యాయా కావ్యముల కర్తలు రసవంతములైన సన్నివేశములు సృజించి యద్వితీయ ప్రతిభా మహితముగా వానిని సంతరించి యాంధ్ర సరస్వతి కపూర్వాలంకారములు కల్పించిరి. ఆధునిక కాలమున నవతరిల్లిన ప్రశస్తకావ్యము లింకను గొన్ని యున్నను శ్రీశాస్త్రిగారీ యైదింటినే యేరుటకు వస్తువు విషయమున వీనియందుఁగల సామ్యముకూడఁ గొంతవఱకుఁ గారణమై యుండును.

ప్రతిభా పరిణతికల కవుల కావ్యములలోఁగూడ వస్తువునందు వారికుండు సహజాభి రుచినిబట్టి రచనావిధానమునఁ గొంత తారతమ్యము గోచరించుచుండును. వస్తుస్వభావమునకును గర్త యభిరుచికిని సామరస్యము పొసఁగినప్పుడు రచన పరమోత్కృష్టమై భాసిల్లును. పోతన భాగవతాది గ్రంథములంత జన సమ్మతములై యలరారుటకుఁ దాదృశమైన సామరస్య సంపదయే హేతువు. ఈ పంచకావ్యముల కర్తలందఱును బ్రతిభావంతులే; కాని వారి యభిరుచులు వేఱు. వారు తమ కావ్యములలో నాయా యభిరుచుల కనుగుణములైన రచనా విలాసములను వెలయించిరి. ఆ యభిరుచులను గ్రహించి వారి హృదయములను బ్రతిబింబింపఁ జేయు వాయువుపట్టు లనఁదగిన సన్నివేశములఁ జక్కఁగాఁ బరామర్శించి యందలి రస చమత్కారములను వెల్లడించుటలో శ్రీశాస్త్రిగారు ప్రదర్శించిన నేర్పు ప్రశంసనీయమై యున్నది. పింగళి కాటూరి కవుల నవ్యతాభిరతిని, తిక్కన రచనను జీర్ణము కావించుకొనిన రాజశేఖర శతావధానిగారి వీరరస తన్మయతను, శేషశాస్త్రిగారి యుభయకావ్య సమన్వయ ధోరణిని, మధునాపంతులవారి మాధురీ ధురీణమైన రచనా విధానమును తుమ్మలవారి నీతిధర్మశీల ప్రబోధన పాటవమును, కమ్మతనమును బ్రధానముగా నెన్నుటలో నీ నేర్పు గోచరించుచున్నది.

శాస్త్రిగారీ కావ్యములను బరిశీలించినది విమర్శన దృష్టితో, గాదు; పరమ భక్తిభావముతో, వారు తత్పరులై యా కావ్యములను బఠించి యందలి రస రామణీయకములకును, పదప్రయోగ మాధుర్యములకును బరవశత్వమొంది, యా సమాధిస్థితిలోఁ దమ మనోనేత్రము నెదుట సాక్షాత్కరించిన సౌందర్య సందర్భములను జక్కఁగాఁ బ్రకటించినారు. వారా కావ్యములలో నున్నవని చెప్పిన మెఱుఁగులన్నియు నాయా సన్నివేశములలో నెల్లరకును బ్రత్యక్షములగునట్టివే. వానిని జదువునప్పు డా కవీంద్రుల రససృజన కౌశలమువలెనే శ్రీ శాస్త్రిగారి రసగ్రహణపారీణతయు నద్భుతముగా వ్యక్తము లగుచుండును.

శాస్త్రిగారు మంచి పండితులు. నవ్యకావ్యములను గూడ సానుభూతితోఁ జదివి యానందింపఁగల సామరస్య సహృదయతా సంపదకలవారు. పలువురు పండితులలో నీ గుణము లోపించి యుండును. గుణసంపదను దేశ కాలదృష్టితోఁ బరికించుట యంత యుచితమైన పద్ధతికాదు. అది యేకాలమున కేదేశమున నున్నను శిరోధార్యమైనదే. శాస్త్రిగారి కీ విషయమునఁగల సామరస్య మీ పరిశీలనమునఁ బ్రతి పుటయందును గోచరించును.

శాస్త్రిగారి శైలి సహజ సుందరమైనది. అలఁతియలఁతి వాక్యములతో వారు చెప్పఁదలఁచిన భావముల నన్నిటిని జక్కఁగా విశదముగాఁ జెప్పుచుందురు. ఎడనెడ వారొసంగిన యుదాహరణములును రమణీయములై, వారు ప్రకటించు భావమునకు సమ్యగ్దృష్టాంతములై, విమర్శనమునుగూడ విడువక చదువవలెనను వేడుక కలిగించుచున్నవి.

గ్రహింపఁబడిన కావ్యములు రసోదంచితములు, పరిశీలనము సామరస్య సంశోభితము. రచన సరళసుందరము. ముద్రణము

మనోహరము. సర్వవిధముల సుందరముగానున్న యీ రచన లోని అనవసర సరళాదేశములు; అందము జూడఁదగినది 5; సూచించు యీ వృత్తము 7; పోషించుటలో యీ కవులది 8; ఏకకంఠ 16; వాక్సహాయములతో 27; యెవ్వరివలెనైనను 47; ప్రాణఁపు 48; వయ్యారము 52; పూర్వసాంప్రదాయము 56; కారణమున యడవి 63; సౌష్టవము 62. మొదలైన స్వల్ప దోషములు సవరించుకొనఁదగినవి.

## సాగర సంగీతము

కర్త: శ్రీ పేర్వారం జగన్నాథం
నవ్యసాహితీసమితి అనుబంధ ప్రచురణ - హైద్రాబాదు.
**వెల రూ. 1.**

ఇది వివిధ భావపూరితములైన ముప్పది ఖండకావ్యముల సంపుటము. అందు సాగరసంగీతమను శీర్షికగల ఖండకావ్యమును బట్టి మొత్తము సంపుటమునకుఁగూడ ఆపేరే పెట్టఁబడినది. గ్రంథకర్త తొలిరచన ఇది. ఆయన హృదయమొక సాగరము. అందుండి వెలువడిన వివిధ సంగీతరీతు లిందలి ఖండకావ్యములు.

ఇందలి కావ్యములు వ్యావహారిక భాషలో వివిధమాత్రా ఛందములలో రచింపఁబడినవి. కొంచెె మించుమించుగా నన్నియు నభ్యుదయమార్గముననే నడచినవి. భావములందు వైవిధ్యము కలదు. కొన్నికావ్యములు దేశభక్తి ప్రేరితములు; కొన్ని హేళనాత్మకములు; కొన్ని జగత్ప్రవృత్తి ప్రదర్శకములు; కొన్ని ఆత్మాశ్రయములు.

ఆహుతిలో కవి ఆదర్శము చక్కగా విశదీకరింపఁబడినది. జాతికోసము, జనులకోసము, శాంతిసమతల కోసము అతఁడెట్టి త్యాగమొనర్చుటకైన సంసిద్ధుఁడు. విశ్వసందేశము వినిపించు కవీంద్రుని ప్రాతపాశియో, స్వాతంత్ర్య సమరమున సమసి పోయిన వీరునికై హర్షమున వీరమాత రాల్చు కన్నీటి బిందువో అయిపోదమని అతనికోరిక. అతఁడు కవిరాజైనచో విశ్వకళ వెలుఁగుటకై తన రుధిరమునంత పిండి తైలముగా ధారపోయుటకు వెనుదీయఁడు. హృదయము నావరించిన నిరాశా నిస్పృహలు మాసిపోవునట్లుగా నెడఁదలో నింతచిఱుదివ్వె వెలిఁగింపవలెనని అతడు భగవంతునికిఁ జేయు విన్నపము.

కవి జాతీయభావమును, దేశభక్తిని బ్రదర్శించు కావ్యములలో మహోదయం, స్వాతంత్ర్యగీతి, సాగరసంగీతం, తన్మయత్వం, ప్రభాతాంజలి, పతాకారోహణం ముఖ్యములైనవి. స్వాతంత్ర్యము లభింపఁగానే దేశీయుల హృదయాలలోఁ గలిగిన యానంద చైతన్యము మహోదయములో వివిధరీతుల వెల్లడిచేయఁబడినది. "మండిపోయెడు ఎదలలోపల బొండుమల్లెలు విరియఁబూసె" ననుట యందలి యొక మనోజ్ఞమైన రీతి. ఆ సమయమునఁ గవి హృదయ మృదుమధురవాహిని వఱదలై పాఱిపాఱి చివరికి మహాసముద్రముగ మాఱినది. నాగార్జున సాగరమును జూచి కవి పొందిన పారవశ్య మతని దొక్కనిదే కాదు; సర్వాంధ్ర జనులకును సంబంధించినది. నవ్యాంధ్ర రాష్ట్రమున ముక్కోటిప్రజ లొక్కవేదికపై నిల్చి భారతికి నీరాజనము లెత్తుట గాంచి యతని మేను పులకించినట్లే ఆంధ్రులందఱి మేనులను బులకించినవి. పై కావ్యములలోని భావములు విశ్వజనీనము లగుటచే హృద్యములుగా నున్నవి.

గ్రంథకర్తకు మోసము, కపటము, మున్నగు దుర్గుణములపైఁ గల యేవగింపు బహురూపుల వేషాలు, ప్లేటు పిరాయింపు మున్నగు కావ్యములలో వెల్లడిచేయఁబడినది. ఇందలి హేళన మృదువయ్యు చాల శక్తిమంతముగా నున్నది. 'కాళ్లువిరిగిన వేటకుక్క'లో కాంగో వృత్తాంతము కన్నులకు కట్టినట్లువర్ణింపఁ జనశక్తి సిగ్మన్రీ కండకావర మడఁగించిన చిత్రమిందు చక్కగా నిరూపింపఁబడినది.

వక్రభాష్యము, ప్రసవవేదన, మహావిష్ణువు మరణం, మేల్కొన్న శవాలు, దివాంధముల స్వగతం, వీడ్కోలుసందేశం భావగంభీరములై జగత్తునందలి వికారము నట్టహాసముచేయుచు, కవికిఁ గల శాస్త్రవిజ్ఞాన పరిచయమును వెల్లడిచేయుచున్నవి. అణువు ప్రసవవేదన అద్భుతముగా వర్ణింపఁబడినది. 'పుట్టఁబోయే పసిగ్రుడ్డు ఎవరివోలె ఉంటుందో'. అను ముగింపు ప్రపంచభావి ప్రవృత్తి విషయమునఁగల సందిగ్ధస్థితిని చక్కగా నిరూపించుచున్నది.

ఎవడికెరుక, భిన్నరాగాలు మున్నగు కావ్యాలలో నవ్యాంధ్ర మహాకవుల రచనల అనుకరణము గోచరించుచున్నది. "పీతాల పంపకపు బేరాలు కుదురక.... బాపూజీ కే మెరుకప్రవిమలాత్మయే తప్ప" అను భావమునందలి యాథార్థ్యమందఱు నెఱింగినదే. ఈ కావ్యమునందలి యితరపద్యాలన్నియు నా భావమునే భిన్న పదములతో సూచించుచున్నవి.

ఇందలి కావ్యములన్నియు కుంటులేక ధారాళముగా నడచుచున్నవి. వాడఁబడిన పదాలు మృదుమధురములై భావప్రకటన

మున శక్తివంతములుగా నున్నవి. కొన్నికావ్యములందలి యంతరార్థము నిగూఢమై యుండుటకు భావకాఠిన్యమే కారణము కాని పదకాఠిన్యముకాదు. కవి భావనావిధానము ప్రౌఢమగుట కవకాశమున్నది. పాశినయ్యి పోదామని 4; తిరుగుతోంద్రటన్ 5; కడుతోంద్రట 6; కిసలయాలతొ 9; కృారమగు 17; సుమనో జ్వల 27; ఆషాఢమేతెంచ 32; వంటి ప్రయోగములు వ్యావహారిక భాషలోనైనను ఉండఁదగినవికావు. కప్పుకుంట నంటున్నది 28 తెలంగాణా వాడుకను సూచించుచున్నది. కవి మాతృభాష మరాటీ. అతడు తెలుగుభాష నభ్యసించి, అందు పట్టభద్రుఁడై, ప్రసన్నమధురముగా కవిత సాగించుట ముదావహము. ఆయన తేలిక రచనలతో తృప్తిపడక ప్రౌఢతకు పాటుపడుట వాంఛనీయము.

## ద్రౌపదీ మానసంరక్షణము

**నాటకము, ద్వితీయముద్రణము.**

*కర్త: శ్రీ మక్కపాటి వేంకటరత్నం*

ప్రాప్తిస్థానము : గ్రంథకర్త - నాగవరప్పాడు,

వెల్దిపాడుపోష్టు - కృష్ణాజిల్లా.

*వెల రూ. 2.*

ఇది పంచాంక పరిమితమైన నాటకము. వస్తువు ప్రఖ్యాతమైన భారత సభాపర్వమునుండి గ్రహింపఁబడినది. దీనిని సాధారణముగా నందఱును ద్రౌపదీ వస్త్రాపహరణమందురు. ద్రౌపది కట్టిన పుట్టములు కొన్ని ఒలువఁబడినమాట నిజమేయైనను దుశ్శాసనుఁడు వాని నన్నింటిని అపహరింప లేకపోయెను, గ్రంథకర్త యందు చేతనే ఈ నాటకమునకు ద్రౌపదీమానసంరక్షణమని పేరుపెట్టెను. పెట్టుటయేకాదు. ప్రస్తావనలో మారీషునిచే "నామకరణము-సార్థకము-సమంజసము" అనిపించెను. దుర్యోధనుని మయసభాదర్శనముఁదొట్టి ద్రౌపదీమానరక్షణము వఱకుఁగల కథ యిందు వర్ణింపఁబడినది.

ప్రధానకథ భారతమందలిదే యైనను కవి యందుఁ బెక్కుమార్పులు, చేర్పులు, అన్యథా కల్పనలు కావించియుండెను. ఇందు కొన్ని కథౌచిత్యముకొఱకును కొన్ని పాత్రౌచిత్యము కొఱకును జేయఁబడినవి. ప్రథమ ద్వితీయాంకముల యారంభములందు నారదుఁడు ప్రవేశించి జరాసంధ శిశుపాలుర వధలను సూచించును. ఈ సూచన నాటకకథకు పూర్వరంగమును ప్రకటించుటే కాక ధర్మజుని రాజసూయ యాగాచరణమునకును దారి చూపుచున్నది. కవిగారు కావించిన చేర్పులలో ముఖ్యములైనవి రెండు. ఒకటి ప్రథమాంకమందలి సత్యా ద్రౌపదీసంవాదము. ఇందు ద్రౌపదికి కృష్ణునియందుఁగల భక్తివిశేషము ప్రదర్శింపఁబడినది. ఈ భక్తియే నాటకాంతమునందలి యామె మానసంరక్షణమునకు హేతువైనది. ఇది భారతమున లేనిచేర్పు. నాటకమునాద్యంతములు ద్రౌపదీ భక్తిసంబద్ధములై యుండుట యెంతయు నుచితముగా నున్నది. రెండవది దుస్స్వప్న నివారణమునకై తీర్థయాత్ర కరిగిన భీష్ముఁడు ధర్మజునకు వ్రాసినట్లు కల్పింపఁబడిన యుత్తరము. ఇది యొకవిధముగా ముద్రారాక్షసమున చాణక్యుఁడు కల్పించిన యుత్తరమును స్మృతికిఁ దెచ్చుచున్నది. ధర్మాత్ముఁడైన ధర్మజుఁడు విదురానీతుఁడై జూదమాడుటకై హస్తినాపురమునకు వచ్చినట్లు భారతకథ. కవిగారి కది రుచింపలేదు. అతఁడు వచ్చుట భీష్ముని యుత్తరమందలి యంశముల ననుసరించి దుర్యోధనుఁడు సామంతులపైఁ దిరుగఁబాటు చేయకుండ వినోదము కల్పించుటకు, ద్రౌపదికి సభలోఁ బరాభవము జరుగునప్పుడు ధర్మమార్గానువర్తులైన భీష్మద్రోణులు తీర్థయాత్ర కరుగుటచే హస్తినాపురమున లేకుండఁ జేయుటకును ఇచ్చటి కల్పన కొంతవఱ కుపకరించినది. ద్రౌపదికిఁ బరాభవము జరుగునప్పు డశ్వత్థామ ధర్మోపన్యాసము చేయుటకూడ నిందలి క్రొత్త విషయమే.

మార్పులు పెక్కున్నవి. అందొకటి శకునికి సంబంధించినది. భారతమున నతఁడు దుష్టచతుష్టయములో నొకఁడు. అతని తండ్రికి దుర్యోధనుఁడు కావించిన వృత్తాంతమందు లేదు. తండ్రి యభిలాష ననుసరించి దుర్యోధనుని వంశము నిర్మూలము కావించుటకై నాటకమున శకుని పన్నిన పన్నాగము జూదము. అతని కడనున్న పాచికలు తండ్రి వెన్నెముకచేఁ జేయఁబడినవి. ఈ విధముగా శకుని కైతవమునకుఁ గొంత పూర్వరంగము, అంతరార్థము ఉన్నట్లుగా నాటకమున కల్పనము చేయఁబడినది. భారతమందలి శకుని శీల మెఱింగిన వారికిది వింతగా నుండును. ఇట్లే విదుర కర్ణాదుల శీలములను బోషించుటకును కవిగారు కొన్ని మార్పులు చేసియున్నారు. సభలో పరాభవము జరుగునప్పుడు కర్ణుఁ డచ్చట లేఁడు. వికర్ణుఁడు ధర్మనిర్ణయము చేయుటయు కర్ణుఁ డతని సభలో భంగించుటయుఁగూడ నిందు కానరావు. జూద మల్పోచిత కార్యమగుటచే నతఁడు మొదట నందు కంగి

కరింపనే లేదు. విదురుఁడు పరాభవమైనదని వినిన తరువాతనే సభకు వచ్చెను. భారత మందలి విదురునివలె నితఁడు ధృతరాష్ట్రు విధాత్రు నానతికి లోఁబడి యింద్రప్రస్థమున కరిగి ధర్మజాదులను దీసికొనిరాలేదు. ధృతరాష్ట్రునికి సభా నిర్మాణము సంగతియేకాని ద్యూతము సంగతి తెలియదు. అతఁడు చివర కుమారుని దుశ్చర్యకుఁ బశ్చాత్తాపపడి ద్రౌపదీ ముఖమున పాండవుల రాజ్యము పాండవులకిచ్చి పంపివైచెను. ఈ మార్పులు పాత్రల శీల పోషణమున గ్రంథకర్త వహించిన అతిమాత్రమైన శ్రద్ధకు నిదర్శనములు.

అన్యథాకల్పనలో నగ్రగణ్యము దుర్యోధనుని సభా ప్రలంభము చూచి ద్రౌపద్యాదులు హసింపలేదని వ్రాయుట. అట్లు నవ్వినవారు వారుకాదు. ద్రౌపది పరిజనులైన మల్లికా కమలికలు. ఆ విషయము నెఱింగి ద్రౌపది యెంతయో పరితపించి వారిని బనినుండి తొలఁగించి వైచెను. నవ్వు నవ్విడి అంతిపురమునుండి వచ్చుటచే దుర్యోధనుఁడు ద్రౌపదియే నవ్వెనని భ్రాంతిపడి పగపట్టెను. ద్రౌపదిశీలము పోషించుటకై గ్రంథకర్తచేసిన ప్రయత్న మిచ్చట సువిదితము. అట్లే ప్రాతికామి శీలము చక్కగాఁ బోషింపఁబడినది. అతఁ డిందు మహాభిమానవంతుఁడు. దుర్యోధనుఁ డాడిన పల్కులు సహింపలేక యతఁ డుద్యోగము వదలుకొని శిక్షకుఁ బాత్రుఁ డయ్యెను.

ఈ నాటకమున రెండు మూఁడు భావగంభీరములైన స్వగతము లున్నవి. అందులో నాటక కళాపరిషత్తు వారు ఏకపాత్రాభినయపు పోటీకి నిర్ణయించిన దుర్యోధనుని స్వగత మొకటి. (ద్వితీయాంక) స్వగతము లందలి భావము లావేశజనకములుగా నున్నవి కాని భాషమాత్రము దీర్ఘసమాస భూయిష్ఠమై బాణుని శైలి కన్నయో తమ్ముడో అన్నట్లున్నది. నిజమున కిట్టి భాష దృశ్యకావ్యములలోఁ గంటె శ్రవ్యకావ్యములలో నుచిత తరముగా నుండును.

ఇందలి ప్రధానరసము శాంతము (భక్తి) అనియే చెప్పవలయును. నాటకము దానితోనే యారంభించి దానితోనే ముగియు చున్నది. చివరి యంకమున కరుణరస చ్ఛాయలుకూడ గోచరించు చున్నవి.

పంచమాంకమున ద్రౌపదీ వాసంతికల సంభాషణలో చేయఁబడిన భవిష్యత్కథా సూచనమును, శారదాపాత్ర ప్రవేశ సూచనమును మిక్కిలి మనోహరముగా నున్నవి.

నాటకము నాందితో నారంభించి భరత వాక్యముతో ముగియు చున్నది. నాంది కథాంశ సూచనను గావించుచున్నది. చివరి పాత్ర ప్రవేశ సూచన మందలి "నారద మహర్షి మహతీ నినాదమట్టు" లను మాట నిజముగాఁ దరువాత వినఁబడునది నారదేతరుల గానమేమో యను భ్రాంతి పుట్టించుచున్నది. అంకములు స్థలములుగా విభజింపఁ బడినవి. ఇందలి కొన్ని రంగములు సంస్కృత నాటకము లందలి విష్కంభ ప్రవేశకములను బోలి సూచ్యవస్తు సూచనము కావించుచున్నవి. కవి నాటకమును బ్రదర్శ నోచితము కావించుటకై చేయఁబడిన ప్రయత్నము సర్వత్ర గోచరించు చున్నది.

పద్యము లిందు సంఖ్యేయములై యున్నవి. అందలి సీస పద్యములు భావగంభీరములై ధారాశుద్ధితోఁగూడి రమ్యములుగా నున్నవి. (పుట 16; పుట 58) ఇందు కుకవి సుకవుల కావ్యముల వలెనే దుర్యోధన యుధిష్ఠిరుల మనఃప్రవృత్తులను బ్రకటితములగు చున్నవి. "ఇదిగదా వేళ" (పుట 100) ఆవేశ వేగ పూరితమై ద్రౌపది భక్తి భావమును లెస్సగా సూచించుచున్నది.

భావౌచిత్య పోషణమున కింతగా పాటుపడిన కవిగారు భాషా విషయమున నుపేక్ష వహించుట శోచనీయముగా నున్నది. పెక్కు ద్రుత ప్రకృతికముల తరువాత యడాగమములు కనిపించు చున్నవి. (నాకు యీ ప్రపంచ 25; ఇంక యింద్రప్రస్థపురము 26; వారిని యొడిచికొని 30; అగు యినుండు 32 - ఇంకను పెక్కు) ధర్మంజయతి 1; శిరచ్ఛేదనము 33; అవజ్ఞత 23; రంజ్యమాణ 14; నిజా నిజములు; భీమపార్థయ మళ 73, జూద ప్రశంస 67 మున్నగునవి సరిచేసిన బాగుగా నుండును. మొత్తముమీద నాటకము ప్రసిద్ధి కథలోనే ప్రశస్తములైన మార్పులు చూపుచు భాస నాటకముల రచనను తలపించు చున్నది.

— ది. వేం.



# ముఖ్యవార్తలు

**21—3—61**

హైదరాబాదులోని పారిశ్రామిక ప్రదేశాలలో సుమారు 2000 ఎకరాల భూమిని స్వాధీన పరుచుకొని, కొత్తగా పరిశ్రమలను నెలకొల్పదలిచిన వారికి సరసమైన ధరకు లభింపజేయడానికి ప్రభుత్వం నిశ్చయించినట్లు ఈవేళ రాష్ట్ర శాసన సభలో ముఖ్యమంత్రి వెల్లడించారు.

**22—3—1961**

పట్టణ ప్రాంతాలలో బహుమతి బాండ్లను విక్రయించే ప్రత్యేక పథకాన్ని నేడు హైదరాబాదులో ముఖ్యమంత్రి ప్రారంభించారు.

పంచాయతీలు, పంచాయతీ సమితులు, జిల్లా పరిషత్తుల ఆర్థిక వనరులను, పెంపొందించే నిమిత్తం, భూమిశిస్తు, స్థానిక పన్ను రేట్లను 12 న. పై. నుంచి 31 న. పై. లకు హెచ్చిస్తూ రాష్ట్ర ప్రభుత్వం నేడు ఒక బిల్లును గెజెటులో ప్రకటించింది.

**23—3—1961**

1961 వ సం. పు ఆంధ్రప్రదేశ్ అత్యవసర వస్తువుల కంట్రోలు (తాత్కాలికాధికారాలు) (సవరణ) బిల్లును ఈ రోజు రాష్ట్ర శాసనసభ ఏకగ్రీవంగా ఆమోదించింది. అంతకు పూర్వం దీనిని శాసన మండలిలో ఆమోదించారు.

**24—3—1961**

కేంద్రప్రభుత్వం, ప్రణాళికా సంఘాల ఆమోదంతో శ్రీశైలం జల విద్యుచ్ఛక్తి ప్రాజెక్టు పథకానికై తృతీయ ప్రణాళికలో రు. 49 కోట్లు కేటాయించబడినట్లు ఈ వేళ పబ్లిక్ వర్క్ శాఖా మంత్రి శాసనసభలో తెలియజేశారు.

**25—3—1961**

రాష్ట్ర రోడ్డు రవాణా కార్పొరేషను నిర్వహణపై అనంతరావు కృష్ణన్ సంఘం సమర్పించిన నివేదికను నేడు శాసన సభలో ప్రవేశపెట్టారు.

**26—3—1961**

రాష్ట్ర నాన్ గెజిటెడ్ ఉద్యోగుల సంఘం వార్షిక మహా సభను హైదరాబాదులో ముఖ్యమంత్రి ప్రారంభిచారు.

**27—3—1961**

1961 జనాభా లెక్క ప్రకారం దేశ జనాభా 43 కోట్లకు పెరిగినట్లు కొత్తఢిల్లీలో అధికారికంగా ప్రకటించ బడినది.

**28—3—1961**

అఖిలభారత స్టేట్ సర్వీసులు ద్వితీయ సమావేశాన్ని వైద్య ప్రజారోగ్య శాఖామంత్రి శ్రీ పి. వి. జి. రాజు హైదరాబాదులో ప్రారంభించారు.

**29—3—1961**

ప్రధాన మంత్రి శ్రీ నెహ్రూ దుర్గాపూర్ ఉక్కు కర్మాగారంలో నేడు సెక్షన్ మిల్లును ప్రారంభించారు.

**30—3—1961**

ప్రభుత్వము బిల్లులను ఆమోదించిన తరువాత రాష్ట్ర శాసన సభ సమావేశం కాలనిర్ణయం లేకుండా వాయిదా పడింది.

**31—3—1961**

భారత-పాకిస్తాన్ దేశాల వైజ్ఞానిక మహాసభను నేడుకొత్త ఢిల్లీలో ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ ప్రారంభించారు.

**1—4—1961**

దేశమంతటా ఈవేళ భారత వైమానిక దళం 28వ వార్షికోత్సవాలు జరిగాయి.

**2—4—1961**

భారత, పాకిస్తాన్ దేశాల ప్రజల మధ్య సత్సంబంధాలను పెంపొందించడానికి రచయితలు, పాత్రికేయుల దోహదం చేయ్యాలని నేడు ముగిసిన భారత-పాకిస్తాన్ వైజ్ఞానిక మహాసభలో అభ్యర్థించబడినది.

**3—4—1961**

మైసూరు గ్రామోద్యోగుల వంశపారంపర్యమైన హక్కు రద్దు బిల్లుకు సంబంధించిన రాష్ట్రశాసన సభ సంయుక్త సెలక్ట్ కమిటీ, గ్రామోద్యోగులకు వంశపారంపర్యమైన హక్కును రద్దుపరిచినప్పుడు వారికి ఎట్టి నష్టపరిహారం చెల్లించనవసరం లేదని సిఫార్సు చేసింది.

**4—4—1961**

శ్రీ లాల్ బహద్దూర్ శాస్త్రి దేశవ్యవహారాల శాఖామాత్యు

లుగా నియమింప బడ్డట్లు మంత్రివర్గ సచివాలయం నేడు ప్రకటన చేసింది.

**5—4—1961**

శ్రీకాకుళం సమీపంలో నాగావళి నదిపై రు. 84 లక్షల వ్యయంతో నిర్మించ నుద్దేశించిన పనస నందివాడ ప్రాజెక్టుకు నేడు ముఖ్యమంత్రి శంకుస్థాపన చేశారు.

**6—4—1961**

దండిస్మారక చిహ్నానికి ఈవేళ ప్రధానమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

**7—4—1961**

భారత కమ్యూనిస్టు పార్టీ ఆరవ మహాసభ నేడు విజయవాడలో ఆరంభమైంది.

**8—4—1961**

మద్యపాన నిషేధశాసనం క్రింద నేరస్థులకు ఇప్పటికంటే ఇంకా కఠినమైన శిక్షలు లభించడానికి వీలుగానూ, ఇప్పటి శాసనంలోని కొన్ని లోపాలను తొలగించడానికి వీలుగాను ప్రస్తుత చట్టానికి ప్రభుత్వం కొన్ని సవరణలు తేదలిచినట్టు ఈవేళ ఎక్సైజు, లఘుపరిశ్రమల శాఖామంత్రి శ్రీ కొండలక్ష్మణ్ బాపూజీ గుంటూరులో తెలిపారు.

**9—4—1961**

నేటి నుంచి దేశమంతటా 'రైల్వే వారోత్సవాలు' ఆరంభమైనవి. నేటికి సరిగ్గా 108 సంవత్సరాల క్రిందట దేశంలో మొట్టమొదటి సారిగా రైలు ప్రయాణం ప్రారంభమైంది.

**10—4—1961**

కేంద్రం స్థాపించనున్న భారీ విద్యుత్పరికరాల ఫ్యాక్టరీని చీలదీయకుండా పూర్తిగా ఒకచోట స్థాపించాలని తాను భారత వాణిజ్య పరిశ్రమల శాఖామంత్రికి చెప్పినట్టు ఈ వేళ రాష్ట్ర ఆర్థిక శాఖామాత్యులు కాసు బ్రహ్మానందరెడ్డి పత్రికా ప్రతినిధులతో మాట్లాడుతూ అన్నారు,

**11—4—1961**

ప్రణాళికా సంఘం విడుదలచేసిన అధికారిక పత్రంలో, తృతీయ ప్రణాళికా వ్యయంగా రు. 10,400 కోట్లు పేర్కొనబడింది. ముసాయిదా ప్రణాళిక ప్రకారం ఈ వ్యయం రు. 10,200 కోట్లు మాత్రమే.

**12—4—1961**

ప్రపంచ చరిత్రలో ప్రథమంగా సోవియట్ రష్యా నేడు రోదసీ నౌకలో ఒక వైమానికుడిని అంతరిక్షంలోనికి పంపి సురక్షితంగా నిర్ణీత ప్రదేశంలో క్రిందకు దింపింది. ఈ చైత్ర యాత్ర చేసివచ్చిన సోవియట్ వీరుని పేరు యూరీ ఎ. గగారిన్.

**13—4—1961**

రాష్ట్రపతి డా. రాజేంద్రప్రసాద్ జలియన్ వాలాబాగ్‌లో మృతవీరుల స్మారక స్థూపాన్ని ఆవిష్కరించారు.

**14—4—1961**

జిల్లా కలెక్టర్లు రెవెన్యూ అధికార్లు తృతీయ సమావేశాన్ని ముఖ్యమంత్రి నేడు హైద్రాబాదులో ప్రారంభించారు.

**15—4—1961**

ఆంధ్రప్రదేశ్‌కు ప్రత్యేక రైల్వే మండలాన్ని ఏర్పాటు చేయడానికై రాష్ట్రప్రభుత్వం చేసిన విజ్ఞాపనను కేంద్రం తిరస్కరించడం పట్ల ఆర్థిక శాఖమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి తమ విచారం ప్రకటించారు. నేడు నగరంలో జరిగిన ఒక సమావేశంలో అయన ఈ విషయం ప్రస్తావించారు.

**16—4—1961**

విశాఖపట్నం ఓడరేవువద్ద ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ భీమసేన్ సచార్ ఈవేళ ఎం. వి. "స్టేట్ ఆఫ్ పంజాబ్"-ను నీటిలోనికి వదలిపెట్టారు.

**17—4—1961**

యూనియన్ సమాజాభివృద్ధి శాఖామంత్రి శ్రీ ఎస్. కె. డె, సర్వోదయ పురంలో పంచాయతీ రాజ్యసదస్సును ప్రారంభించారు. రెండు రోజులపాటు ఈ సదస్సు జరిగింది.

**18—4—1961**

పదమూడవ అఖిలభారత సర్వోదయ సమ్మేళనం నేడు సర్వోదయ పురంలో (ఉంగుటూరు) ఆరంభమైంది.

**19—4—1961**

యూనియన్ ఆర్థికమంత్రి శ్రీ మురార్జీదేశాయ్, ఈవేళ లోక సభలో మరికొన్ని పన్నుల మినహాయింపును ప్రకటిచారు. దీనివల్ల ప్రభుత్వానికి సంవత్సరానికి రు. 6.14 కోట్ల ఆదాయం తగ్గుతుంది.

**20—4—1961**

ఆహార ధాన్యాల నిలువపై కొత్తఢిల్లీలో జరిగిన ప్రథమ జాతీయ గోష్ఠిని కేంద్ర ఆహార, వ్యవసాయ శాఖామంత్రి శ్రీ ఎస్. కె. పాటిల్ ప్రారంభించారు.

# రచయితలు

1. శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి, భారతీ నికేతనం, మారుతీ నగర్, మాచవరం, విజయవాడ.
2. శ్రీ కల్లూరి వేంకటసుబ్రహ్మణ్య దీక్షితులు, విజయవాడ.
3. శ్రీ సీరిపి ఆంజనేయులు, అనంతపురం.
4. శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి, రాజమహేంద్రవరం.
5. శ్రీ వేదాంతం గోపాలకృష్ణమాచార్యులు, ఆత్కూరు, కృష్ణాజిల్లా.
6. శ్రీ యామిజాల పద్మనాభస్వామి, మద్రాసు.
7. శ్రీ మునిమాణిక్యం నరసింహారావు, ఆలిండియా రేడియో, హైద్రాబాదు.
8. 'బుచ్చిబాబు', ఆలిండియా రేడియో, పూనా.
9. శ్రీ పోతుకూచి సాంబశివరావు, ఆంధ్ర విశ్వసాహితి, సికింద్రాబాదు.
10. శ్రీ టి. రాజేశ్వరరావు, జర్నలిస్టు, వరంగల్లు.
11. శ్రీ ఆత్మకూరి గోవిందాచార్యులు, సీతారామనిలయం, ఖైరతాబాద్, హైదరాబాదు.
12. శ్రీ కల్లూరి భోగేశ్వరసోమయాజులు, సత్యనారాయణపురం, విజయవాడ.
13. శ్రీ పి. సి. జైన్, సికింద్రాబాదు.
14. శ్రీ మధురాంతకం రాజారాం, మొగరాల, చిత్తూరు జిల్లా.
15. శ్రీ ఇ. రామమోహనరావు, మత్స్యశాఖ డిప్యూటీ డైరెక్టరు, హైద్రాబాదు.
16. కుమారి కమల త్రివేణి, హైద్రాబాదు.
17. అన్నాప్రగడ శ్రీరామమూర్తి, నాదెండ్ల పంచాయతీ సమితి, గుంటూరు.



# ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం

| | | | |
|---|---|---|---|
| వైశాల్యం | .... | .... | 1,06,041 చదరపు మైళ్ళు |
| జనసంఖ్య | .... | ... | 35,977 999* |
| పురుషులు | .... | .... | 18,175,349* |
| స్త్రీలు | .... | .... | 17,802,650* |
| సగటు వర్షపాతం | .... | .... | 35.65" |
| అరణ్య ప్రదేశం | .... | .... | 1,40,26,000 ఎకరాలు |
| జిల్లాలు | .... | .... | 20 |
| తాలూకాలు | .... | .... | 183 |
| రెవిన్యూ సర్కిళ్ళు | .... | .... | 1,000 |
| పట్టణాలు | .... | .... | 293 |
| గ్రామాలు | .... | .... | 26.450 |
| పంటలక్రింది ప్రదేశం | .... | .... | 2,93,81,000 ఎకరాలు |
| కౌళ్ళ సంఖ్య | .... | .... | 42.42.655 |
| 1958-59 లో నీటి పారుదలను పొందిన ప్రదేశం | | .... | 68 లక్షల ఎకరాలు |
| 1958-59 లో వుత్పత్తి అయిన ఆహారధాన్యాలు | | .... | 6,156 లక్షల టన్నులు |
| పాల వుత్పత్తి | .... | .... | 15.5 లక్షల గాలన్లు |
| రైలు మార్గాలు | .... | .... | 3009.13 మైళ్ళు |
| జాతీయ రహదార్లు | .... | .... | 1,415 ,, |
| రాష్ట్ర రహదార్లు | .... | .... | 3593 ,, |
| జిల్లా పెద్ద రోడ్లు | .... | .... | 8220 ,, |
| జిల్లా ఇతర రోడ్లు | .... | .... | 2852 ,, |
| గ్రామాల రోడ్లు | .... | .... | 3442 ,, |
| పాఠశాలలు | .... | .... | 34,157 |
| కళాశాలలు | .... | .... | 69 |
| వృత్తి విద్యా కళాశాలలు | .... | .... | 36 |
| తృతీయ పంచవర్ష ప్రణాళిక ప్రమాణం | | రూ. | 305 కోట్లు |

**1961-62 బడ్జెటు:**

| | | | |
|---|---|---|---|
| ఆదాయం | .... | రూ. | 85.12 కోట్లు |
| వ్యయం | .... | .... ,, | 87.62 ,, |
| పెట్టుబడి ఖర్చు | .... | .... ,, | 34.55 ,, |

*(1961 జనాభా లెక్కల తాత్కాలిక వివరాల ప్రకారం)

